# కొమ్మనాపల్లి గణపతిరావు ఇతర రచనలు

| | |
|---|---|
| రేపిస్టు | అసురవేదం |
| ప్రణయ ప్రబంధం | అసావేరి |
| దేవగాంధారం | నాని |
| మిస్ మేనక I. P. S | హాట్ కిస్ |
| శిలాసనం | గ్రాండ్ మాస్టర్ |
| ది జడ్జిమెంట్ | రోషనారి |
| బ్లాక్ హాండ్ | పడిలేచే కడలితరంగం |
| అగ్నిజ్వాల | భైరవనాదం |
| హంసగీతం | అరణ్యకాండ |
| మేజర్ సంగ్రామ్ | శతదినోత్సవం (త్వరలో |

త్వ ర లో

సూర్యదేవర రామ్మోహన్‌రావు

డిక్టేటర్

# బెటర్ హాఫ్

"ఒక్క మాటలో చెప్పాలంటే ఈ దేశంలో తొంభై శాతం భార్యా భర్తలు బ్రతుకుతున్నది అక్రమ సంబంధాలతోనే...." ఓ స్టేట్ మెంట్ ని అస్త్రంలా సంధించాడు శంకర్.

హఠాత్తుగా ఆ గదిలో నిశ్శబ్దం ఆవరించింది.

"నేను చెబుతున్నది నా అభిప్రాయం మాత్రం కాదు. సైకో అనలిస్టులంతా సర్వేచేసి తెలుసుకున్న వాస్తవమది."

## కొమ్మనాపల్లి గణపతిరావు ఇతర రచనలు

| | |
|---|---|
| శతఘ్ని | అసురవేదం |
| ప్రణయ ప్రబంధం | అసావేరి |
| దేవగాంధారం | నాని |
| మిస్ మేనక I. P. S | హాట్ కిస్ |
| శిలాశాసనం | గ్రాండ్ మాస్టర్ |
| దీ జడ్జిమెంట్ | రోషనారి |
| బ్లాక్ మాంబా | పడిలేచే కడలితరంగం |
| అగ్నిశ్వాస | భైరవనాదం |
| హంసగీతం | అరణ్యకాండ |
| మేజిక్ సంగ్రామ్ | శతదినోత్సవం (త్వరలో |

త్వ ర లో

సూర్యదేవర రామ్మోహన్‌రావు

డిక్టేటర్

# బెటర్ హాఫ్

"ఒక్క మాటలో చెప్పాలంటే ఈ దేశంలో తొంభై శాతం భార్యా భర్తలు బ్రతుకుతున్నది అక్రమ సంబంధాలతోనే...." ఓ స్టేట్ మెంట్ ని శాస్త్రీంలా సంధించాడు శంకర్.

హఠాత్తుగా ఆ గదిలో నిశ్శబ్దం ఆవరించింది.

"నేను చెబుతున్నది నా అభిప్రాయం మాత్రం కాదు. సైకో ఎనలిస్టులంతా సర్వే చేసి తెలుసుకున్న వాస్తవమది."

"అబ్బా ఊరుకోండీ" అంది సీత....శంకర్ భార్య....

భర్త తోచిన ప్రతి విషయాన్నీ యింత దూకుడుగా చెబుతాడని సీతకి ముందే తెలిసినా యీ సమయంలో అదీ ప్రేమించి పెళ్ళి చేసుకున్న శ్రీహర్ష, నిర్ణయల ముందు అందులోనూ డిన్నర్ కని ఆహ్వానించి ఇలాంటి మాటలు చెప్పడం బొత్తిగా నచ్చలేదు.

ఆమె నమ్మకం తప్పు కాలేదు.

శ్రీహర్షలో పెద్దగా స్పందన కనిపించలేదు కాని నిర్ణయ అమితంగా రియాక్టయినట్టు ఆమె ముఖ కవళికలే చెబుతున్నాయి.

"వెళదామా" అంది నిర్ణయ భర్త మొహం చూస్తూ.

సహజంగా సాత్వికుడైన శ్రీహర్ష ఇబ్బందిగా కదిలాడు.

శంకర్ సీతల పెళ్ళిరోజు కావడంతో శ్రీహర్ష నిర్ణయల్ని డిన్నర్ కని ఆహ్వానించింది శంకరే. నిజానికి భార్య అసహనాన్ని చూసి శ్రీహర్ష బయలుదేరేవాడే కాని శంకర్ కేవలం మంచి స్నేహితుడు మాత్రమే కాదు, ఆరునెలల క్రితం అందర్నీ ఎదిరించి ప్రేమించి పెళ్ళి చేసుకున్న శ్రీహర్ష, నిర్ణయలకి భాగ్యనగరంలో బాసటగా నిలిచి ఆసరా యిచ్చిన వాడు. సివిల్ ఇంజనీరైన శ్రీహర్ష ప్రస్తుతం జాబ్ చేస్తున్నది శంకర్ దగ్గరే.

రాజధానిలో కాస్త పేరున్న సివిల్ కాంట్రాక్టరైన శంకర్ ఒక్క శ్రీహర్షకే జాబ్ యివ్వడంగాక ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ అయిన నిర్ణయకీ ఓ పబ్లిక్ సెక్టార్‌లో జాబ్ యిప్పించాడు.

అయిన వాళ్ళందర్నీ కాదని వైజాగ్ వదిలి హైద్రాబాద్ వచ్చి శ్రీహర్ష, నిర్ణయలు యిప్పుడు ధైర్యంగా ఉండగలుగుతున్నది శంకర్ మూలంగానే అన్న ఆలోచన నిర్ణయకి ఏ కొద్దిగా వున్నా యిందాకటి స్టేట్‌మెంట్‌తో అదీ కాస్తా తుడిచిపెట్టుకుపోయింది.

"వెళదామంటే అలా చూస్తారేం" రెట్టించింది నిర్ణయ శ్రీహర్ష రోషంగా చూస్తూ.

"ఇప్పుడింకా రాత్రి ఎనిమిదిన్నరేగా...." కూల్‌గా అన్నా

శంకర్ బయట చీకటిలోకి చూస్తూ. "పైగా అతిథులు అలా ఆవేశపడటం, అర్థాంతరంగా వెళ్ళిపోవటం స్నేహధర్మమనిపించుకోదు...."

"శంకర్" భార్యని ఎలాగూ వారించలేడు కాబట్టి కనీసం శంకర్‌కి అడ్డు పడాలనుకున్నాడు శ్రీహర్ష. "మరేదన్నా మాట్లాడదామా."

"ఆర్గ్యుమెంట్‌కి సిద్ధం కాలేని మనుషులతో ఏం మాట్లాడినా నేరమే కదరా" శంకర్ యథాలాపంగా అనేశాడు ఈ వాక్యం కూడా.

ఇక నిభాయించుకోలేకపోయింది నిర్జయ. "శంకర్‌గారూ....నేను ఈ సిట్యుయేషన్ని వదిలించుకుని వెళ్ళాలనుకుంటున్నది ఆర్గ్యుమెంట్ చేత కాక కాదు....చర్చలో ఓడిన హోస్ట్ మొహం చూసే బాధని తప్పించుకోవాలని."

చురుక్కుమంది శంకర్‌కి. పైగా అలవాటు ప్రకారం అప్పటికే రెండు పెగ్గులు పట్టించి వున్నాడేమో తన సహజ ధోరణిలో వాగ్వివాదానికి సిద్ధపడాలనుకున్నాడు. "అయితే మీరు నా మీద పోరాటానికి ప్రిపేరు కావడం న్యాయం....చెప్పండి నిర్జయా నా స్టేట్‌మెంట్ తప్పంటారా?"

"అబ్బా....మీరూరుకోండీ" మరోమారు అడ్డం పడింది సీత. ఇంజనీరింగ్ డిప్ కంటిన్యూ చేసి మూడేళ్ళ క్రిందట కాంట్రాక్టుల్లో అడుగు పెట్టిన శంకర్‌కి రెండేళ్ళ క్రితమే భార్యకాగలిగిన సీత పెద్దగా చదువుకున్నది కాదు. అయినా ఉన్న కొద్దిపాటి పరిచయంలో నిర్జయ ఎంత ఆవేశపరురాలో అర్థం చేసుకోగలిగింది....కాబట్టే వాతావరణాన్ని తేలిక పరుచుతున్నట్టుగా అంది. "నీకు తెలుసుగా నిర్జయా! దేన్నీ సున్నితంగా చెప్పడం మా వారికి చేతకాదు."

"అలా స్త్రీ జాతిఐక్యతని ప్రదర్శించకే సాధ్వీమణీ...." నవ్వు వెలుతున్నట్టుగా అన్నాడు శంకర్. "అసలు పాయింట్ బాగా పదునైనది అయినప్పుడు సున్నితంగా చెప్పే ఛాన్సెక్కడుందని."

"అంటే మీ ఉద్దేశ్యం ఏమిటి?" నిర్జయ అర్థోక్తిగా జోక్యం చేసుకుంది. "ఈ దేశంలో తొంభై శాతం భార్యాభర్తలు బ్రతుకుతున్నది అక్రమ సంబంధాలతో అంటే అవును స్మీ అంటూ అంగీకరించేయాలంటారు....అంతేనా?"

"తప్పదు....అది సర్వేలో నిర్ధారింపబడిందిగా."

"దాంపత్యాల గురించి యింత చవకబారు అభిప్రాయాల్ని వ్యక్తం చేయడం దారుణం."

"నిర్ణయా" అలా వదిలి పెడితే వాగ్వివాదం ఏ స్థాయికి వెళ్ళేదీ గ్రహించినట్టు అన్నాడు శ్రీహర్ష. "వాడేదో అంటే దానికి సువ్వింతగా రియాక్టవటం...."

"డోంటాక్ లైక్ ఏ నిగ్నోరెంట్ పర్సన్" టక్కున ఖండించింది నిర్ణయ. "ఆయన మీకు ప్రాణస్నేహితుడు అయినంత మాత్రాన మీరు భరించగలరేమోకాని నేను సహించను."

"అయితే యిక టాపిక్‌ని యిక్కడాపేద్దాం" శంకర్ ప్రసక్తిని త్రుంచేయాలనుకున్నాడు.

"ఇంతదాకా వచ్చేక యిక ఆగేదిలేదు మిస్టర్ శంకర్." పసిమి ఛాయలో మెరిసే నిర్ణయ చెంపలు యిప్పుడు యుద్ధానికి సన్నద్ధమైనట్టు అరుణరాగాన్ని నింపుకున్నాయి "చెప్పండి....పెళ్ళయిన ప్రతి అమ్మాయీ పతితే అని సాహసం చేయగల్గిన ఆ సైకో అనలిస్ట్ ఎవడు....అసలు ఏ ఫేక్ట్స్ ఆధారంగా అలా నిర్ణయించగలిగాడు."

అనవసరంగా ఇలాంటి ప్రసక్తి తెచ్చానేమో అనుకున్న శంకర్ అరక్షణంపాటు నేలచూపులు చూసి వెంటనే అన్నాడు. "అసలు మీకు పాయింట్ అర్థమైనట్టు లేదు. అక్రమ సంబంధాలూ అంటే నా ఉద్దేశ్యం భార్యలు పరాయి మగాళ్ళతో భర్తలు పరాయి ఆడవాళ్ళతో సంబంధాలు పెట్టుకోవడం కాదు."

"మరి" నిర్లిప్తంగా చూసింది నిర్ణయ. "అక్రమ సంబంధం అంటే మరో అర్థం కూడా వుందా?"

"అన్యోన్యత వున్న దాంపత్యం క్రమ సంబంధం....అనురాగం లోపించినా యాంత్రికంగా కొనసాగించే దాంపత్యం అక్రమ సంబంధం. అలా కోపంగా చూడకండి నిర్ణయా....ఇదీ సైకో అనలిస్టులు చెప్పిన నిర్వచనం....మీరు అదీ అర్థంచేసుకోకుండా యిప్పటిదాకా ఆవేశపడి పోయారు....తప్పు మీది కాదు....అక్రమ సంబంధాలూ అని మనం తరచూ

ఉపయోగించేది మీరనుకున్న సందర్భాలలోనే కాబట్టి మీరలా అర్థం చేసుకు నుంటారు. సో...." క్షణం ఆగి అన్నాడు. "ఇక మీ కోపం తగ్గిందను కుంటాను."

పది సెకెండ్ల విరామం తర్వాత అంది నిర్ణయ "మీకు బాగా తెలిసినవాటిలో లౌక్యం కూడా ఒకటని నాకు అర్థమైంది శంకర్‌గారూ. కాబట్టే ముందు అసంకల్పితంగా అన్న వాక్యానికి యింకో అర్థం చెప్పి టాపిక్‌ని త్రుంచేశారు. ఓ విషయం చెప్పేదా."

ఇప్పుడింకేం వాగ్యుద్ధానికి దిగుతుందో అన్న బెంగతో చూశాడు శంకర్. "చెప్పండి."

"తొంభై శాతం దాంపత్యాలు యాంత్రికంగా కొనసాగించేవి అన్న పాయింట్‌నీ నేను అంగీకరించను. ఎందుకంటే ఆ యాంత్రికతే నిజమైన నాడు నిజంగా పరాయి మగాడితోనూ, పరాయి ఆడదానితోనూ భార్యాభర్తలు అక్రమ సంబంధాలు పెంచుకునే అవకాశం నిజంగా వుంది కాబట్టి."

షాక్ తిన్నట్టుగా చూశాడు శంకర్.

ఆమె యిలాంటి అభిప్రాయాల్ని వ్యక్తం చేసింది ఆవేశంలోనా లేక తను వ్యక్తిగతంగా నమ్మటం మూలంగానా అన్న మీమాంసలో ఉండి పోయాడు చాలా సేపటిదాకా.

ఎంత చదువుకున్న అమ్మాయి అయినాకాని ఎలాంటి వాతావర ణంలో పెరిగినా కాని ప్రేమించి పెళ్ళి చేసుకుని ఇంకా ఏడాది తిరక్కు ముందే యిలా మాట్లాడ్డం బొత్తిగా నచ్చలేదు.

ఆధునికమైన భావాలుగల అమ్మాయిలు యిలా ఆలోచిస్తారో లేక యిలా ఆలోచించడం ఆధునికత అనిపించుకుంటుందో అర్థంకాని స్థితిలో శంకర్ అవాక్కయి చూస్తుండగానే నిర్ణయ వెళ్ళటానికి సిద్ధపడింది.

శ్రీహర్ష కూడా బయలుదేరుతూ "గుడ్‌నైట్" అన్నాడు అక్కడి చర్చ పెద్ద ప్రభావం చూపించనట్టుగా.

అరనిమిషం గడిచిన తర్వాత అంది సీత. "నిర్ణయని అనవసరంగా బాధ పెట్టారు."

శంకర్ యింకా తేరుకోలేదు.

"ఆ పిల్ల సంగతి తెలిసీ ఎందుకలా రెచ్చగొట్టినట్టు మాట్లాడేరు" మళ్ళీ అంది సీత బాధపడుతూ. "భోజనానికి పిలిచి యిలా చేయడం నాకు నచ్చలేదు"

నుదుట రూపాయిబిళ్ళ సైజు బొట్టుతో సాక్షాత్తూ సీతామహాసాధ్విలా మాట్లాడుతున్న భార్యని అమాంతం దగ్గరకు తీసుకున్నాడు. "నిజం... నిర్ణయ మాటల్ని నువ్వు సమర్థించడంలేదు."

అసలు తను చర్చ ఎంతవరకూ సీతకి అర్థమైందీ అన్నది అతడికి అనుమానమే....అంతగా చదువుకోని భార్య పోరకతనంలో ఉన్న అదృష్టం యిలాంటి సమయాల్లోనే అతడికి బోధపడేది.

"సీతు తెలివి సీతా" బయటికి అనలేదు. మనసులోనే అనుకున్నాడు, "తొంభై శాతం దాంపత్యాలూ అని పైకో అనలిస్టులు చెప్పింది కేవలం ప్రేమించి పెళ్ళి చేసుకున్న దంపతుల గురించి....ఆ విషయం దాచి నిర్ణయ అభిప్రాయం తెలుసుకోవాలనుకుంటే ఆవేశంతో తమదీ ఆ కోవకి చెందిన దాంపత్యమే అని పరోక్షంగా వ్యక్తం చేసి వెళ్ళిపోయింది."

అంటే....శ్రీహర్ష, నిర్ణయలు అన్యోన్యంగా లేనట్టేగా....

అది అపోహ కావచ్చు. అయినా శంకర్ మనసు కలుక్కుమంది.

ప్రేమించి పెళ్ళి చేసుకున్న వ్యక్తులు శ్రీహర్ష, నిర్ణయలు....ఇంకా ఏడాదైనా తిరక్కముందే ఫ్రెష్‌నెస్ కోల్పోయినట్టు అనిపిస్తుంటే-

బాల్యం నుంచే అనాథ శరణాలయంలో పెరిగిన శ్రీహర్ష యీ స్థాయికి రావడానికి ఎన్ని అగచాట్లకి గురయ్యాడో గుర్తుకొచ్చి సాలోచనగా ఉండిపోయాడు.

* * * * *

"బుల్‌షిట్" ఆవేశంగా అరిచింది నిర్ణయ. "ఏమిటి భర్తగా మీరు నాకిచ్చిన సపోర్టు. మీ స్నేహితుడైనంత మాత్రాన, మీకేదో దారి చూపించినంత మాత్రాన నోటికొచ్చినట్టు మాట్లాడుతుంటే మౌనంగా కూర్చుంటారా?"

జవాబు చెప్పలేకపోయాడు శ్రీహర్ష.

ఒక మామూలు విషయానికి నిర్ణయ యింత రాద్ధాంతం ఎందుకు చేస్తున్నదీ అర్థం కాలేదు.

ఎంత కాలమైంది యిద్దరూ మనసారా నవ్వుకుని....

ప్రేమ వయసు రెండేళ్ళయితే పెళ్ళి వయసు ఆరు లేక ఏడు నెలలేగా. ఈ స్వల్ప కాలంలోనే నిర్జయ యిలాంటి అసహనాన్ని చాలా సార్లు వ్యక్తం చేసింది.

"నీకు తెలుసు నిర్జయా....ఆర్గ్యుమెంట్స్‌లో నేను చాలా వీక్‌మనిషిని. అందుకే...."

"వట్టి ఆర్గ్యుమెంట్స్‌లోనే కాదు శ్రీహర్షా" అర్ధోక్తిగా ఖండించింది నిర్జయ. "మీకు చాలా చాలా చేతకాదని తెలిసింది యీ మధ్యనే."

భావరహితంగా నేలచూపులు చూస్తూ వుండిపోయాడు.

తనను పెళ్ళి చేసుకుని నిర్జయ పొరపాటు పడిందేమోకదూ అని బాధాకరమైన ఆలోచన అయినా యీ మధ్య చాలాసార్లు అనుకున్నాడు.

శ్రీహర్ష ఏ స్థాయిలో పెరిగినవాడైనాకాని నిర్జయ కూడా మధ్యతరగతి లేదా మధ్యతరగతిలో కాస్త పైస్థాయికి చెందిన అమ్మాయి. కాకపోతే చదువుకుంది. కాస్త ఆధునికమైన భావాలు కలది. "అప్పర్ మిడిల్ క్లాసు దబ్బున్న తెగకి చెందింది కాకపోయినా ఆ తెగకి చెందినట్టు ఆమె ఆలోచిస్తుంది. అలా ఆలోచించటానికి ఆమెకున్న అర్హత చదువు."

"సారీ" అన్నాడు అంతకుమించి ఏం అనాలో తెలీక.

"దేనికి" ఉక్రోషంగా చూసింది. అలా అతడు సరెండర్ కావడమూ ఆమె కిష్టంలేని విషయమే.

దానికీ జవాబులేదు.

"మిమ్మల్నే" రెట్టించింది నిర్జయ. "దేనికి సారీ అన్నట్టు"

"నిన్ను సరిగా అర్థం చేసుకోలేకపోతున్నందుకు."

"అలా తల వంచుకునేకంటే అలాంటి మంచి ప్రయత్నం చేయొచ్చుగా."

బాధగా గోడకి జారిగిలబడిపోయాడు. "నేను పెరిగింది అనాథల మధ్య అనాథగానే తప్ప ఏ స్థాయిలో కాదు నిర్జయా .... కాబట్టే మనస్తత్వాల్ని అంచనా వేయగల శక్తిలేని దురదృష్టవంతుడ్నయ్యానేమో. ఇలా నువ్వు కలవరపడి కృంగిపోయే కన్నా నన్ను గైడ్ చేయొచ్చుగా ....

నువ్వంటే నాకిష్టం శ్రీహర్షా అని చెప్పిన నిన్ను చూసి భయంగా దూరం జరిగినప్పుడు ఒకనాడు నువ్వు ధైర్యం చెప్పినట్టు-నన్ను కట్టుకుంటే నువ్వు సుఖపడలేవని నేను చెప్పిననాడు కోరుకున్న మనిషికి దగ్గరకావడమే నిజమైన సుఖానికి అర్థం అని నాకు నిబ్బరాన్ని నూరిపోసినట్టు .... మన పెళ్ళికి మీ యింట్లో అంతా తిరస్కరిస్తే అందర్నీ కాదని నా దగ్గరికి వచ్చినట్టు.... యిప్పుడు నేనేం చెయ్యాలి, ఎలా వుంటే నీకిష్టమో కూడా చెప్పి నన్ను ఆదుకోవచ్చుగా...."

"వద్దు....యిలా మాట్లాడి నేను చేసిన పొరపాట్లని సీరియస్‌గా సరిదిద్దుకోను." నిర్జయ ఆవేశంగా బెడ్‌రూంలోకి నడిచింది. ఉద్విగ్నంగా డెకోలావన్ కాట్‌పై వాలిపోయింది.

అసహ్యంగా వుంది....అసలు ఈ 'బెడ్' యివన్నీ యిన్‌స్టాల్‌మెంటు మీద కొన్నవే అన్న విషయం స్ఫురణకి వచ్చి నరకంలా అనిపిస్తోంది.

"హాయిగా బ్రతకాల్సిన వయసులో ఏకోలా బ్రతికేయడం ఏహ్యంగా వుంది"

ఆమె అలా కుమిలిపోతుందే తప్ప తను పుట్టింది పోర్టులో ఓ జూనియర్ ఇంజనీరుకు మాత్రమే అని ముగ్గురు పిల్లలకు తండ్రిగా తన తండ్రి కూడా ఫ్రిజ్ కొన్నది యిన్‌స్టాల్‌మెంట్సులోనే అన్న వాస్తవాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడంలేదు .... కాకపోతే తనను యింగ్లీషు కాన్వెంటులో చదివించాడు....తను మోడరన్‌గా పెరగటానికి కనీసం పెరుగుతున్నాననుకోడానికి అప్పర్ మిడిల్ క్లాసు భేషజాల్ని అలవాటు చేశాడు. అంతే...

"డేమిట్"

ఎక్కడనుంచి తను ఎంతదాకా పడిపోయింది.

కన్నవాళ్ళతో సంబంధాలు తెగిపోయాయి....స్నేహితుల సానుభూతులు ముగిశాయి....ఉదయాన్నే లేవడం, ఫేక్టరీకి వెళ్ళటం, సాయంకాలం రావటం, వంట చేసుకోవడం, తినటం, పడుకోవటం, మళ్ళీ ఉదయం నిద్ర లేవడం....ఎంత యాంత్రికంగా వుంది జీవితం.

తలతిప్పి చూసింది.

శ్రీహర్ష యింకా గదిలోకి రాలేదు.

అప్పటికి ఆమె బెడ్‌రూంలోకి వచ్చి పదిహేను నిముషాలు దాటింది. ఒకవేళ అతను గదిలోకి వచ్చి క్షమార్పణలు చెబితే కాస్త చల్లబడాలనుకుంది.

ఏ విషయంలో అతడు క్షమార్పణలు చెప్పాలీ అన్నది ఆమెకే తెలీదు. కాని తన మూలంగా ఆమె చాలా నష్టపోయిందీ అన్న వాక్యం ఇంకోసారి వినాలని చాలా కోరుకుందిగానీ రాలేదు శ్రీహర్ష.

అది మొండితనంకాదు .... అలాంటి సమయంలో నిర్జయని ఎలా ఓదార్చాలో తెలీని అమాయకత్వం.

ప్రేమరాహిత్యంలో పెరిగిన శ్రీహర్షకి ప్రేమలోని ఔన్నత్యంగాని స్ఫూర్తిగాని అర్థమైంది నిర్జయ పరిచయం తర్వాతనే....సుఖపడటం అన్న పదానికి సరైన నిర్వచనం తెలీని శ్రీహర్ష ఏంచేస్తే నిర్జయ 'అప్పటిలా' ఉంటుందో తెలీక అంతర్మథనానికి గురవుతున్నాడే తప్ప ఆమెను నిర్లక్ష్యం చేయటంలేదు.

ఆలోచనల బడలికతో అలాగే నిద్రపోయిన నిర్జయ ఎవరో తట్టినట్టయి మెలకువలోకి వచ్చింది.

ఉదయసూర్యుడి కిరణాలు వాలుగా కిటికీలో నుంచి పడుతూ ఆమె చెంపల్ని తాకుతున్నాయి.

ఎదురుగా కాఫీ కప్పుతో నిలబడి ఉన్నాడు శ్రీహర్ష. అదికాదు. అసలు రాత్రి ఏమీ జరగనంత మామూలుగా "బెడ్‌కాఫీ" అన్నాడు పక్కన కూర్చుంటూ....

దాంపత్యం కొత్తలో నిర్జయ చేసే పనిని ఈ మధ్యలోనే ప్రారంభించాడు శ్రీహర్ష.

"తీసుకో."

"అవసరంలేదు."

"నీకు అలవాటుగా" సాధ్యమైనంత మృదువుగా అన్నాడు. "ప్లీజ్."

"దయుంచి నన్ను ఫోర్స్ చేయకండి"

"అంటే ఇంకా కోపం పోలేదన్నమాట"

"ఏమిటి మీ ఉద్దేశ్యం" ఆవేశంగా పైకి లేచింది "అక్కడికి మీరు ప్రతిక్షణమూ నా గురించే ఆలోచిస్తున్నారని నేను అనుకోవాలా...."

నిర్లిప్తంగా చూశాడు శ్రీహర్ష. "అది అబద్ధం కాదని నీకూ తెలుసు."

"అలాగా" రోషంతో ఆమె పెదవులు అదురుతున్నాయి "అదే నిజమైతే రాత్రి బెడ్‌రూంలోకి ఎందుకు రాలేదు. కనీసం నన్ను ఓదార్చాలని ఎందుకు ప్రయత్నించలేదు....అంటే....అలా ఏడ్చి ఏడ్చి నిద్రపోక ఏం చేస్తుందన్న ధైర్యమేగా"

"అదికాదు నిర్ణయా...." తల వంచుకుని నేలచూపులు చూస్తూ అన్నాడు. "ఆ సమయంలో వస్తే కనీసం నన్ను నిద్రపోనివ్వవా అంటూ కసురుకుంటావని ఆగిపోయాను."

"అంత రాక్షసిలా మీకు అనిపిస్తున్నానా"

"అనిపించడం కాదు నిర్ణయా.......మొన్న రాత్రి నువ్వు అలాగే ప్రవర్తించావుగా" ఓదార్చబోతుంటే ఆమె ఎలా రియాక్టయిందీ గుర్తుచేసుకుంటూ చెప్పాడు. "అందుకే రాత్రి నేను సాహసం చేయలేకపోయాను"

క్రోధారుణ నేత్రాలతో చూసింది నిర్ణయ. శ్రీహర్ష తన ప్రవర్తనని తాను సమర్థించుకుంటున్నాడనే అనుకుంది తప్ప అతడి మాటల్లోని యథార్థాన్ని గ్రహించలేకపోయింది.

పెళ్ళికి ముందు శ్రీహర్ష గాంభీర్యాన్ని రహస్యత్వంగా భావించిన నిర్ణయ...అరుదుగా మాట్లాడే అతడి స్వభావాన్ని ఆమె మనసారా కోరే మౌన భాషగా ఆలోచించిన నిర్ణయ....ఇప్పుడు అదే ప్రవర్తనకి మరో కొత్త భాష్యం వెదుక్కోవాలనుకుంటూంది.

"మీ గురించి నేను ఓవర్ ఎస్టిమేట్ చేశాను శ్రీహర్షా! అందుకే అనుభవిస్తున్నాను"

జవాబుని ఆశించనట్టు ఉక్రోషంగా టాయిలెట్ కేసి నడిచింది.

నిశ్శబ్దంగా ఉండిపోయాడు శ్రీహర్ష.

క్షణ క్షణమూ దూరం పెరిగిపోతుందని స్పష్టంగా బోధపడుతూంది. కాని కారణం తోచటంలేదు

ప్రపంచానికి ఎక్కువ ఎక్స్‌పోజ్ కాకపోయినా జీవితానికి సంబం

ఖించిన అవగాహనకేలో బాలేని శ్రీహర్ష శిలా మారలేకపోతున్నాడు. తను ఏమిటీ అన్నది అతడికీ తెలుసు. తెలీనిది నిర్ణయకే అని ఇప్పుడిప్పుడు స్పష్టంగా తెలిసిపోతూంది.

అది శ్రీహర్ష తప్పు కూడా కాదు.

పలకరింతగా మొదలైన ప్రేమ పులకింతలై ఆనక కలవరింతై మరింతై కేరింతగా మనసుని ఆకట్టుకోవటం మాత్రం తెలిసిన నిర్ణయ లాంటి అమ్మాయిల ప్రేమ పర్యవసానం ఉండేదిలానే.

అవగాహనకందని మోడరన్ లవ్....

ఆదిలో ప్రపంచమంత విశాలంగా ఉంటుంది.

పెళ్ళనే ఆచరణలో పిపీలికమంత కుంచించుకుపోతుంది.

ప్రేమలో అమ్మాయి స్త్రెండరయ్యేది ప్రియుడిపై గెలుపు సాధించా ననుకున్నాకనే అనే 'ఆల్డో' థియరీ నిజమైతే....ఇదిగో ఇక్కడ నిర్ణయనే ఓ అమ్మాయి అనూహ్యమైన త్యాగం చేశానన్న ఆలోచనతో చాలా నష్ట పోవటానికి సిద్ధపడుతూంది.

శ్రీహర్ష చూస్తూనే వున్నాడు.

అతడితో మాట్లాడమే తనకు సరిపడని విషయం అన్నట్టు నిర్ణయ ఫేక్టరీకి బయలుదేరిపోయింది.

* * * *

"సారీ హర్షా! రాత్రి కాస్త తొందరపడ్డాను"

కన్‌స్ట్రక్షన్ ఆఫీసులో అడుగుపెడుతూనే నొచ్చుకుంటున్నట్టుగా శ్రీహర్షకి సంజాయిషీ యిచ్చాడు శంకర్.

డ్రాయింగ్ టేబుల్ దగ్గర నిలబడి ఏదో బ్లూప్రింట్ చూస్తున్న శ్రీహర్ష మృదువుగా నవ్వేశాడు.

"అదిగో అలా నవ్వకు మహర్షిలా...." స్టేఫ్ తననే గమనిస్తున్నారని బోధపడటంతో గొంతు స్థాయి తగ్గించి అన్నాడు-"ఛాంబర్‌కిరా నితో మాట్లాడాలి"

నిజానికి చాలా మాట్లాడటం కాదు చాలా చాలా అడగాలనిపించింది శంకర్‌కి.

ఒకనాడు శంకర్‌కి తెలిసిన నిర్ణయ వెన్నెలంత చల్లగా నవ్వేది- ముక్తసరిగా మాట్లాడుతూ మెదడుకి పదునుపెట్టే బెణుకును విసిరి శ్రీహర్ష ఎంత అదృష్టవంతుడూ అనిపించేట్టు ప్రవర్తించేది. కాని ఇప్పటి నిర్ణయ మరోలా వుంది........అదే సరిగ్గా ఆ విషయమే అడగాలనుకున్నాడు శంకర్.

శ్రీహర్ష చాలాసేపు జాప్యం చేశాడు.

ప్రస్తుతం అతడి మానసిక స్థితినిబట్టి నిర్ణయకి సంబంధించిన ఏ చర్చా అతడికిష్టం లేదు.

"సర్" మోసీ పిలిచింది. ఎదురుగా వున్న గ్లాస్ డోర్ తెరిచి "బాస్ మిమ్మల్ని పిలుస్తున్నారు" గుర్తుచేసింది మర్సీ.

చాలామందితో ఆకతాయిగా ప్రవర్తించే శంకర్ పర్సనల్ సెక్రెట్రీ శ్రీహర్ష విషయంలో అమితమైన మర్యాదని ప్రదర్శిస్తుంది. గౌరవించదగ్గ చాలా తక్కువమంది మగాళ్ళలో శ్రీహర్ష కూడా ఒకడు అని ఆమె అభిప్రాయం.

వెళ్ళక తప్పదనిపించడంతో నెమ్మదిగా శంకర్ ఛాంబర్లో అడుగు పెట్టాడు శ్రీహర్ష.

"కూర్చో"

నగరంలో ఓ ప్రముఖ కన్‌స్ట్రక్షన్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్‌గా చాలా పేరున్న శంకర్ శ్రీహర్షని తన ఫర్మ్‌లో ఓ ఉద్యోగిగా కాదు. కేవలం తన స్నేహితుడిగానే భావిస్తుంటాడు. అందుకే తన స్టేఫ్ ముందు సైతం 'ఒరేయ్' అంటూ సంబోధించి యిద్దరిమధ్యా గల చనువుని బాహాటంగా వ్యక్తం చేస్తుంటాడు.

"చెప్పు" అనలేదు శ్రీహర్ష. అతడికిష్టమైన ప్రవృత్తుల్లో మౌనం కూడా ఒకటి. కాబట్టే నిశ్శబ్దంగా కూర్చున్నాడు మరెటో చూస్తూ.

"నీకు అభ్యంతరం లేకపోతే మనం పర్సనల్‌గా మాట్లాడుకుందాం" అన్నాడు శంకర్.

కాదనలేడని శంకర్‌కి తెలుసు. అసలు ఎలా కాదనగలడు? పరిచయమయింది, స్నేహంగా మారింది యూనివర్శిటీలో అడుగుపెట్టాకనే అయినా-

ఇంజనీరింగ్ డిస్‌కంటిన్యూ చేసి కాంట్రాక్టుల్లో ప్రవేశించిన శంకర్ ఆ తరువాత కూడా శ్రీహర్ష కాంటాక్ట్ మిస్ కాలేదు.

శ్రీహర్ష పెరిగిన వాతావరణం అతడిని అంతర్ముఖుడిగా మార్చినా అతడి ప్రపంచంలోకి ఆప్యాయంగా నడిచి వచ్చిన మంచి స్నేహితుడు శంకర్. కాబట్టే ఒకనాడు నిర్ణయ ప్రేమ విషయం మొదలుకొని పెళ్ళిదాకా అతడ్ని సంప్రదించాడు. శంకర్ ఉద్యోగం విషయంలో హామీ ఇచ్చాకనే నిర్ణయని పెళ్ళిచేసుకుని సిటీలో అడుగుపెట్టాడు.

"శ్రీహర్షా" శంకర్ గొంతులో ఇందాకటి చిలిపితనం లేదు. ఒక ముఖ్యమైన విషయం చర్చించే సమయంలో ఏ బిజినెస్ మేగ్నెటైనా ప్రదర్శించే సీరియస్‌నెస్ ధ్వనించింది.

"నేను మాటకారిని అవునో కాదో తెలియదు కానీ ఎదుటివ్యక్తి మాటలద్వారా మనస్తత్వాన్ని కొద్దిగానయినా అర్థంచేసుకోగల సత్తాగల వాడ్ని. కాబట్టే అతితక్కువ కాలంలో వ్యాపారంలో ఎదిగానూ అన్నది నా బలమైన నమ్మకం...."

ఆగేడు క్షణంపాటు.

"అసలు యీ చర్చ నీకు ఆమోదం కాకపోవచ్చు. కానీ నీకున్న ఒకే ఒక్క స్నేహితుడిగా అడగకుండా ఉండలేకపోతున్నాను. చెప్పు.... నిర్ణయకీ, నీకూ మధ్య రిలేషన్ ఎలా వుంది?"

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

"కేవలం ఒక రాత్రి జరిగిన చర్చతో మీ దాంపత్యం గురించి నేను అతిగా ఆలోచిస్తున్నాననుకోకు శ్రీహర్షా....నీ శ్రీమతిలో నేను గమనించిన మార్పు క్షణికమైన ఉద్రేకంగా మూలంగానే అయితే పర్వాలేదు. కానీ నాకలా అనిపించలేదు. సబ్ కాన్షస్ మైండ్‌లో పేరుకుంటున్న ఏ అసహనానికో నిన్నటి ఆర్గ్యుమెంట్ అవుట్‌లెట్‌లా వినిపించింది."

నెమ్మదిగా సీటులోంచి లేచి కిటికీ దగ్గరకు నడిచాడు శంకర్. వెనీషియన్ బ్లయిండ్స్ తెరుస్తూ అడిగాడు—"ఈ మధ్య మీ మామగారు మళ్ళీ కాంటాక్ట్ చేశారా?"

నిశ్చేష్టుడిలా చూశాడు శ్రీహర్ష. "మా పెళ్ళితోనే నిర్ణయకి వాళ్ళకి కాంటాక్ట్స్ తెగిపోయాయిగా"

"నిర్ణయ త్రెంచుకోవాలిగా?"

"త్రెంచుకున్నాకనే నాతో వచ్చేసింది"

"త్రెంచుకున్నాక అనుకునేకన్నా త్రెంచుకున్నానని అనుకున్నా కంటే కరెక్టు కావచ్చు శ్రీహర్షా" వెనక్కి తిరిగాడు శంకర్. "ఇలా అంటున్నందుకు బాధపడకు శ్రీహర్షా. నిర్ణయ పెరిగింది చాలా సుకుమారమైన వాతావరణంలో. నిజానికి ఆమె పెళ్ళి తల్లిదండ్రుల అభీష్టం మేరకే జరిగి వుంటే ఆమె యిలా అద్దెకొంపలో వాలిపోవాలని ఆర్థికస్థితిలో బ్రతకాల్సిన అవసరం వుండేది కాదు. ప్రేమనే ఎమోషనల్ అటాచ్‌మెంట్ ఏ అమ్మాయినయినా చాలా సుఖాలకి దూరం చేస్తుంది. చాలా త్వరగా తనేం తప్పు చేసిందీ తెలుసుకునే అవకాశాన్ని ఇస్తుంది. నేను అతిగా ఆలోచిస్తున్నాననుకోకు. కట్టుబట్టలతో నీతో వచ్చిన నిర్ణయ అవన్నీ కంపేర్ చేసుకోవటం మొదలుపెడితే చాలా అసహనానికి గురవుతుంది. అది కాకపోతే నువ్వు అదృష్టవంతుడివే. అదే అయితే సమస్య ప్రారంభం అయినట్టే"

ఆ తర్వాత చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు శంకర్.

శంకర్ అన్న ప్రతి మాటని మననం చేసుకోవడమేగాక ఈమధ్య నిర్ణయ ప్రవర్తన్ని ఆతని ఆలోచనలకి సమన్వయ పరుచుకోవడం ప్రారంభించాడు శ్రీహర్ష.

నిర్ణయలో అశాంతికి అదే కారణమేమో అనిపిస్తుంటే భయంగా వుంది.... అదే అయితే అతడి దగ్గర పరిష్కారం లేదు.

పెళ్ళన్నది నూరేళ్ళ బంధం కాక యిష్టం లేనప్పుడు వెనక్కి తీసుకోగలిగే వస్తువులాంటిది కాదు.

ఒక అనాథశరణాలయంలో పెరిగిన శ్రీహర్ష నిజానికి ఇంజనీరు కాగలిగింది నిర్ణయ తండ్రి అందించిన ఆర్థికమైన సహకారంతోనే. కాబట్టే నిర్ణయ తనపై ఆసక్తి ప్రదర్శిస్తుంటే ఆదిలో వారించాడు.... తనకు తెలిసినంత మేరకి పరిణామాల గురించే తెలియచెప్పాడు. కాని నిర్ణయ వినలేదు.

రేపటి సుఖం అంటే శ్రీహర్షతో పంచుకునే జీవితం మాత్రమేనన్న మరోటి కావంది. అయినవాళ్ళని ఎదిరించి వచ్చేసింది.

ఆమె తండ్రి దృష్టిలో శ్రీహర్ష ఓ విశ్వాసఘాతకుడు. అది శ్రీహర్షని చాలా బాధించిన మాట నిజమే! అయినా సిద్ధయు కోసం ఆ బాధని దిగమింగుకున్నాడు.

"శ్రీహర్షా"

శంకర్ పిలుపుతో తేరుకున్న శ్రీహర్ష బిడలికగా చూశాడు

ఇక రెట్టించలేదు శంకర్.

అర్థమైంది.... శ్రీహర్ష చెప్పలేకపోతున్నా అతడి మౌనం చాలా చెప్పింది

వారం రోజులు ఆకలిని సైతం మౌనంలో దాచుకుని మామూలుగా కనిపించడానికి ప్రయత్నించే అలవాటున్న శ్రీహర్ష యిక్కడా మాటగా నిజం చెబుతాడన్న నమ్మకం లేదు.

అనవసరమైన చర్చతో అతడ్ని బాధించడమే నిజమైతే మళ్ళీ తనే ఓదార్చాలనుకున్నాడేమో మృదువుగా అన్నాడు "నువ్వు భర్త కాగలిగింది ఓ మామూలు అమ్మాయికి కాదు శ్రీహర్ష. డబ్బులో పుట్టి డబ్బులో పెరగడం మాట అటుంచితే బాగా చదువుకున్న ఓ తెలివైన అమ్మాయికి. కాంటే నువ్వు పెళ్ళిదాకా చాలా అదృష్టవంతుడివి కాబట్టి ఆ స్ఫూర్తితో ఆమెకీ అదృష్టవంతురాలే అని నిరూపించగల స్థితికి ఎదగాలి. ఇంకా స్పష్టంగా చెప్పాలి అంటే ఒక మామూలు అమ్మాయి నీ భార్య స్థానంలో వున్నపుడు నువ్వు యిచ్చేదానికన్నా మరింతగా ఆమెకు యివ్వగలగాలి. ఆ యివ్వటం అన్నది డబ్బు మాత్రమే కాదు. ప్రేమ లాలిత్యం....ఎందర్నో కాదని వచ్చినందుకు అందర్నీ మించే తోడు యివ్వగలుగుతున్న నమ్మకం అందించాలి."

బాధగా తలవంచుకున్నాడు శ్రీహర్ష. అది శంకర్ తన దాంపత్యం స్థితిని అంచనా వేయగలిగినందుకు కాదు.... అతడు అనగలుగుతున్న స్థాయిలో తను నిర్ణయకి యివ్వలేకపోతున్నందుకు.

నిర్లిప్తుడిలా చూశాడు శ్రీహర్ష. "మా పెళ్ళితోనే నిర్జయకి వాళ్ళకీ కాంటాక్ట్స్ తెగిపోయాయిగా"

"నిర్జయ త్రెంచుకోవాలిగా?"

"త్రెంచుకున్నాకనే నాతో వచ్చేసింది"

"త్రెంచుకున్నాక అనుకునేకన్నా త్రెంచుకున్నానని అనుకున్నా కంటే కరెక్టు కావచ్చు శ్రీహర్షా" వెనక్కి తిరిగాడు శంకర్. "ఇలా అంటున్నందుకు బాధపడకు శ్రీహర్షా. నిర్జయ పెరిగింది చాలా సుకుమారమైన వాతావరణంలో. నిజానికి ఆమె పెళ్ళి తల్లిదండ్రుల అభీష్టం మేరకే జరిగి వుంటే ఆమె యిలా అద్దెకొంపలో వాలీవాలని ఆర్థికస్థితిలో బ్రతకాల్సిన అవసరం వుండేది కాదు. ప్రేమనే ఎమోషనల్ అటాచ్‌మెంట్ ఏ అమ్మాయినయినా చాలా సుఖాలకి దూరం చేస్తుంది. చాలా త్వరగా తనేం తప్పు చేసిందీ తెలుసుకునే అవకాశాన్నీ ఇస్తుంది. నేను అతిగా ఆలోచిస్తున్నాననుకోకు. కట్టుబట్టలతో నీతో వచ్చిన నిర్జయ అవన్నీ కంపేర్ చేసుకోవటం మొదలుపెడితే చాలా అసహనానికి గురవుతుంది. అది కాక పోతే నువ్వు అదృష్టవంతుడివే. అదే అయితే సమస్య ప్రారంభం అయినట్టే"

ఆ తర్వాత చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు శంకర్.

శంకర్ అన్న ప్రతి మాటని మననం చేసుకోవడమేగాక ఈమధ్య నిర్జయ ప్రవర్తన్ని అతని ఆలోచనలకి సమన్వయ పరుచుకోవడం ప్రారంభించాడు శ్రీహర్ష.

నిర్జయలో అశాంతికి అదే కారణమేమో అనిపిస్తుంటే భయంగా వుంది.... అదే అయితే అతడి దగ్గర పరిష్కారం లేదు.

పెళ్ళన్నది నూరేళ్ళ బంధం కాక యిష్టం లేనప్పుడు వెనక్కి తీసుకోగలిగే వస్తువులాంటిది కాదు.

ఒక అనాథశరణాలయంలో పెరిగిన శ్రీహర్ష నిజానికి ఇంజనీరు కాగలిగింది నిర్జయ తండ్రి అందించిన ఆర్థికమైన సహకారంతోనే. కాబట్టే నిర్జయ తనపై ఆసక్తి ప్రదర్శిస్తుంటే ఆదిలో వారించాడు.... తనకు తెలిసినంత మేరకి పరిణామాల గురించే తెలియచెప్పాడు. కాని నిర్జయ వినలేదు.

రేపటి సుఖం అంటే శ్రీహర్షతో పంచుకునే జీవితం మాత్రమేతప్ప మరోటి కావంది. అయినవాళ్ళని ఎదిరించి వచ్చేసింది.

ఆమె తండ్రి దృష్టిలో శ్రీహర్ష ఓ విశ్వాసఘాతకుడు. అది శ్రీహర్షని చాలా బాధించిన మాట నిజమే! అయినా నిర్మల కోసం ఆ బాధని దిగమింగుకున్నాడు.

"శ్రీహర్షా"

శంకర్ పిలుపుతో తేరుకున్న శ్రీహర్ష బెదరికగా చూశాడు

ఇక రెట్టించలేదు శంకర్.

అర్థమైంది.... శ్రీహర్ష చెప్పలేకపోతున్నా అతడి మౌనం చాలా చెప్పింది.

వారం రోజులు ఆకలిని సైతం మౌనంలో దాచుకుని మామూలుగా కనిపించడానికి ప్రయత్నించే అలవాటున్న శ్రీహర్ష యిక్కడా సూటిగా నిజం చెబుతాడన్న నమ్మకం లేదు.

అనవసరమైన చర్చతో అతడ్ని బాధించడమే నిజమైతే మళ్ళీ తనే ఓదార్చాలనుకున్నాడేమో మృదువుగా అన్నాడు "నువ్వు భర్త కాగలిగింది ఓ మామూలు అమ్మాయికి కాదు శ్రీహర్ష. డబ్బులో పుట్టి డబ్బులో పెరగడం మాట అటుంచితే బాగా చదువుకున్న ఓ తెలివైన అమ్మాయికి. కాంటే నువ్వు పెళ్ళిదాకా చాలా అదృష్టవంతుడివి కాబట్టి ఆ స్ఫూర్తితో ఆమెనీ అదృష్టవంతురాలే అని నిరూపించగల స్థితికి ఎదగాలి. ఇంకా స్పష్టంగా చెప్పాలి అంటే ఒక మామూలు అమ్మాయి నీ భార్య స్థానంలో వున్నపుడు నువ్వు యిచ్చేదానికన్నా మరింతగా ఆమెకు యివ్వగలగాలి. ఆ యివ్వటం అన్నది డబ్బు మాత్రమే కాదు. ప్రేమ లాలిత్యం....ఎందర్నో కాదని వచ్చినందుకు అందర్నీ మించే తోడు యివ్వగలుగుతున్న నమ్మకం అందించాలి."

బాధగా తలవంచుకున్నాడు శ్రీహర్ష. అది శంకర్ తన దాంపత్యం స్థితిని అంచనా వేయగలిగినందుకు కాదు.... అతడు అనగలుగుతున్న స్థాయిలో తను నిర్మలకి యివ్వలేకపోతున్నందుకు.

డబ్బుకి 'కరెన్సీ' రూపమున్నట్టు ప్రేమకి రూపం 'అనురాగం' అయితే అది అందించటానికి తనేం చేయాలీ అన్నది ఖచ్చితంగా అతడికి తెలీదు.

అదే శ్రీహర్ష దురదృష్టమే....

నిర్దయ యిస్తూ పోయిందితప్ప శ్రీహర్ష ఏం యిస్తే ఆమె సంతృప్తి పడుతుందో చెప్పలేకపోయింది యింతవరకూ.

"కొన్ని సమస్యలకి యిదమిద్ధమైన పరిష్కారాలుండవు. ప్రేమన్నదీ అలాంటిదే."

అవాంతరాల మధ్య నిర్బంధాల మధ్య అమోఘంగా వికసించే ప్రేమ అన్నింటినీ అధిగమించిన గెలుపు తర్వాత స్తబ్దతలో కూరుకుపో తుంది.... కారణం అవసరమైనంత మేరకి అంతకు పూర్వమే వికసించింది కాబట్టి. వికసించిన పువ్వుకి ఆయువు తక్కువ.... పెళ్ళిదాకా వచ్చాక రేకల్లా రాలిపోతుంది.... అందుకే ఈ సమస్యనుంచి గట్టెక్కాలీఅంటే ఇలా జరిగే అవకాశముందన్న అవగాహన ముందే వుండాలి.... ఆ మెచ్యూరిటీ చాలు. పెళ్ళయ్యాక సైతం ప్రేమను పదిలంగా కాపాడుకోవచ్చు.

శ్రీహర్ష ఎప్పుడు గది దాటి బయటికి వెళ్ళాడో శంకర్‌కి గుర్తు లేదు.

మోనీ వచ్చి పలకరించింది "మూడీగా వున్నారేమిటి?" తేరుకుంటూ మోనీని ఆపాదమస్తకం చూశాడు.... చీర సైతం జీన్స్‌లా కనిపిస్తూంటే ఆమె అందమైన పొంకం మరింత స్పష్టంగా బహిర్గతమౌతూంది.

నిజానికి మోనీ శారీని కట్టుకున్నట్టు లేదు. చుట్టుకున్నట్టుగా వుంది. ఆదిలో ఆఫీసుకి జీన్స్‌లోనే వచ్చే మోనీని చూస్తూ లుంగమట్టుకుపోయే స్టాఫ్ బాధని గమనించిన శంకర్ ఆమె తప్పనిసరిగా చీర మాత్రం కట్టుకు రావాలని ఆదేశించాడు.... ఆ తర్వాత బాస్ ఆజ్ఞను పాటించడం ప్రారంభించింది. కాని యిప్పుడు మరీ యిబ్బందిగా వుంది.... అలవాటులేని మోనీ చీరకట్టుడు అవయవాల్ని దాచడంకన్నా ఎత్తుపల్లాల్ని యింకా స్పష్టం చేస్తూంది.

"బాగోలేదా" అల్లరిగా నవ్వుతూ చూస్తూంది మోనీ.

ఈ ఆరా తీయడం తన అవయవ సౌష్టవం గురించో లేక తన మూడ్ గురించో ముందు అర్థం కాలేదు.

"ఏమిటి?" అన్నాడు అనాలోచితంగా.

"అదే.... మీ మూడ్...."

ఇప్పుడు పాడయినట్టు అనిపించిన మూడ్ ఖచ్చితంగా ఆమెను చూశాకనే అనబోతూ ఆగిపోయాడు క్షణంపాటు. "ఇప్పుడు బాగుంది."

"ఏమిటి?" రెట్టించింది మళ్ళీ.

ఇంతలా చనువివ్వాల్సింది కాదనుకున్నాడు రోజూలాగే "చెప్పు"

"కొంచెం పెట్టండి" శంకర్ అవాక్కయి చూస్తుంటే ఓ ఫైలు అతడి టేబిల్ పై వుంచింది "నిన్న సగం పెట్టి వెళ్ళారు. అదే సంతకాలు."

ఆమెకు తెలిసిన ఇంగ్లీషుకి సరిగ్గా తెలియని తెలుగును జోడించి కావాలని యిలా ద్వంద్వార్థాల మాటల్ని ప్రయోగిస్తుందని శంకర్ కి తెలీని విషయం కాదు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు.... ఓపెన్ చేయమంటారా?" అంది గొంతుని గుసగుసల్లా పలికిస్తూ "అబ్బా.... ఆ చూపులేమిటి? నేనన్నది ఫైలు ఓపెన్ చేసి పెట్టమంటారా అని."

"మోనీ" ఇబ్బందిగా చూశాడు "ఆఫీసులో అవతల స్టేఫ్ వింటారు"

"నేనేం చేశాను?"

"భాష.... కాస్త భాష కరెక్ట్ చేసుకో."

"నా తప్పుకాదు"

"మరి!?"

"మీరు పదే పదే నన్ను తెలుగు నేర్చుకోమని ఎంకరేజ్ చేస్తున్నారుగా. నేర్చుకోవాలని తరచూ మీ తెలుగు సినిమాలు చూస్తున్నాను."

"అయితే"

"అన్నింటిలో నూ యీ భాషేగా?"

తల పట్టుకున్నాడు.

"ఏమైంది" సహాయం చేయబోయినట్టు ముందుకు రాబోతుంటే వారించాడు.

"అవసరంలేదు.... నేను బాగానే వున్నాను. నాకేం కాలేదు" సంతకాలు పెడుతున్నాడు ఒక్కో పేపర్ని చూస్తూ.... మామూలుగా అయితే జోక్స్ని అమితంగా ఎంజాయ్ చేసే శంకర్ యిప్పుడు అలాంటి వుత్సాహాన్ని ప్రదర్శించలేకపోతున్నాడు.

అసలు రాత్రినుంచే అతడి మూడ్ సరిగ్గా లేదు.

నిస్త్రాణగా సీటులో వెనక్కి జారగిలిన శంకర్ని చూస్తూ అంది "అప్పుడే అయిపోయిందా?"

"ఏమిటి?" ఉలికిపాటుగా అడిగాడు.

"అదే" మోనీలో ఇందాకటి చిలిపితనమే "సంతకాలు పెట్టడం..."

శంకర్ నవ్వలేదు.... మోనీని తదేకంగా చూశాడు.

బద్ధకంగా నిద్రపోతున్న నిశ్శబ్దాన్ని బెడ్మీదికి లాగేయగల జఘనం.... సెక్స్లో రిలిజనిస్ట్ బెడ్పై రివల్యూషనిస్ట్ అనిపించే మోయలేకపోతున్న వయసు భారం.... ట్రాజెడీలో యిరుక్కున్న మగాడి ఆలోచనల్ని 'మేడ్ యీజీ' దిశగా పయనింపచేయగల కాంక్షల దృక్కులు.

"మీ ఆవిడకి తెలిసిపోయిందా" రహస్యంలా అడిగింది.....

"అదే మన సంబంధం గురించి"

ఉన్నట్టుండి భార్య రిఫరెన్స్ వచ్చేసరికి కంగారు పడ్డాడు "అదేం లేదు.... తెలిసే అవకాశం లేదు."

"యూ ఆరె బిగ్ చీట్" గోముగా నవ్వింది "అయితే ఈరోజు మనం గెస్టహౌస్కి వెళదామా?"

వారానికి ఒకటి అరా సాయంకాలం గెస్టహౌస్లో సెలిబ్రేట్ చేసుకోవడం యిద్దరికీ అలవాటే.

"బాస్ టెండర్ ఓపెనింగ్కి వెళ్ళారని మేడమ్కి ఫోన్చేసి చెబుతా" అంది రాత్రి ఎంగేజ్మెంట్కి తను టెండర్ పెడుతూ....

"ఓ.కే." శంకర్లో అణువంత వుత్సాహం "ఇట్స్ నైస్"

రివాల్వింగ్ ఛెయిర్లో రిలాక్సవుతూ అనుకున్నాడు.

ఇప్పుడు సీత ఏం చేస్తూ వుంటుంది.

వంట చేస్తూ వుంటుంది. లేదూ అంటే సుమంగళిగా పోవటానికి అవసరమైన నోముల గురించి, వ్రతాల గురించి పక్కింటి ఆడవాళ్ళ దగ్గర ఆరాతీస్తూ ఉంటుంది.

ఉదయాన్నే నిద్రలేచి తాళిబొట్టు కళ్ళకు అద్దుకోవడం....తలంటు స్నానం.... పూజ గదిలో గంటల మోత....చేతిలో హారతిపళ్ళెం....బెడ్ మీదున్న తనను చూసి వ్యాపారంలో అలసట గురించి బాధని ప్రకటించ డము....ఆఫీసుకి వెళ్తుంటే మీ ఆరోగ్యం జాగ్రత్తలా....

"ప్లేస్ ఫార్వార్డా?" అడిగింది మోనిక. "అదే....సాయంకాలం మనం గెస్ట్‌హౌస్‌లో ఎలా గడపబోయేదీ గుర్తుచేసుకుంటున్నారా ?"

చెప్పలేదు తనేం ఆలోచిస్తున్నాడో. కాని నిర్ణయని గుర్తుచేసు కున్నాడు.

సీత వచ్చింది ఓ మధ్యతరగతి కుటుంబం నుంచి అయితే నిర్ణయ అప్పర్ మిడిల్ క్లాసుకి చెందిన అమ్మాయి. పైగా సీతకంటే బాగా చదువు కున్నది. ప్రపంచాన్ని అర్థం చేసుకోగల జ్ఞానం వున్నది.

ఇక తననీ శ్రీహర్షనీ పోల్చిచూస్తే శ్రీహర్ష తనకన్న సాత్వికుడు. భర్తగా తనను మించిన నిజాయితీపరుడు. ఒక్కమాటలో చెప్పాలీ అంటే తను బ్రతకనేర్చినవాడైతే శ్రీహర్ష బ్రతకడాన్ని నేర్చుకుంటున్నవాడు.

తాత్వికంగా రెండింటికీ పెద్ద తేడా లేదు. కానీ మెటీరియలిస్టిక్‌గా ఆలోచిస్తే రెండింటికీ అసాధారణమైన వ్యత్యాసముంది. నీతికి అవినీతికి వున్నంత భేదముంది.

ఆలోచించినదానికి చెప్పేదానికీ చేసేదానికీ పొంతనలేని జీవితం తన దైతే—త్రికరణశుద్ధిగా బ్రతకడం శ్రీహర్షకి అబ్బిన అరుదైన గుణం.

అలాంటి శ్రీహర్ష నిజానికి తనకంటే ఎక్కువగా భార్యతో ప్రేమించబడాలి.

తను అవసరానికి మించి ఆలోచిస్తున్నాడా?

నిర్ణయ శ్రీహర్షని ప్రేమించటంలేదని ఎందుకనుకుంటున్నాడు....

ఇలా అనుకోవటం సంతృప్తిగా వుంది.

నిజమే....ఒక చిన్న చర్చతో నిర్ణయని తను అండర్ ఎస్టిమేట్ చేస్తున్నాడేమో.

"ఏమిటి అంతలా ఆలోచిస్తున్నారు?" మోనిక అడిగింది సీరియస్‌గా.

ఇంత మూడీగా శంకర్‌ని చూడటం ఆమెకు అలవాటు లేదు.

"ప్రేమ వివాహాల గురించి నీ అభిప్రాయం ఏమిటి మోనీ ?"

మోనీ పెదవులు మృదువుగా విచ్చుకున్నాయి. "మనకా ఛాన్స్‌లేదు. ఎందుకంటే నాకు పెళ్ళయిపోయింది కాబట్టి."

"నో జోక్స్! సీరియస్‌గా అడుగుతున్నాను"

"ఉన్నట్టుండి ఈ టాపిక్కేమిటి" తన గదిలోకి రాకముందు శ్రీహర్ష ఉండటాన్ని ఆ తర్వాతనే శంకర్ యిలా మూడీగా మాట్లాడాన్ని సమన్వయపరుచుకుంది మోనీ. శ్రీహర్ష దాంపత్యం గురించి తెలీకపోయినా అతనిది శామ్‌రేజ్ అని మాత్రం తెలుసు. "బహుశా మీరు శ్రీహర్షగారి విషయం రిఫర్ చేస్తున్నారనుకుంటాను."

సాలోచనగా చూశాడు శంకర్.

"ప్రేమ గురించి డిఫిన్ చేసే శక్తి లేని నేను ప్రేమ వివాహాల గురించి ఏం చెప్పగలను? బట్ అయామ్ షూరాఫ్ వన్ థింగ్...." క్షణం ఆగి అంది "శ్రీహర్షలాంటి భర్త నాకు ఉండివుంటే మీతో సంబంధం పెట్టుకునేదాన్ని కాదు."

ఒక్క వాక్యంతో కేవలం కొన్ని పదాల అల్లికతో శ్రీహర్ష ఔన్నత్యం గురించి చెప్పగలిగింది మోనీ. అలా ఎక్స్‌ప్రెస్ చేయడంలో తనను తాను కించపరచుకోటానికి వెనుకాడలేదు.

ఎందుకో మోనీ అభిప్రాయం విన్నాక చాలా ప్రశాంతంగా వుంది.

నిజమే....అరుదైన వ్యక్తిత్వం గల శ్రీహర్ష ఎలాంటి స్త్రీ అయినా కోరుకోగల అపురూపమైన లక్షణాలు గల శ్రీహర్ష సుఖంగానే వుంటాడు.

'ప్రేమ' నేదీ ఒక ఉదంతం తప్ప పెళ్ళితో అది విషాదానికి అంతం కాదు, కానేరదు. ఇదే నిజం కానినాడు 'ప్రేమ'కి సంకీర్ణమైన విశ్వరహస్యంగా మరో నిర్వచనం ఉండేది కాదు.

ప్రపంచాన్ని చాలా చదవగలిగిన శంకర్‌లాంటివాళ్లా యీ విషయ ములో పొరపాటుపడటం చాలా సహజమైన విషయం.

*          *          *          *

"ఎక్స్‌క్యూజ్మీ" గ్లాసు డోర్ తెరుచుకుని లోపల అడుగుపెట్టిన నిర్ణయ పిలిచింది రాధేశ్యాంని.

ఏకాగ్రతగా వాక్‌మెన్ వింటున్న రాధేశ్యాం ముందు ఆమెను గమ నించలేదు.

"మిమ్మల్నే" మరోసారి పిలిచింది.

"ఓహ్" తేరుకున్న రాధేశ్యాం వాక్‌మెన్ని స్విచాఫ్ చేసి చూశాడు. "సారీ....ఇప్పుడే వచ్చారా?"

ప్రాతికేళ్ళు మించని రాధేశ్యాంకూడా అదే ఫేక్టరీలో నిర్ణయతోపాటు పనిచేస్తున్న ఆమె కొలీగ్. ఎలక్ట్రానిక్స్‌లో పోస్టుగ్రాడ్యుయేట్. ఎప్పుడూ హుషారుగా, ఆకతాయిగా గడిపే యువకుడు మాత్రమే కాదు—ఆ ఫేక్టరీ మేనేజింగ్ డైరెక్టరుకి కాబోయే అల్లుడు కూడా. కాబట్టే అతడికి ఎదురు లేదంటుంటారంతా.

ఫేక్టరీ జనరల్ మేనేజర్ సైతం శ్యాంని చాలా గౌరవించటానికి అదే కారణం కూడా.

"మెషిన్ డిజిటల్ సిస్టమ్ ప్రాబ్లమిస్తుందని షాప్ నుంచి ఫోన్ వచ్చింది. బాస్ మనల్ని రమ్మంటున్నారు" అంది ఇంకా కదలని శ్యాంని చూస్తూ.

ఎలక్ట్రానిక్స్ డిపార్ట్‌మెంట్‌లో ఇంజనీరు ట్రయినీగా నిర్ణయ అతడ్ని ఆదేశించలేదు. ట్రయినీగా రెండేళ్ళపాటు అతడి ఆధ్వర్యంలోనే ఆమె నేర్చు కోవాలి. అంతకుమించి అతడి బేక్‌గ్రౌండ్ తెలిసి వుండటంతో తనూ అత డితో కలుపుగోలుగా ఉండటం అలవాటు చేసుకుంది.

"వెళదామా?"

"ఓహ్ షిట్...." ఇబ్బందిగా అ[illegible]?

మృదువుగా నవ్వింది "ఓ అయిదు నిమిష[illegible]

"ఓకె....అడిగింది మీరు కాబట్టి కాదనలేకపోతున్నాను" బయలు దేరాడు వాక్ మెన్ రేక్‌లో వుంచి. "ప్రతి చిన్న సమస్యకీ మనల్ని షాప్‌కి పిలవటం వీళ్ళకి అలవాటైపోయింది కదూ ?"

ఫేక్టరీని కాలేజ్‌లాగే భావించే శ్యాం మాటలకి ఆమె నవ్వకుండా ఉండలేకపోయింది.

ఓ పెద్ద పబ్లిక్ ఫేక్టరీ మేనేజింగ్ డైరెక్టరుకి కాబోయే అల్లుడిగా తెలిసిన చాలామంది రాధేశ్యాంతో చనువు పెంచుకోటానికి ఎంతగా ప్రయత్నించేదీ ఆమె చూస్తూనే వుంది.

అయిదే అయిదు నిమిషాల్లో ప్రాబ్లంని సాల్వ్ చేశాడు శ్యాం.... ఇదీ ఆమెకు చాలా ఆనందాన్ని కలిగించే విషయమే.

అతడెంత నిర్లక్ష్యంగా ప్రవర్తించినాకాని సబ్జెక్టులో అమోఘమైన డెప్త్ గల వ్యక్తి. కాబట్టే నిమిషాల్లో సమస్య పరిష్కారమైపోతూ ఉంటుంది.

"వాక్ మెన్ వింటారా ?" అన్నాడు తన ఆఫీసు రూంలోకి తిరిగి రాగానే.

"ఇట్స్ ఓకే" మృదువుగా తిరస్కరించబోయిందికాని విడిచిపెట్ట లేదు శ్యాం.

"మామూలు అమ్మాయిల్లా మీరు మోడెస్టీని ప్రదర్శించడం నాకు నచ్చదు."

నవ్వేసింది. మామూలుగా కాదు-చిరు గర్వంగా. తను అందరిలాంటి అమ్మాయిని కాదన్నట్టు ప్రత్యేకించి అతడప్పుడూ మాట్లాడ్డం గర్వంగా అని పిస్తూ వుంటుంది.

"ఇట్స్ డేంజరస్"

"ఏమిటి?" విస్తుపోతున్నట్టుగా చూసింది.

"నాతో కలిసి హస్కు కొట్టడం కాదు....కేసెట్ పేరు....యా.... మైకేల్ జాన్సన్ రిలీజ్ చేసిన న్యూ ఆడియో అల్బమ్....డేంజరస్."

ఉత్సుకతగా చూసింది.

ఈమధ్యనే 'డేంజరస్' అల్బమ్ విడుదలైనట్టు ఎక్కడో చదివింది. కాని వినాలన్నా ఎలా సాధ్యమౌతుందని? అల్బం మాత్రమే కాదు—టేప్ రికార్డరూ కావాలి. ఇప్పుడిప్పుడే సంసారానికి కావాల్సిన చాలా అవసరాల్ని కూర్చుకుంటున్న తను టేప్‌రికార్డర్‌ని కొనడం అంటే మాటలుకాదు. బాల్యంనుంచీ పెంచుకున్న చాలా అలవాట్లని పెళ్ళితో సమాధి చేసేయడం అలవాటు చేసుకుంది.

"ఏమిటి మౌనం?" టేబుల్‌కి అవల ఆమెకు అభిముఖంగా కూర్చుని అడిగాడు "మిమ్మల్ని విసిగిస్తున్నానా ?"

"అబ్బే!" తొట్రుపడింది. తన మొహంలో భావాల్ని అతడు చదివేయటం ఇష్టంలేనట్టుగా "ఫేక్టరీలో వినటం ఏం బాగుంటుందా అని."

"అంటే....నేను చేస్తున్నది బాగోని పనని పరోక్షంగా చెబుతున్నారన్నమాట."

"భలేవారే....మీరంటే చాలా పలుకుబడిగల వ్యక్తి"

"నా మనిషిగా మీరూ అంతేగా" టక్కున అనేశాడు.

క్షణంపాటు అతడి కళ్ళలోకి చూసి వెంటనే తల తిప్పుకుంది.

"సారీ" నొచ్చుకుంటున్నట్టుగా అన్నాడు. "నా మనిషిగా అంటే నా ఉద్దేశ్యం మీ కోసం నేను దేనికైనా సిద్ధపడతానని"

'దేనికైనా' అనే పదాన్ని ఒత్తిపలకడం ఆమె గమనించిందిగాని ఆమె దానికంతగా ప్రాధాన్యత నివ్వలేదు.

ప్రాధాన్యత నివ్వటానికి కంగారు పడటానికి ఆమె వచ్చింది మోడరన్ మధ్యతరగతి నుంచి....కాలేజీ స్థాయిలో అబ్బాయిలూ, అమ్మాయిలూ ఒకరిపై మరొకరు జోక్స్ కట్ చేసుకోవడంగాని ఒక్కోమారు శృతిమించినా పట్టించుకోకుండా ఈజీగా తీసుకోవటం గాని ఆమెకు అలవాటే....ఇక్కడ ఆమెకు సంతృప్తినిస్తున్న విషయం అది కూడా కాదు.... చాలా అశాంతిగా ఉనికి కోల్పోయినట్టు బ్రతుకుతున్న దాంపత్య జీవితంలో చాలామంది వెంటపడే శ్యామ్ యిలా తన వెంట పడటం ఆనందంగా వుంటూంది.

ప్రతిరోజూ పనిగట్టుకుని ఏవో ఒక సమయంలో శ్యామ్ ఇలా మాట్లాడ్డం ఆమె మాత్రమే కాదు- అదే ఆఫీసు గదిలో వుంటున్న చాలా మంది గమనిస్తున్నారు. ఆ విషయమూ ఆమెకు తెలుసు.

"మీరేం అనుకోనంటే ఇప్పుడు మీరెలా ఉన్నారో చెబుతాను...." రహస్యంలా అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు రోజూలాగే.

"లైకెవర్జిన్‌లో మాడోన్నాలా...."

"నేను వర్జిన్‌ని కాదు" ఈ జవాబు చెప్పటానికి ఆమె సంకోచించ లేదు. అసలు సంకోచించటం అవివేక మనిపించే ఆధునిక భావాలుగల అమ్మాయి నిర్ణయ "నిజం శ్యామ్! యూ నో అయామ్ మేరీడ్ వుమన్."

"అదే విచిత్రం! మీరు చెబితే తప్ప కొత్తవాళ్ళు పొరపాటు పడేంత వర్జిన్ గాళ్‌గా కనిపిస్తారు."

ఆమె అతడ్ని అసహ్యించుకోలేదు. సీరియస్‌గానూ చూడలేదు. ఒక అసంతృప్తి జీవితంలో నుంచి భ్రాంతిలాంటి కొత్త వాస్తవంలోకి తొంగి చూడాలనే ఉద్విగ్నతతో అతడి మాటల్ని వింటూంది.

"పాప్ సంగీత ప్రపంచంలో అడుగుపెట్టిన మాడోన్నా ఇండియా లోనే పుట్టి వుంటే బహుశా మీలాగే యీ చిన్న జీవితానికి కుంచించుకు పోయేది. నిర్వీర్యంగా, నిస్పృహగా, స్తబ్దుగా యిప్పటి నిట్టూర్పుల కేరిం తల శృంగారమయ జీవితానికి అతీతురాలై బ్రతకాల్సి వచ్చేది..... మీకు తెలుసా....పంతొమ్మిదీ వందల డెభ్భై ఎనిమిదిలో మాడోన్నా కూడా తండ్రిని కాదని, సొంత వూరు వదలి న్యూయార్క్‌కి పారిపోయి వచ్చింది. మీలాగే....కాకపోతే పెళ్ళి చేసుకుని కాదు....ఒంటరిగా."

"ఓకే...." ఇక చాలన్నట్టుగా చూసింది నిర్ణయ. ఇంకా వినేదే..... కానీ 'తండ్రి' రిఫరెన్స్‌తో ఆమె మూడ్ చెడిపోయింది తను అనుభవించా ల్సిన చాలా ఆనందాలు కోల్పోవటానికి తండ్రి తన ప్రేమని తిరస్కరించి సంబంధ బాంధవ్యాలు త్రెంచుకోవటం కూడా ఒకటని ఆమె బలంగా నమ్ముతూంది. "లంచ్‌కి వెళదామా?"

కొలీగ్స్ అందరితో బాటు కేంటీన్‌లో లంచ్ చేయటం నిర్ణయకి అలవాటు.

"అంటే నేను బోర్ కొడుతున్నానన్నమాట"

"అదేం లేదు....లంచ్ టైమ్ అయిందని గుర్తుచేస్తున్నాను."

"చూసేనా...." వాచీ చూసుకుంటూ అన్నాడు "లంచ్ టైం అయిన విషయమూ నాకు గుర్తుకు రాకుండా గడిచిపోయిందింతసేపూ."

ఈ స్టేట్‌మెంట్ కూడా ఆమె అహాన్ని చల్లార్చే మరొక అస్త్రంలా పనిచేసింది.

"ఈ రోజు మనిద్దరం ఇక్కడే భోంచేద్దాం" ప్రపోజల్ చేశాడు.

పదీ సెకెండ్ల పాటు శ్యామ్‌ని తదేకంగా చూసింది.

"మీకు అభ్యంతరమైతే ఇలా అడిగినందుకు క్షమించండి"

ఉన్నట్టుండి ఆమెకు శ్రీహర్ష గుర్తుకొచ్చాడు. నిన్న రాత్రి తను బాధపడుతూ బెడ్‌రూమ్‌లో ఒంటరిగా పడుకుంటే కనీసం ఓదార్చాలని ప్రయత్నించలేదు. కానీ యిక్కడ ఓ ఖరీదయిన అబ్బాయి తనను అర్థిస్తున్నాడు.

సరైన శిక్షణ లేని వాతావరణంలో పెరిగిన అమ్మాయి కొన్ని అరుదయిన క్షణాల్లో ఎలా విచక్షణ కోల్పోయేదీ తెలియచెప్పే సంఘటన అది.

"మీరు జవాబు చెప్పలేదు" గుర్తుచేశాడు శ్యామ్.

"మీరింకా పెళ్ళెందుకు చేసుకోలేదు మిస్టర్ శ్యామ్?" నిర్లిప్తంగా అడిగింది.

ఉలిక్కిపడ్డాడు ఉన్నట్టుండి ఆమె ఇలాంటి ప్రసక్తి తీసుకురావడంతో.

"చేసుకునేవాడ్నే—కానీ అందులో థ్రిల్ ఇప్పటిదాకా అర్థంకాలేదు."

అదోలా చూసింది నిర్ణయ. "ఇప్పటిదాకా అంటే?"

"మరోలా అనుకోకండి....మిమ్మల్ని చూసేదాకా...." నిర్ణయ మరోలా రియాక్ట్ అవుతుందేమో అని వెంటనే అన్నాడు "నేను ఎగ్జాగ

రేట్ చేయడంలేదు మిస్ నిర్ణయా....కొంతమంది పరిచయమయ్యాక ఏం నష్టపోయామో తెలుసుకుంటాం....మరికొంత మందిని చూస్తే నష్ట పోకుండా వుండాలంటే ఏం చేయాలో అర్థం చేసుకుంటాం."

ఆమెకు అర్థంకాలేదు అతడు చెబుతున్నదేమిటో....అంతకన్నా అర్థం చేసుకునే ప్రయత్నం ఆమె చేయలేదంటే సవ్యంగా వుంటుందేమో. జీవితంలో మిగిలింది వెలితి మాత్రమే అనే నిరాశావాదంతో ఆలోచించే తెలివైన అమ్మాయిలు సైతం ఎలాంటి వలయాల్లోకి నెట్టబడతారూ అన్నది అనుభవంతో తప్ప బోధపడని విషయం....

రాధేశ్యాంలు చాలాచోట్ల చాలా రూపాల్లో దర్శన మిస్తుంటారనీ, వాదనకన్నా అవకాశవాదంతో రడీగా వున్న ఆలోచనల గారడీతో మెత్తగా లోతులకి చొచ్చుకు పోగలరని తెలిసినా అంతగా పట్టించుకోరు....కారణం ఒక్కటే....కొంత అహం....మరికొంత తమపై తమకున్న నమ్మకం.

"ఎమ్.డి.కి నేను కాబోయే అల్లుడనని మీకు తెలుసనుకుంటాను."

సాలోచనగా చూసింది నిర్ణయ.

"కోట్ల ఆస్తి. ఒక్కగానొక్క కూతురు....చాలా గారాబంగా పెరి గిందేమో కొంతకాలం జీవితాన్ని ఎంజాయ్ చేసి ఆ తర్వాత పెళ్ళి చేసు కుందాం అనుకునే మనస్తత్వం. మీకింకా అర్థమైనట్టు లేదు....స్టేట్స్‌లో చదువుకుంటున్న అనూహ్యకి ఈ మధ్యనే అబార్షనైంది."

నిశ్చేష్టురాలిలా చూసింది నిర్ణయ.

"కారణం నేను కాదు. అయినా ఆరోగ్యం పాడైనందుకు ఓ ఏడాది పాటు పెళ్ళి పోస్ట్‌పోన్ చేసుకుందామంది. నేను ఓ.కె. అన్నాను."

అతడి మాటల్లోని నిజానిజాలు గ్రహించే స్థితిలో లేదు నిర్ణయ.

"ఇంత జరిగినా మీరు...."

నవ్వేశాడు వీలైనంత నిర్మలంగా. "మీరు అడగబోతున్నదేమిటో నాకు అర్థమైంది నిర్ణయా. నేను కారణం కాకుండా కడుపైన అనూహ్యని పెళ్ళెలా చేసుకోబోతున్నానూ అన్నది మీ ఆలోచన అయి వుంటుంది. ఒక్కమాటలో చెప్పాలీ అంటే నాకే చేస్టిటీల మీద నమ్మకంలేదు. అంతెం

మకు....ఎనభై శాతం పెళ్ళికి ముందే శీలాన్ని కోల్పోతున్న అమెరికాల్వ పురోగతి ఏమైనా ఆగిపోయిందా....ప్రపంచంలో ఇప్పటికీ అదీ అగ్ర రాజ్యమేగా."

"అది కాదు మిస్టర్ శ్యాం. అనూహ్య అమెరికాలో చదువు కుంటున్నా ఆమె యీ దేశానికి చెందిన అమ్మాయి. ఇక్కడ సాంప్రదా యాల మధ్య పెరిగిన ఆడపిల్ల."

"సర్‌ప్రయిజ్ నిర్ణయా" బోలెడంత ఆశ్చర్యాన్ని ప్రకటించాడు. "ఈ తరానికి చెందిన మీరు యిలా ఆలోచించటం రియల్ సర్‌ప్రయిజ్ ఫర్ మి....ఏం....పెళ్ళికి ముందుగాని పెళ్ళయిన తర్వాతగాని ఇష్టమైన అబ్బాయితో ఆడపిల్ల తిరగడం తప్పెలా అవుతుంది. పెళ్ళయినంత మాత్రాన భర్తకి నచ్చిన సినిమా భార్యకీ నచ్చాలని రూల్ ఏముందీ....ఒకరి కొకరు నచ్చేట్టు ప్రవర్తించొచ్చుకాని చచ్చినట్టు అలా ప్రవర్తించి తీరా లంటే మన తరం ఎలా అంగీకరిస్తుంది. మీలా ఆలోచించేది మధ్య తర గతి వ్యక్తులు. కాబట్టి యిలాంటి చిన్న విషయాల్ని భూతద్దంలో నుండి చూడకూడదు. చూస్తే మన స్థాయి ష్రింక్ అయినట్టే నిర్ణయా....అంతెం దుకు. మీ వార్ని మీరు ప్రేమిస్తూండొచ్చు. సిన్సియర్‌గా అతడితో మీరు సెక్స్‌నీ పంచుకుంటూండొచ్చు. అంతమాత్రం చేత మీకిష్టమైన మరో అబ్బాయిని మీరు కావాలని కోరుకోకుండా వుండగలరా....?"

నిర్ణయ యిక వినలేనట్టు పైకి లేచింది.

ఎందుకో ఈ చర్చ చాలా కృతకంగా అనిపించింది.

జీవితమంటే విచ్చలవిడిగా బ్రతకడమనే సిద్ధాంతం ఆమెకు వెగ టుగా వుంది.

శ్యాం గురించి పట్టించుకోకుండా లంచ్‌కి వెళ్ళిపోయిన నిర్ణయ ఆ తర్వాత అతడి మాటలు గుర్తొస్తుంటే సాయంకాలందాకా ముభావంగా గడిపేసింది.

శ్యాం ఓరకంట ఆమె కదలికల్ని ఆమె ముఖ కవళికల్ని గమనిస్తు న్నట్టు ఆమెకు తెలీదు.

రేట్

నష్ట కొండరాతిని పేల్చాలీ అంటే రాతినే తవ్వనక్కర్లేదు. దీగువగా డైనమైట్ పెట్టే చిన్న ఖాళీ దొరికితే చాలు.

ఈ సూత్రం తెలిసిన శ్యాం డ్యూటీ ముగుస్తుండగా అన్నాడు. "డేంజరస్ అంటే మీకిష్టమనుకుంటా."

ప్రమాదంలో బ్రతకడం మీకిష్టమా అని అడిగినంత సామాన్యంగా వినిపించింది అతని కంఠం "మీరు కావాలీ అనుకుంటే రికార్డర్, కేసెట్ పట్టుకు వెళ్ళి వినండి.... మరేం లేదు.... మనిద్దరి టేస్టులూ కలిశాయి కాబట్టి ఈ రాత్రికి మీరు వింటే రేపు మనం దాని గురించి డిస్కస్ చేసుకో వచ్చు."

ఇద్దరి టేస్టులూ కలిశాయన్న మరో ప్రయోగంతో ఆమెకు వాక్ మెన్ యివ్వబోయాడు.

ఆమెకు తీసుకోవాలనిపించలేదు.... అయిష్టత కాదు. ఆ మాత్రం దానికి అతడిపై ఆధారపడటం నచ్చవ్.

సాయంకాలం శ్రీహర్షతో వెళ్ళి కొనుక్కోవాలి.... ఏమంత పెద్ద కోరికని.... ఇందాక రికార్డర్ కొనుక్కోవటం గురించి మధ్యతరగతి ఆడపిల్లలా ఆలోచించిన నిర్ణయ యిప్పుడు ఎలాగైనా కొనాలన్న నిర్ణయాని కొచ్చింది.

కొనడం వలన ఏదో ఒరుగుతుందని కాదు.... తను అనుకున్నది చేసి తీరాలన్న అరిస్టోక్రసీ భావం....

"ఏంటి ఆలోచిస్తున్నారు" అడిగాడు శ్యాం....

"నేను కేసెట్ ఎలా వున్నదీ రేపు చెబుతాగా" అంది సుతిమెత్తగా తిరస్కరిస్తూ.

ఎన్ని ఆలోచనల వలయాల్లో ఆమె మనసు సుడులు తిరుగుతుందో శ్యాంకి తెలీదు.

కాని వెళ్తున్న నిర్ణయని చూస్తూ నవ్వుకున్నాడు అణువంత ఉన్మాదంతో.

"ఎంతవరకూ వచ్చింది" అడిగాడు రాధేశ్యాంకి స్నేహితుడైన నివాస్.... "ట్రాక్‌లోనే వుందా?"

"లేదు.... రప్పిస్తున్నాను. అలా రప్పించడం కోసం అనూహ్య విషయంలో ఓ మంచి కట్టు కథ కూడా అల్లి అసలీ శారీరక సంపర్కం అన్నది చెడు విషయం కానే కాదని చిన్న క్లూ యిచ్చాను."

శ్రీహర్ష నిర్ణయలు వుండే వీధినే కాపరముంటున్న నివాస్ వారిద్దరి మధ్య లేని సయోధ్య గురించి వివరాలు సేకరించడం మాత్రమేగాక శ్యాంకి స్నేహితుడిగా అతడికి అన్నీ తెలియచేస్తున్నాడు.

"అంటే నీ గడువు ప్రకారం కార్యక్రమాన్ని ముగిస్తానంటావ్" గుర్తు చేశాడు నివాస్.

పెళ్ళికాని బ్రహ్మచారులైన శ్యాం, నివాస్‌లు కలిసి చాలా సర్దాల్ని పంచుకోవడం అనవాయితీ.

అయితే సరిగ్గా రెండు నెలల్లో నిర్ణయని బెడ్‌మీదికి రప్పించుకుంటానని నివాస్‌తో పందెం కాశాడు శ్యాం.

ఇప్పటికి పదిహేను రోజులైంది.

మిగిలిన గడువు నెలా పదిహేనురోజులు....

రోడ్డుపై వెళుతున్న సైకిలుని కోడి గుద్దుకుంటే కోడికేమన్నా ప్రమాదం జరిగే అవకాశం వుందేమో కాని సైకిలుకే ప్రమాదమూ వుండదు.... కాని ఆకాశంలో ఎగిరే విమానానికి ఓ పక్షి తాకినా నేలకూలిపోతుంది.

మిడిల్ క్లాస్ అమ్మాయిల్ని హైక్లాస్ భావాలుగల అతివలకీ యిదే తేడా అన్నది శ్యాంకి తెలిసిన థియరీ. కాబట్టే నిర్ణయని ట్రేప్ చేయడం సులభమనుకుంటుంటాడు శ్యాం.

నేలబారు జీవితాలకి 'పెలితి' అన్నదీ అలవాటు.... ఆధునిక భావాలు వున్నవాళ్ళకి అదే 'పెలితి' పెద్ద కలవరపాటు.

* * * * *

"వెలితి వేదాంతం పుట్టటానికి తొలి కారణమైంది. ఎంత శోధించినా యింకా సాధించలేకపోతున్నామన్న వెలితి ఆదిలో మహర్షుల్ని అరడి పెట్టింది. ఇంత తెలుసుకున్నా మరణాన్ని ఆపలేకపోతున్నామన్న నిస్స హాయతనే వెలితి ఎందరో ఋషుల్ని కలవరపరిచింది. ఆ వెలితి గ్రహించటానికి సాధన ప్రారంభమైంది. అదే జిజ్ఞాసగా మారింది. తాత్విక దర్శనములో తొలి దశ అది.... వేదాలని ఉపనిషత్తుల్ని మథించి అర్థాలను తెలుసుకొనే సంకల్పానికి ఆదికూడా అదే...."

వేలాదిమంది భక్తులు ఆసక్తిగా వింటున్నారు గీతా యజ్ఞసారాన్ని నిశ్చల గంభీర ముద్రతో యజ్ఞ వనవాటికని ప్రేమ జలంతో తడుపుతున్న మృదు చిరుహాసంతో ఉపన్యసిస్తున్నారు స్వామి సుందరచైతన్యానంద్.

సికింద్రాబాద్ పి.జి. కాలేజి గ్రౌండ్‌లో యజ్ఞం ప్రారంభించబడింది. కేవలం మూడు రోజుల క్రితమే. ఆ మూడు రోజుల్లోనూ భక్తులు మూడు రెట్లుగా పెరిగిపోయారు. కారణం స్వామీజీ ప్రవచనాలకి అంత ప్రాచుర్యం లభించటమే.... తెలిసిన విషయాన్ని సైతం అప్పుడే తొలిసారి వింటున్న అనుభూతిని కలిగిస్తూ వేదాంతాన్ని కొత్త కోణాల్లో స్పృశించటం ఎక్కువ మందిని ఆకట్టుకున్న విషయమైంది.

ఆఫీసులో ఎవరో చెప్పగా విన్న శ్రీహర్ష సరాసరి ఆఫీసునుంచి అటు వచ్చాడు.

సేదదీరినట్లుగా వుంది....

కొన్ని రోజులుగా మనసులో ఆగకుండా జరుగుతున్న అంతర్మథనానికి ఆలజడికి యిక్కడ జవాబు దొరికినట్టుగా వుంది.

నిజానికి శంకర్ తప్ప శ్రీహర్షకి స్నేహితులు లేరు.... ఉన్న శంకర్ కూడా అలవాట్ల విషయంలో శ్రీహర్ష వ్యక్తిత్వానికి భిన్నమైనవాడు. కాబట్టే శంకర్ సాయంకాలపు సర్దాలకు దూరంగా వుండటం శ్రీహర్షకి అలవాటైపోయింది. ఒకటి రెండుసార్లు బలవంతంగా మందు తాగించబోయి

విఫలుడైన శంకర్ యిక అలాంటి ప్రయత్నం చేయకూడదనుకున్నాడు. నిజాయితీగా.

"బ్రతకడం వేరు.... జీవించడం వేరు.... బ్రతకటం అందరికీ సాధ్యమే కాని జీవించడం కొందరికే సాధ్యం.... పుట్టిన ప్రతి వ్యక్తి పోయేదాకా బ్రతుకుతాడేమోగాని బ్రతికినంత కాలమూ జీవించలేడు" పరుగు లిడుతున్న అమృతరసవాహినిలా ప్రశాంతంగా వినిపిస్తూంది స్వామీజీ కంఠం "బ్రతికే వాడికి కావాల్సింది కేవలం తిండి మాత్రమే. కాని జీవించే వాడికి తిండితోబాటు జ్ఞానమూ కావాలి.... జీవితపు వెలితిని గ్రహించగలిగే సాధనే జిజ్ఞాస.... ఈ ఆధునిక యుగంలో ఎంత పొందినా యింకా మిగిలే వుందన్న భావం, ఎంత ఎదిగినా యింకా కొంత మిగిలిపోయిందే అన్న అసంతృప్తి ప్రతి మనిషినీ బాధిస్తూనే వుంది. అసహనానికి గురి చేస్తూనే వుంది.... ఎంత చేసినా ఎంత ఆలోచించినా యింకా అర్థంకాని ఆ వెలితి మరేదో కాదు.... దైవం.... అంతా నిండివుండే ఆ దైవమే వెలితిగా కని పించేదీ వెలితిని నింపేది కూడా."

మనిషి నిర్మించుకునే ఆశాసౌధాలు పేకమేడలై కూలిపోతుంటే నిరాశ నిస్పృహలకు నిలయమైన మానవుడు అశ్రుపూరిత నేత్రాలతో భగ వంతుడ్ని ఆశ్రయించడం గురించి మనిషి సాగించాల్సిన మహా ప్రస్థానం గురించి ఆయన చెబుతుంటే ఎంత అహ్లాదంగా అనిపించిందని.

కెరటాల చీకటిలాంటి బాల్యంలోని ఒంటరి ప్రయాణం సమస్యల విస్ఫోటనాలతో అనుక్షణం సాగించిన జీవనయానం నాదనిపించే ఒక నాదం జనించి కూడా పల్లవికి చరణానికీ మధ్య రగులుతున్న విషాద జంత్రసంగీ తం వరుసగా గుర్తుకొస్తుంటే యింత కాలానికి ఆలోచనలకి ఓ వారధి దొరికినంత సంతృప్తిగా వుంది.

రెండు గంటల ఉపన్యాసం ఎక్కడో నరాల ప్రకంపనానికీ కారణ మైంది. అనుభవాల వలయాల మధ్య ఆవిష్కరించుకోవాల్సిన ఆత్మదర్శ నానికి అణువంత కారణమైంది.

ఒక్క రోజుకే కాదు రెండు గంటల కాలానికే యింత శక్తి వున్న పుడు చిరు స్పందనలకి తానెందుకు చలించిపోవాలి....ఎంత జీవితం యింకా మిగిలి వుందో తెలిసినట్టు అనిర్వచనీయ ప్రశాంతతని దాచుకున్న కాలమే పంచగలదని అనిపించినట్టు జనసంద్రంలోనుంచి రోడ్డుపేపుకి నడుస్తు న్నాడు.

మరో అర నిమిషం గడిస్తే సింహద్వారం దాటేవాడే.

"హర్షా"

పిలిచారెవరో....

విద్యుద్దీపాల తోరణాల మధ్యగా నిలబడివుందో యువతి.

ముందు అర్థం కాలేదు....

అసలు నిజంలా కూడా అనిపించలేదు.

ప్రమీల....

ఎప్పుడో అయిదేళ్ళ క్రితం తనకు పరిచయమైన ప్రమీల యిక్కడ యిలా కలియడం యింకా ఆశ్చర్యంగా వుంది.

ఇంకా వూహలు చిగురించని కాలంలో జీవించాలనే తాపత్రయంలో బ్రతుకుతో పోరాడుతున్న సమయాన మనసు వాకిలి తలుపు తెరవాలని ప్రయత్నం చేసిన తొలి పిలుపు యింత కాలానికి యిలా దర్శనమిచ్చిం దేమిటి....

"నేనే" చెప్పింది ప్రమీల యిది కల కాదన్నట్టుగా.

హర్షాతిశయం కాదు.... యౌవనోదయవేళ కలల పొగమంచులా కనిపించే ప్రాణవాయువునందించిన యువతి ఆమే అని తెలిసినాగా కంగా రుగా కదలబోయాడు.

"నువ్వంటే నాకు కోపం లేదు హర్షా.... రా యిలా" ఓ మూల వున్న తెల్లని మారుతీ దగ్గరికి నడిచింది.

"కూర్చో" తనే డోర్ తెరిచింది.

అది అభ్యర్థన కాదు. ఆదేశం అంతకన్నా కాదు. శ్రావణమేఘ నేత్రాలతో అతడి దిగులు చూపుల్ని సమన్వయపరిచి అందించగలిగిన సుతి మెత్తని శాసింపు.

నిశ్శబ్దంగా ఫ్రంట్ సీట్‌లో కూర్చున్నాడు.

డ్రైవింగ్ సీట్‌లోకి వచ్చిన ప్రమీల మరో రెండు నిమిషాలలో కారుని రోడ్డుపైకి పోనిచ్చింది.

ప్రమీలలో అప్పటి లాలిత్యమే.... కాని యిప్పుడు ఆ లాలిత్యంలో మెచ్యూరిటీ కనిపిస్తూంది.... ఆనాటి చిలిపితనం స్థానంలో అతడి ఊహా తందని పెద్దరికం స్పష్టమౌతూంది.

"నీకు పెళ్ళయిందని తెలిసింది" ముందు ప్రసక్తిని ప్రారంభించింది తనే "ఈ ఊళ్ళోనే వున్నావని తెలుసు కాని ఎక్కడున్నదీ తెలీదు. ఆరా తియ్యడం అంత శ్రమ కాదు గాని అవసరం లేదనిపించింది హర్షా...."

ఇబ్బందిగా కుంచించుకుపోతున్నాడు....

శరణాలయం నుంచి బయటపడి నిర్ణయ తండ్రి సహకారంతో ఇంజనీరింగ్ చదివేటప్పుడు వైజాగ్‌లోని ఓ ఇంటిలో అద్దెకుండేవాడు శ్రీహర్ష. ఆ ఇంటివాళ్ళ అమ్మాయి ప్రమీల....తనూ బియస్సీ చేస్తుండేది.... అదిలో మామూలు పరిచయం ఆ తర్వాత యిద్దరూ తరచూ కలుసుకోటం దాకా వెళ్ళింది. ఆమె చాలాకాలం తన మనసేమిటో చెప్పలేదు. కాని అతడి మనసు తెలుసుకోవాలని మాత్రం ప్రయత్నించేది....కొంత కాలానికి తన

ప్రేమని వ్యక్తం చేసింది. జవాబు చెప్పలేదు శ్రీహర్ష. ఆమౌనం అంగీకారమే అనుకుంది. ఆ తర్వాత మరిన్ని ఆశల్ని పెంచుకుంది.

తనను కోరిన అమ్మాయిని కాదనడం ఎలాగో తెలీదు శ్రీహర్షకి.

నిజం చెప్పడం ఆమెను గాయపరచడమే అనుకుంటూ చాలా రోజులు తాత్సారం చేశాడు....

ఆ తర్వాత నిర్ణయ అతడి జీవితంలో ప్రవేశించడంగాని, క్రమంగా ఆమెపై శ్రీహర్ష సైతం ఆసక్తిని పెంచుకోవడంతో యిద్దరూ చేరువ కావడం గాని ప్రమీలకి తెలీదు....

తెలిసివుంటే బాధను దిగమింగుకుంటూ ఆనందంగా అంగీకరించేదేమో....కాని హఠాత్తుగా గది ఖాళీచేసి వెళ్ళిపోయాడు....ఈలోగా తల్లిదండ్రులు ఆమెకు పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తే మనసులోని మాటని ఇంట్లో తెలియ చెప్పింది కూడా....

కాని శ్రీహర్ష జాడలేదు....కలవాలని చాలాసార్లు ప్రయత్నించీ విఫలు రాలైంది. ప్రమీల పెళ్ళయిపోయింది....

ఆ తర్వాత ఇదిగో యింత కాలానికి కలిశాడు మళ్ళీ.

"మీ ఆవిడ బాగుంటుందట కదూ...." అడిగింది మృదువుగా నవ్వుతూ. "నిన్ను అడిగేకన్నా ఆవిడ్ని చూడటం బెటరనుకుంటా...."

గిల్టీగా వుండిపోయాడు జవాబు చెప్పకుండా.

"నీలో అస్సలు మార్పులేదు హర్షా........ఆడది హర్షించదగ్గ మగాడిలా కనిపిస్తావేమో తప్ప హర్షవర్ధనుడికి వున్న తెగువ సాహసం నీకస్సలు లేవు కదూ!"

ఆమెను చూడటానికి ధైర్యం చాలనట్టు బయట జనాన్ని గమనిస్తున్నాడు. చరిత్రలో హర్షవర్ధనుడు సాహసవంతుడు, భావుకుడూ కావచ్చు కాని ఆ పేరుగల శ్రీహర్షలో అంతటి తెగింపు లేదు. అసలు అంత

గొప్పపేరుని పెట్టింది శరణాలయం వాళ్ళేతప్ప తల్లిదండ్రులు కాదుగా....

ఒకవేళ తల్లిదండ్రుల పెంపకంలో పెరిగివుంటే ఎలా వుండే వాడో అతనికే తెలీదు కాని అనాధగా బ్రతకడంతో అలాంటి పేరున్నందుకూ చాలాసార్లు సిగ్గు పడేవాడు....

"పరాయి ఆడదానితో మాట్లాడనని మీ ఆవిడకి ప్రమాణం చేశావా?"

తల తిప్పి ప్రమీలని తేరిపార చూసిన శ్రీహర్ష అప్పుడు ఉలిక్కిపడ్డాడు....

ప్రమీల నుదుట బొట్టులేదు....

అప్పటి ఆమె రూపంలో కాంతి యిప్పటికీ తరగలేదు కాని ఆ కాంతిలో సౌభాగ్యాన్ని దాచుకున్న జీవం లేదు.

"మీవారు...." నూతిలోలా వినిపించింది శ్రీహర్ష కంఠం.

"చనిపోయి ఏళాది దాటింది...." యధాలాపంగా చెప్పింది.

శ్రీహర్ష మనస్సు చివుక్కుమంది....ఇంత కాలానికి కలుసుకున్న ఆనందం కన్నా యిలా కలుసుకున్నందుకు బాధగా వుంది.

క్లుప్తంగా చెప్పింది అతడు అడక్కపోయినా....

"పందొమ్మిదో యేట కలవరంలా పెళ్ళి జరిగిపోయింది శ్రీహర్షా. ఇరవై రెండో యేటకి వైధవ్యమూ వచ్చేసింది....ప్రారబ్ధమని సరిపెట్టుకోవడం తప్ప ఏం చేయగలమని....కోరుకున్న నిన్నూ దక్కించుకోలేకపోయాను....కోరని మగాడికి భార్యనై ఆ భర్త అపురూపమైన ప్రేమకి పులకించి ఆ జీవితమైనా శాశ్వతం కావాలని కోరుకుంటున్న సమయాన విమాన ప్రమాదం పేరిట ఆయన్నీ దూరం చేసుకున్నాను....ఓ ఫేక్టరీ బంగళా, డబ్బు ఇవితప్ప నాకేం మిగల్లేదు. ఇదే నా జీవితమంటే అనిపించిన క్షణాలు చాలా వున్నాయి. కాని ఏం చేయగలమని. ఇది కాకపోయినా

బ్రతకాలిగా అసలు" గాలికి ఎగురుతున్న ముంగురులు ఆమె ఫాలభాగంపై పడి మృదువుగా నర్తిస్తుంటే బిడలికగా అంది "ఎంత విచిత్రమైంది జీవితం. కోరింది దొరక్కుండా పోయింది. దొరికేది కోరనిదై మనసుని అనుక్షణం గాయపరుస్తూనే ఉంటుంది."

వేదనకి, వేదాంతానికీ మధ్య దూరం ఎంతో తెలీదు శ్రీహర్షకి.... కాని ఆ దూరానికి రూపాన్నిస్తే ప్రమీల అవతారం మాత్రం యిప్పుడు తెలుస్తుంది.

నిజమే....ఒకనాడు ప్రమీలలో ఎంతటి ఆశావాదమని, చీకటి కాన్వాసుని చేతికిస్తే ఆలోచనల చుక్కల్ని అతికించి పరిసరాల్ని పగలుగా మార్చేయగల నిబ్బరంతో మాట్లాడేది. కాటుక చూపుల కలువ దండని మనసు కంఠానికి వేసి మెలికలు తిరిగిన కొండ దారిలాంటి తన జీవితంలో ఉన్నట్టుండీ వసంత సమీరాల్ని నింపి ఉక్కిరిబిక్కిరి చేసేది.

ఎవరు సుఖపడగలరు...

గమ్యం తెలీకుండా ఏదో రైలెక్కి ప్రయాణించే వ్యక్తా....

లేక....

గమ్యం తెలిసివుండీ అర్ధరాత్రి నిద్రపట్టని ఒంటరితనంతో అలమటించే తన లాంటి వాడా....

కారు జూబిలీహిల్స్‌ని చేరుకోవడం అతడికి గుర్తులేదు. కాని ఓ పెద్ద బంగళాలో ఆగడంతో తేరుకున్నాడు.

"రా" ఆహ్వానించింది సాదరంగా....

అందమైన పూలతోట, తోట వెనుక అధునాతనంగా వెలుగుతున్న మెర్క్యూరీ వేపర్ లేంప్. లేంప్ వెనుక ద్వారం, ద్వారం నుంచే పరచబడిన వాల్‌టువాల్ కార్పెట్, డిస్టంబర్ గోడలు, అల్యూమినియం రైలింగ్ మెట్లపై వరుసగా గదులు....యింకా తడి ఆరని స్మృతుల్లా ఈ లోకంలో లేని ఓ వ్యక్తి ఉనికిని గుర్తు చేస్తున్న పరిసరాలు.

"కూర్చో"

మేడమీద అతిథుల కోసం ఏర్పాటు చేయబడిన డ్రాయింగ్ హాలులా ఉంది.

"ఇదంతా నా పెళ్ళి నాటికే ఆయన సంపాదించిన ఆస్తిలో ఒక భాగం మాత్రమే శ్రీహర్షా .... స్టేట్స్‌లో ఎం. బి. ఏ. చేసి అచ్చ తెలుగు అమ్మాయిలా కనిపించే ఆడపిల్లకోసం వెదికి మరీ నన్ను కట్టుకున్నారు ఆయన...."

చూపించింది గోడకున్న ప్రమీల భర్త ఫోటోని. ప్రతిరోజూ మార్చే పూలదండలా యింకా రాలని రేకులతో ఫోటోకి అమర్చబడివున్న దండని కాదు శ్రీహర్ష చూసింది.

చిలిపితనం లాంటి లాలిత్యంతో విడీవిడని ప్రమీల భర్త పెదవుల చిరునవ్వుని....అతడే అందగాడో లేక అతడి నేత్రాలు అందంగా కనిపిస్తున్నాయో తెలీదు కానీ ప్రమీల కోల్పోయిన ఒక జీవితకాలపు అదృష్టంలా అనిపిస్తున్నాడు.

నౌఖరు ట్రేలో రెండు గ్లాసుల కూల్‌డ్రింక్స్ తెచ్చి టీపాయ్‌పై వుంచి వెళ్ళిపోయాడు.

ఎన్నెన్ని ఆలోచనల ఒరిపిడితో అలా ఎంతసేపు కూర్చున్నాడో శ్రీహర్షకి గుర్తులేదు.

చాలాసేపటి తర్వాత అన్నాడు "ఒంటరిగా వుంటున్నావా."

"ఆయన బ్రతికి వున్నంత కాలం మా అత్తమామలూ యిక్కడే వుండేవారు....తరచూ ఆడపడుచులూ వస్తుండేవారు. కాని యిప్పుడు అంతా వెళ్ళిపోయారు."

ఎక్కడికి అని అతడు అడక్క ముందే చెప్పింది ప్రమీల "ఉన్న ఒక్కగానొక్క కొడుకు చనిపోవటానికి కారణం నేను ఈ ఇంట్లో కోడలిగా అడుగు పెట్టటమే అనిపించింది అందరికీ...."

విభ్రమంగా చూశాడు శ్రీహర్ష.

"ఆశ్చర్యపోకు శ్రీహర్షా....ఆ విషయాన్ని బాహాటంగానే అన్నారు కూడా. నేను బాధపడలేదు...అసలు వాళ్ళని మించిన దురదృష్టవంతురాల్ని నేనే అని నాకూ తెలిశాక వాళ్ళనెందుకు నిందించాలి." ఈ ఆస్తిపాస్తులు నాకు అక్కర్లేదు పుట్టినింటికి వెళ్ళిపోతానన్నాను.... అంగీకరించేవారేమో. కాని పెళ్ళయిన ఏడాదికే మావారు రాసిన వీలునామాలో తన స్వార్జితమైన ఫ్యాక్టరీ తన ఆస్తి మొత్తం నాకే చెందాలని స్పష్టం చేశారు. ఇదంతా ఆయన ఎందుకు రాసేరో ఒక మామూలు జీవితం నుంచి యీ యింట అడుగు పెట్టిన నాకు యీ వ్యవహారాలు చూసే శక్తి వుందో లేదో నాకు తెలీదు హర్షా. కాని ఆయన కోరిక మన్నించాలనిపించింది....వూహకందని ప్రేమతోబాటు ఆత్మస్థయిర్యాన్ని నా కందించిన నా భర్త ఆలోచనలకి అనుకూలంగా అంతా నేనే చూసుకోవాలనిపించింది. ఏ స్మృతుల తాకిడికో ఆమె నేత్రాలు సజలాలయ్యాయి. "ఎందుకు హర్షా....బ్రతకడానికే అయితే యింత ఆస్తి నా కెందుకు...కాని నా బ్రతుకన్నా ఆయన ఆశయాల మేరకే జీవించాలని వుంది. భర్తగా, స్నేహితుడిగా, గైడ్‌గా ఆయన మిగిల్చిన స్ఫూర్తితో నిబ్బరంగా జీవితాన్ని నెట్టుకురావాలని వుంది."

దూరంనుంచే దరహాసంతో చూస్తున్నాడు ప్రమీల భర్త.

అతనెక్కడ వుంటేనేం ఇంకా యిక్కడే వున్నంత ఉత్కృష్టంగా కనిపిస్తున్నాడు....

అతడే సుషుప్తిలోకి జారిపోతేనేం మూడు నాలుగేళ్ళ దాంపత్యజీవితంలోనే మెలకువకి నిద్రకీ సరిహద్దు రేఖలాంటి జీవిత వాస్తవాల్ని ప్రమీలలో నింపి ఓ మామూలు ఆడపిల్ల అంతరంగ ద్వారాన్ని తెరిచి మహోన్నతుడైన భర్తలానూ నేళ్ళ సాన్నిహిత్యాన్ని రుణంగా అందించగలిగాడు.

ఎవరూ తప్పించుకోలేని మృత్యువు పేరిట ఆమె బ్రతుకు వాడిపోతేనేం....ఆమె జీవితం మాత్రం పచ్చని తోటల ప్రభాత సంధ్యలా వెలిగిపోతూంది.

త్రికరణ శుద్ధిగా అభినందించాడతడ్ని.

"అదృష్టానికి, దురదృష్టానికి మధ్య దూరం ఎంతో నాకు తెలీదు ప్రమీలా! కాని పంచుకున్న కొద్దికాలపు జీవితంలో నీకు ఎల్లలులేని ప్రపంచాన్ని తెలియ చెప్పిన ఆ మహానుభావుడికి చేతులు జోడిస్తున్నాను."

ఆ తర్వాత చాలా సేపు నిశ్శబ్దం....అది నిశ్శబ్దమూ కాదు....మెదడు అరల్లో శబ్దాలకు భాష కూర్చలేని విచిత్ర విరామం.... ఒకవేళ విడిపోయిన ప్రేమికుల్లా కలుసుకుని ఉంటే ఉక్రోషంగా గతాన్ని గుర్తు చేసుకునేవారు.

ప్రేమనే బంధంలేని పాత స్నేహితుల్లా ఇంత కాలానికి కలుసుకుని వుంటే వర్తమానం గురించి ఆ కబుర్లు చెప్పుకునేవారు.

"నా గురించి చెప్పానుగా హర్షా" వాతావరణాన్ని తేలిక పర్చుతున్నట్టుగా అంది "ఎలా వుంది మీ దాంపత్యం. మన పరిచయం గురించి మీ శ్రీమతికి తెలుసా, నేనెప్పుడైనా గుర్తొచ్చేదాన్నా లేక మరెవర్నీ గుర్తు చేసుకోనంత అపురూపమైన ప్రేమని అందిస్తూ...."

"ప్రమీలా" బిడియంగా తల వంచుకుని అడిగాడు "నేనంటే నీకు కోపంగా లేదూ?"

"దేనికి?"

"మాట మాత్రం చెప్పకుండా నీనుంచి దూరంగా పారిపోయినందుకు."

"ఎందుకు కోపగించుకోవాలి హర్షా....అప్పటి నీ పరిస్థితుల్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నించానే తప్ప నీ మీద నేను ద్వేషం పెంచుకోలేదు. నిన్ను యిష్టపడిన నన్ను కాదన్నది నువ్విష్టపడిన అమ్మాయికోసమే అని తెలిశాక నీ ప్రేమను గెలుచుకోలేని నా ఫెయిల్యూర్ కి కొద్దిగా బాధపడ్డానేమో గాని నిన్నెందుకు తప్పు బట్టాలి.... అయినా నేనూ అదృష్టవంతురాల్నేగా హర్షా. సహృదయుడైన భర్తని పొంద గలిగాను సుమంగళిగా బ్రతికింది

ఎంత కాలమైనా గాని ఓ జీవిత కాలానికి సరిపడ్డ ఆనందాన్ని దక్కించుకున్నాను."

"ఇక వెళతాను"

"మీ ఆవిడ గుర్తుకొస్తుందా?"

మృదువుగా నవ్వాడు.

"ఏం....అదీ నిజం కాదా?"

జవాబు చెప్పలేక పోయాడు.

అతడు పెరిగిన వాతావరణం కావచ్చు....లేదూ యిప్పటి మానసిక స్థితి కారణం కావచ్చు. ఇలాంటి ప్రశ్నలకి ఏం జవాబు చెప్పాలో శ్రీహర్షకి తెలీదు. భావుకతకి లోటులేకపోయినా దానికి భాష కూర్చడం అంతగా తెలీదు యిప్పటి దాకా...

"ప్రతిరోజూ క్లాసెస్‌కి వెళ్తున్నావా" అడిగాడు గీతా యజ్ఞం ఉపన్యాసాల గురించి గుర్తు తెచ్చుకుంటూ...."

"ఏం..నువ్వు ఈరోజే వచ్చావా" అడిగింది ప్రమీల.

"అవును."

"ఉబుసుపోకా ఉత్సాహంతోనా" సాలోచనగా చూసింది ప్రమీల.... "అవును హర్షా....ఏం తోచక పనిలేక వచ్చేవాళ్ళు కొందరైతే పనికట్టుకుని వచ్చేవాళ్ళు మరికొందరు"

ఈ విశ్లేషణ దేనికో అర్థంకాలేదు శ్రీహర్షకి.

"మరి నువ్వేకోవకి చెందినవాడివా అని."

"వచ్చింది తోచకే అయినా విన్నాక ఉత్సాహం అనిపించింది."

"దేనికా ఉత్సాహం?"

"మానసికమైన అలసట తగ్గినందుకు...." నోరు జారిపోయాడు శ్రీహర్ష.

రెప్పలార్చకుండా చూసింది ప్రమీల.

"ఏం జరిగింది హర్షా?"

దొరికిపోయినట్టుగా కంగారుపడ్డాడు.

"ఏం....చెప్పేటంత చనువు లేదా?"

"అదికాదు ప్రమీలా....అసలు...." చెప్పటానికైనా పెద్ద కారణం ఏం వుందని....

నిర్ణయ చిరుకోపం గురించి అలక గురించి చెప్పడం ఎబ్బెట్టుగా వుంటుంది....ఒకవేళ చెప్పినా చాలా చిన్న విషయాల్ని భూతద్దంలో చూసి జడుసుకునే అప్పటి తన మనఃస్థితిని మరోసారి బుజువు చేసుకోవడమే అవుతుంది తప్ప ఉపయోగం ఏమిటని....

నవ్వింది ప్రమీల...."నువ్వసలు మారలేదు శ్రీహర్ష ...పెళ్ళన్నది వ్యక్తుల్లో చాలా మార్పుకి కారణం అవుతుందన్న నా నమ్మకం నిన్ను చూసేక నిజంగా పొరపాటనిపిస్తూంది....నిజం శ్రీహర్షా.......ముఖ్యంగా నీలాంటివాడ్ని పెళ్ళి చాలా ఎక్కువగా మార్చాలి....మరోలా అనుకోకు... నీ బాల్యం మొత్తం గడిచింది ఇన్‌సెక్యూరిటీతోనేగా. కాబట్టే ఆడపిల్ల మాట్లాడే సమయంలో కూడా అదోలాంటి ఆత్మన్యూనతా భావంతో కుంచించుకు పోతుండేవాడివి....ప్రేమన్నది దివ్యౌషధంగా పనిచేసేది మానసికంగా అపరిమితమైన పరిమాణాన్ని అందించేది ముఖ్యంగా నీలాంటి వ్యక్తులకే హర్షా....పెదవి విప్పి చెప్పలేని నీ ఆలోచనలకి అందమైన భాషనిచ్చేది బాల్యంనుంచి బలంగా పెంచుకున్న మానసికమైన వలయాన్ని ఛేదించి జీవితప్పొల్లల్ని విస్తృతం చేసేది ప్రేమే అయితే మరి నువ్వేమిటి ఇంకా అప్పటిలాగే ఉండిపోయావు...."

అడిగింది క్లుప్తంగానే అయినా అందులో చాలా ప్రశ్నలు సందేహాలా వున్నాయి.

ఆమె అన్నది చాలా నిజమనిపించినా ఆ స్థాయికి చేరుతాను. అది నిజమే అని ఎలా అంగీకరించగలడు....

అసలు లోపం ఎక్కడున్నదీ తనకే ఖచ్చితంగా తెలీనినాడు దానికి వివరణ ఎలా అందించగలడని....

అయినా ఏవో మాట్లాడాలి

నిర్ణయ గురించి అపసవ్యంగా ఈదుకొస్తున్న దాంపత్యం గురించి ప్రమీల మరి కొంత లోతుగా వెళ్ళకముందే ఏదో చెప్పాలి....

"నువ్వన్నది బహుశా నాలాంటి వాళ్ళకి వర్తించదేమో ప్రమీలా.... ఎందుకంటే నేనేమిటో నాకు తెలీనివాడ్ని కాబట్టి...."

నవ్వేసింది ప్రమీల భావరహితంగా.

ఇంతకాలానికి కలుసుకున్నాక ఇంతకన్నా లోతుగా అడగడం సవ్యం కాదనిపించింది.

ఏది ఏమైనా ప్రమీల కనిపించింది ఒక్కటే....

ప్రేమన్నది శ్రీహర్షని ఎంత ప్రభావితం చేసినాగాని ధాంపత్యం అంత సుఖప్రదంగా లేదు....

లోపం ఎక్కడున్నాగాని శ్రీహర్ష అప్పటిలానే వున్నాడు.

"మీ ఆవిడ్నెప్పుడు పరిచయం చేస్తావ్? ఓసారి యింటికి తీసుకు రాకూడదూ?"

అదో అభ్యంతరకరమైన విషయం కాకపోయినా వెంటనే సరేనన లేకపోయాడు.

"వీలు చూసుకుని తీసుకొస్తాను"

"బయలుదేరటానికన్నట్టుగా లేచాడు.

"రేపు స్వామీజీ క్లాసుకి వస్తున్నావా?" అడిగింది ప్రమీల.

"వస్తాను."

"ఏమరుపాటన!"

ఆ వాక్యం ఏ జ్ఞాపకాలనో తట్టి నిద్ర లేపినట్టుంది

"ఇలా అడుగుతున్నందుకు మరోలా అనుకోకు శ్రీహర్షా....నా కంటూ ఆత్మీయులెవరూ లేని ఈ ప్రపంచంలో ఒకప్పుడు నా మనస్సుకి కాస్త దగ్గరగా వచ్చిన మనిషివి కాబట్టి యిలా అడుగుతున్నాను "

ఆమె గొంతులో వినిపించిన ఆర్తి శ్రీహర్షని బలంగా కదిలించిందేమో "తప్పకుండా వస్తాను ప్రమీలా....ఈ రోజులానే కల్సుకుంటాను." అన్నాడు శ్రీహర్ష.

"నమ్మమంటావు" నవ్వింది మృదువుగా.

ఆ నవ్వు ప్రసన్నంగానే వుంది కాని ఆమె చూపులు మాత్రం 'మళ్ళీ పారిపోవుకదూ' అంటూ ఒకనాడు తన పలాయనాన్ని ప్రశ్నిస్తున్నట్టుగా కనిపించాయి.

అది కూడా శ్రీహర్షకి అనిపించిన భావం మాత్రమే "ఈసారి నమ్మొచ్చు ప్రమీలా."

"ఆనందంగా వుంది" అంది ద్వారందాకా తోడొచ్చిన ప్రమీల.

"దేనికి?"

"అక్కడి లెక్చర్సుద్వారా నేను తత్వాన్ని ఎంత జీర్ణించుకున్నానో తెలీకపోయినా మనశ్శాంతిని వెదుక్కుంటూ అక్కడికి వెళ్ళే నాకు ఈరోజు నువ్వు కనిపించినందుకు."

తన ఉనికి ప్రమీలకి అంతటి ఊరటని కలిగిస్తుందా....
అతడిలోని సగటు మనిషి నిద్రలేచిన తొలి క్షణమది.

* * * *

రాత్రి పదిగంటల సమయాన యింట్లో అడుగుపెట్టాడు శ్రీహర్ష.

ముందు గదిలో లైటు వెలుగుతూంది తప్ప నిర్ణయ జాడ లేదు.

డైనింగ్ టేబుల్‌పై పాత్రల్ని చూస్తుండగానే తెలిసిపోయింది. నిర్ణయ భోంచేయలేదని—

బహుశా తనకోసం ఇంకా ఎదురుచూస్తూంది అనుకుంటూ బెడ్‌రూమ్‌లోకి నడిచాడు.

గిల్లి కజ్జాలతో అడపాతడపా వాదులాడుకునే కొత్త దాంపత్యంలో కొన్ని గంటల దూరం తర్వాత కలుసుకునే కలయిక ఎంత మధురంగా వుండేదీ తెలిసిన సగటు మనిషిలా చూశాడు.

మోచేతిని కళ్ళపై వుంచుకుని పడుకుని ఉంది నిర్ణయ.

నిద్రలా లేదు ఏవో ఆలోచిస్తున్నట్టుగా వుంది.

ఒకవేళ ఉదయం వాగ్యుద్ధం విషయంలో బాధపడుతుందేమో అనుకుంటూ పిలిచాడు పక్కన కూచుని "నిర్ణయా."

జవాబు లేదు.

సంకోచిస్తూనే ఆమె భుజంపై చేయి వేశాడు.

అప్పటికీ చలనం లేదు.

"నిద్రపోతున్నావా" తట్టాడు నెమ్మదిగా.

ఒక్క ఉదుటున పైకి లేచిందామె.

నిర్ణయ కళ్ళలో ఎరుపుజీరలు నిద్రనుంచి మేల్కొన్న స్థితిని కాదు, ఏ విషయంలోనో కుమిలిపోతున్న వాస్తవాన్ని స్పష్టం చేస్తున్నాయి.

తత్తరపడుతూ అన్నాడు "భోంచేయలేవా?"

ఉక్రోషంగా బెడ్ దిగింది.

చిరిగిన స్వప్నంలో చిటికెడు ఆత్మీయతని ఒలికించటం ఆమెకు అసహ్యంగా వుంది.

"కమాన్ రా."

ఆమెను పొదివి పట్టుకుని నడిపించుకోవాలనుకోవడమే శ్రీహర్ష చేసిన పొరపాటు.

"ఏమిటి మీ ఉద్దేశ్యం?" అరిచింది అసహనంగా.

"మీరు చెపితే తప్ప నా ఆకలి సంగతి నాకు తెలియదనుకున్నారా" ప్రసన్నంగా నవ్వాడు "ఒకప్పుడు నా గురించి ఎదురుచూస్తూ ఆకల్ని మరిచి పోతున్నాననేదానివి"

"అది నిజం కాదని యిప్పుడు అర్థమౌతూంది."

"అబద్ధం... ఇప్పుడూ అందుకే ఆకలి మరిచిపోతుంటావు."

విసురుగా అతడి చేతిని విడిలించుకుంది.

కోపం రాలేదు శ్రీహర్షకి.

పేదవాడిగా ఆమె జీవితాన్ని పంచుకున్న శ్రీహర్షకి కోపగించు కోవడం పెదవికన్నా ప్రేమకి చేటని తెలిసి చాలా రోజులయింది.

"ప్లీజ్!" అర్థించాడు.

"చెపితే అర్థం చేసుకోవేం?"

"నా తప్పేమిటి?" శ్రీహర్ష గొంతు ఆర్ద్రంగా పలికినా అది ఆమె గుండె అట్టడుగు పొరల్ని తాకలేకపోయింది.

సందేహాల సంకెళ్ళని దాటుకుని స్మృతుల జాడల్లో ప్రేమనుంచి పెళ్ళిదాకా నడిచిన ఆమె మొన్నటి పచ్చటి ప్రాణశక్తిని కోల్పోయి ఎర్రని ఆందోళనలో బ్రతకడం అలవాటు చేసుకుంది. కాబట్టే స్పందించ లేకపోయింది.

ఒకవేళ శ్రీహర్ష సాయంకాలానికే ఇంటికి వచ్చి వుంటే మారాం చేసైనా అతన్ని ఎగ్జిబిషన్‌కి తీసుకుపెళ్ళేది. తను అనుకున్న టేప్‌రికార్డర్‌ని, కేసెట్‌ని కొనుక్కుని ఆనందంగా ఆ రాత్రి గడిపేసేది.

అలా అనుకున్నది సాధించడంలో ఆనందం వుందో లేదో ఆమెకే తెలీదు కాని అణువంత గెలుపులాంటి భావంతో కాస్తపూరట చెందే దేమో.

కాని ఆ అవకాశాన్ని లేకుండా చేశాడు శ్రీహర్ష.

అసలు తనంటే శ్రద్ధ వున్నవాడే అయితే సరాసరి యింటికి వచ్చే వాడు.

ఉదయం జరిగిన గొడవ విషయంలో ఆ మాత్రం బాధని ప్రదర్శించే వాడు.

తప్పనిసరిగా ఇది నిర్లక్ష్యమే.

ఆమె అడగలేదు.

అయినా చెప్పాడు.

ప్రమీలని కలుసుకున్న వాస్తవాన్ని చెప్పకపోయినా ఆఫీసునుండి సరాసరి గీతాయజ్ఞం దగ్గిరికి వెళ్ళిన నిజాన్ని స్పష్టం చేశాడు.

"ఓహో" సర్కాస్టిక్‌గా చూసింది "మీరు వెళ్ళింది అక్కడికన్న మాట....అంటే....మీకు అప్పుడే దాంపత్య జీవితం మీద మొహం మొత్తే సిందన్నమాట...."

నవ్వేశాడు శ్రీహర్ష........ఇంత చదువుకున్న నిర్జయ యిలా మాట్లాడ్డం నచ్చలేదు "అక్కడికి వచ్చేవాళ్ళు దాంపత్య జీవితంపై ఆసక్తి చచ్చిపోయిన వాళ్లు కాదు నిర్జయా....మేరీడ్ పీపుల్స్ పెళ్ళికాని వాళ్ళూ వున్నారు."

"అలాంటప్పుడు నన్నెందుకు పిలవలేదు."

ఆర్గ్యుమెంటు కోసమే తప్ప పిలిచినా నిర్జయ అలాంటి చోటకి రాదు తెలుసు...."నీకు ఇష్టం వుండదని తెలుసు."

"అలాగా" నిర్ణయ మొహం జేవురించిపోయింది. "అంటే మీకు నా యిష్టాయిష్టాల విషయమూ తెలుసని నేను అనుకోవాలంటారు....అలా తెలిసిన మీ మనసుని నేను అర్థం చేసుకోలేక యింత గొడవ పెడుతున్నానని నన్ను ఆత్మ విమర్శన చేసుకోమంటారు...."

"అవేమీ నేను అనడం లేదు నిర్ణయా...." ఇంకా ప్రసన్నతనే ప్రదర్శిస్తున్నాడు శ్రీహర్ష. "ఒక చిన్న విషయానికి యింత రాద్ధాంతం చేయడం బాగోలేదు. ఛోంచేద్దాం రా."

"అంటే మనమధ్య వున్నదీ కలసి ఛోంచేసే బంధం ఒక్కటే నన్నమాట."

"అని నేననలేదు నిర్ణయా...."

"అనకపోయినా మీ ప్రవర్తన నుంచి నాకు అర్థం అవుతున్నది. అవొక్కటేనా...."

"ఇప్పుడేమైందని" నిర్ణయ ఎందుకింత రాద్ధాంతం చేస్తున్నదీ అర్థం కావడం లేదు.

"ఏమైనా అయితే అది యిప్పుడు కాదు శ్రీహర్షగారూ....మీ వ్యామోహంలో చిక్కుకున్నానే ఆ తొలిక్షణాన...." నిర్ణయ కళ్లు నీటి కుండలయ్యాయి "అందుకే యిప్పుడు అనుభవిస్తున్నాను....అయిన వాళ్ళందరికీ దూరమై యిలా ఒంటరిదానిలా కుమిలిపోతున్నాను."

భాషకి తోచనిది అసలు భావానికే అందనిది ఆమెను అనూహ్యంగా కలవరపెడుతుంటే బాధగా గోడకి జారిగిలబడిపోయింది.

నిశ్శబ్దం....

ఫలానా అని చెప్పలేని క్రోధాల మెరుపుల ఆచుపులు గుండె మేఘాల్ని చీల్చి అంతరాంతర వర్తులాలలో చైతన్య రక్త బిందువుల్ని

జ్వలింప చేస్తుంటే అలా ఎంతసేపు నిలబడిపోయిందో ఆమెకే గుర్తు లేదు.

"నిర్ణయా" పిలిచాడు నెమ్మదిగా....అది పిలుపు కూడా కాదు.

చీకటి వెలుగుల నడుమ వెలిగీ వెలగని వేదనా నక్షత్రంలా ఆర్ద్రంగా బాధను నివేదించాలనే ఆర్తి.

"నేనొక మామూలు ప్రపంచానికి చెందిన మనిషిని....సామాన్యుడిగా బ్రతకాల్సినవాడిని అల్పుడిగా జీవితాన్ని చాలించాల్సినవాడిని నీ పరిచయంతో చాలా అదృష్టవంతుడ్ని అయిన మాట నిజమే అయినా అర్థం చేసుకోలేకపోతున్నాను నాలోపమెక్కడో....అదే తెలుసుకున్న రోజున నిన్ను సుఖపెట్టగలనేమో కాని అది తెలుసుకోటానికే నా జీవితం ఖర్చయిపోతుంటే ఏం చేయాలో అర్థంకాక నేనూ నలిగిపోతున్నాను. నిన్ను కుదిపి వూపిరాడనివ్వని అనుభవాల్ని అందించాలో లేక నవ్వడి చేయకుండా ప్రసరించిన సూర్యకిరణంలా గోరువెచ్చని అనుభూతిని మాత్రమే యివ్వగలిగిననాడు సరిపోతుందో ఇప్పటికి నాకు అర్థంకాని విషయం అయినా యిదిగో ఆ తపస్సులో మరికాస్త ఏకాగ్రతని పాటించాలనుకుంటున్నాను."

వెళ్ళిపోయాడు శ్రీహర్ష....

నిశ్శబ్దంగా బెడ్‌రూంలో అడుగుపెట్టి బెడ్‌పై వాలిపోయాడు.

గాలి ఉఛ్వాసం మరిచిన వూపిరిలా అనిపించింది.

కిటికీ అవలి చీకటి ఘూశిపట్టి ఏమీ కనిపించని వర్తమానంలా వుంది.

ఎందుకో మనసు ద్రవించింది నిర్ణయకి.

ఒకవేళ తన మాటలకి కలత చెందిన శ్రీహర్ష రోషంగా తిరగబడితే ఉత్సాహంగా పోరాడేదేమో....

ఇతమిద్ధంగా చెప్పలేని ఆలోచనల శరాల్ని సంధిస్తూ అతడ్ని ఇంకా ఆరడి పెట్టేదేమో.

కాని....

శ్రీహర్ష ప్రవర్తన పోరాటానికి ముందే సంధి చేసుకున్నట్టు అని పించి తనూ నడిచింది గదిలోకి.

భోజనం మాట మరిచిన శ్రీహర్ష ఇందాక తనలాంటి నిస్సహాయ తతో మోచేతిని కాళ్ళపై వుంచుకుని పడుకున్నాడు.

ఎవరున్నారు అతడికి మాత్రం.

ఏ గెలుపుకోసం ప్రతిరోజూ అతడ్ని తను సాధిస్తూంది.

అసలు ఏం కావాలి తనకు.

అతడేం యివ్వగలిగితే తను మనశ్శాంతిగా వుండగలుగుతోంది.

ఏమైంది భగవంతుడా....

ఎందుకిలా అలిసిపోతున్నాను.

ఎందుకింత వివశత్వానికి గురైపోతున్నాను.

ఒకనాడెప్పుడో నిరీక్షణతో అలసిన కనురెప్పలు అంతా సాధించినా గాని మరెంతో మిగిలిపోయిందన్న నిస్త్రాణతో భారమైపోతున్నాయేం. సరాగానికి సల్లాపానికి వీడ్కోలు చెప్పి ఏకాంత సమాధిలో కూరుకు పోయిన తను వెన్నెల వెళ్ళేదాకా ఆగి బ్రతుకు తెల్లవారిపోతూందని వెక్కి వెక్కిగా తల్లడిల్లిపోతూందేం.

మొన్న మెరిసిన హరివిల్లు మనసు పొరలపై గుచ్చుకుంటున్న తుమ్మ ముల్లులా బాధిస్తుండే ప్రశ్నలతో వేధించే బేతాళుడిలా మారి దాంప త్యాన్ని నరకం చేసుకుంటూందెందుకని?

సాలోచనగా నడిచింది నిర్జయ.

అధోలాంటి తమకంతో అతడి చెంపలపై చేయివేస్తూ పక్కన కూర్చుంది.

"బాధపడుతున్నారా?"

జవాబు లేదు.

"మిమ్మల్ని బాధ పెడుతున్నాను కదూ."

క్షణికమైనా అదీ జ్ఞానోదయమే....

ఏ స్మృతుల సంగీత రవాలు ఆమెను కలవరపెట్టాయో తల వంచుకునే అంది. "మీకోసం చాలాసేపు ఎదురు చూశాను. మీతో కలిసి ఎగ్జిబిషన్‌కి వెళదామన్న ఆలోచనతో మీరు తొందరగా ఇంటికి వస్తే బాగుణ్ణని ఆరాట పడ్డాను. మీరు రాకపోగానే ఉడుక్కున్నాను....అసలు...."

అంతకు మించి ఏం జరిగిందో ఆమెకే తోచడం లేదు.

చాలా చెప్పాలని వుంది. కాని మనసంతా శూన్యం.

ఆ శూన్యం మరింత విస్తరించి ఆమెను గెలవకముందే శ్రీహర్ష చేతులు అనునయంగా ఆమెను చుట్టేశాయి.

నిర్ణయ పులకించిపోయింది.

మనసు సంద్రాన స్వేరంగా కదిలిన షార్క్‌లు అదృశ్యమై చిట్టి చిట్టి రంగుల చేపలు ప్రత్యక్షమై ఆ గదిని 'అక్వారియం'గా మార్చాయి.

గంధర్వ స్వర మంజూష....

చినుకుల సడిలో తడిసిన చీకటి నీడల లోయలు....వెన్నెల సోకిన సముద్ర కెరటాల్లా వెర్రెత్తి పోతుంటే....

ఉద్రిక్త యౌవ్వన శిఖరాలపై నుంచి లోతికిన మోహిత ఒరుసుకుంటూ పయనించింది.

తెలినురుగుల తెరిపిలో ఓ చిన్న దీపం ఆ రాత్రి సౌందర్య సహా
వేశానికి ఉదయ సంధ్య దాకా వెలుగునిచ్చింది.

* * * *

ఆ రోజు చాలా ఉత్సాహంగా ఆఫీసులో అడుగు పెట్టాడు శ్రీహర్ష.

ఎంత సంతృప్తిగా వుందని.

ఎందుకు ఎలా జరిగినాగాని నిర్ణయలో చాలా మార్పు కనిపించింది. కోటుల తరబడి అసహనంలో చిక్కుకుని అశాంతిగా బ్రతకడమే అలవాటయిన నిర్ణయ చాత్రంతా అతడి ఒడిలో ఒదిగిపోయింది పసిపిల్లలా.

ఆ క్షణాలు శాశ్వతం కావాలని అతడు కోరుకోవడం దురాశ కాదు.

మాలిన్యం అంటని పసికందులాంటి మనస్తత్వంతో పొరికింది అబువంతైనా కాని అందులోనే ఆనందాన్ని వెతుక్కునే ఓ అల్ప సంతోషిలా బ్రతకడానికి కారణం అతడి బాల్యమే.

ప్రేమ రాహిత్యం బ్రతుకు భయం అతడ్నలా మార్చేశాయి.

"నమస్తే!"

పలకరించాడు రామశర్మ. సీనియర్ డ్రాఫ్ట్స్‌మేన్.

ప్రతి నమస్కారం చేసిన శ్రీహర్ష తన సీటు దగ్గరికి వెళుతుంటే అనుసరించాడు రామశర్మ. "ఏమిటో ఈ రోజు మీ మొహం వెలిగిపోతోంది."

మూడు గదులు, ఓ హాలూ వున్న ఆఫీసులో సుమారు పదిహేను మందిదాకా పనిచేస్తున్నా అందరిలోనూ ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలవాడు రామశర్మ.

నలభై అయిదు సంవత్సరాల వయసు గల రామశర్మకి ప్రపంచంలో తెలీని విషయంలేదు.

ఉపనిషత్తులు మొదలుకుని ఉగాండా రాజకీయ సమస్యలదాకా మాట్లాడతాడు. మాట్లాడ్డం కన్నా మాట్లాడగలనని నిరూపించుకోవడంలో ఎక్కువ ఉత్సాహాన్ని చూపిస్తుంటాడు.

అదొక్కటే కాదు....బ్రహ్మజ్ఞానం తనకు మాత్రమే తెలిసినందుకు తన చుట్టూ వున్న మనుషుల్లో చాలామంది మూర్ఖులే అన్నది అతడి బల మయిన నమ్మకం కూడా.

ఉద్యోగరీత్యా పొజీషన్‌లో రామశర్మ శ్రీహర్షకి సబార్డినేట్ అయినా శ్రీహర్ష పెరిగింది ఓ అనాథశరణాలయంలో కాబట్టి అతడ్ని చిన్న చూపు చూడటం అలవాటైపోయింది.

ఆ ఫర్మ్ యజమాని శంకర్ శ్రీహర్షకి మంచి స్నేహితుడని తెలిసినా శర్మకి సంకోచంలేదు.

ఇది కాకపోతే మరోటి అంటూ రామశర్మ ఉద్యోగం విషయంలోనూ భయపడకపోవటానికి కారణం శర్మకి యిదే తొలి ఉద్యోగం కాదు కాబట్టి.

శర్మ అప్పుడెప్పుడో స్టేట్ గవర్నమెంట్ పబ్లిక్ హెల్త్‌లో జాబ్ చేసేవాడు....ఓ సారి ఏంటీకరప్షన్ బ్యూరోకి పట్టుబడి ఉద్యోగం కోల్పో యాడు.

ఆ తర్వాత ముగ్గురు 'బిల్డర్స్' దగ్గర నుంచి మారి శంకర్ ఫర్మ్‌లో చేరిన శర్మ ఇప్పటికీ తను చాలా నిజాయితీ పరుడ్నే అని వాదిస్తుంటాడు. తను లంచగొండినని నిరూపించి ఉద్యోగం పీకేసినందుకే ఆ తర్వాత ప్రభుత్వం కూలిపోయి కొత్త ప్రభుత్వం వచ్చిందని చెబుతూ అధర్మం స్థానంలో ధర్మ సంస్థాపన జరగడం ఎన్ని యుగాలనుంచి ఆనవాయితీగా వస్తూన్నదీ ఏకరువు పెడుతుంటాడు.

ప్రశ్న అడిగినా జవాబు చెప్పని శ్రీహర్ష మౌనం తన ఉనికినే ప్రశ్నిస్తున్నట్టనిపించడంతో తననే ఏకాగ్రతగా గమనిస్తున్న హాల్లోని పది మంది కొలీగ్స్ ముందు మరోసారి రెట్టించాడు రామశర్మ. "మీరు జవాబు చెప్పలేదు."

"తెలీటంలేదు శర్మగారూ."

"ఏమిటి?" అణువంత వినయాన్ని నటించాడు శర్మ.

"ఏం జవాబు చెప్పాలీ అన్నది."

"నేనడిగింది ఈరోజు మీ మొహం అలా మెరిసి పోవటానికి కారణాన్ని."

ఇబ్బందిగా చూశాడు శ్రీహర్ష.

ఒకవేళ శ్రీహర్ష స్థానంలో మరొకడు వుండి వుంటే శర్మ ఇంతగా రెచ్చిపోయేవాడు కాదేమో.

ఇలాంటి మొహమాటం శ్రీహర్ష ప్రదర్శిస్తాడని తెలిసే శర్మ ఇంకా ఇరుకున పడేయాలనుకున్నాడు.

"మీ మొహం అలా మెరిసిపోవటానికి కారణం నిన్న మీరు క్లాసుకి వెళ్ళటం అనుకుంటాను."

అర్థం కానట్టు చూశాడు శ్రీహర్ష.

తను క్లాసుకి వెళ్ళినట్టు శర్మకెలా తెలుసు.

"గీతా బోధనలతో ఒక్కోమారు ఆత్మ దర్శనం జరిపి మనసులు ప్రక్షాళనమై మొహాలు మెరిసిపోతుంటాయి."

ఏ ఉద్దేశ్యంతో శర్మ యిదంతా మాట్లాడుతున్నదీ వూహించలేక పోయాడు శ్రీహర్ష.

"అసలు మీరింత గ్రంథసాంగులని నాకు తెలీదు సుమండీ" రహస్యంలా అంటున్నట్టు నటించాడుగాని శర్మ గొంతు హాల్లో అందరికీ వినిపించింది "అవునూ మిమ్మల్ని మారుతీలో ఎక్కించుకుపోయిందే ఆవిడెవరటా!"

"ప్రమీల" టక్కున చెప్పాడు శ్రీహర్ష.

ఇప్పుడు యిబ్బంది పడటం శర్మ వంతయింది. అసలు ఆ టాపిక్ రాగానే శ్రీహర్ష కుంచించుకుపోతాడని నలుగురి ముందూ విడియంగా తల

వంచుకోగానే కట్టుకున్నదాన్ని మోసంచేస్తే ఎన్ని మహాపాతకాలు చుట్టు కుంటాయో అన్న విషయాన్ని సోదాహరణంగా చెప్పాలనుకున్నాడు గాని అలాంటి ఛాన్సు మిస్సయిపోతున్నట్టు గ్రహించాడు శర్మ.

"ప్రమీలంటే...."

"ఒకప్పుడు నేనుండే యింటివాళ్ళ అమ్మాయి."

"ఒకప్పుడూ అంటే పెళ్ళికి ముందా తర్వాతనా?"

శర్మ ఇలా అంటూ చూసింది శ్రీహర్షని కాదు. హాల్లోవున్న మిగతా కొలీగ్స్‌ని.

"పెళ్ళికి ముందే."

"అలా చెప్పండి" టక్కున అన్నాడు శర్మ అవహేళనగా "కాదిట్టే అడగ్గానే కారెక్కేశారు."

శ్రీహర్ష సాత్వికుడేమో కాని అవహేళనలు అర్థం చేసుకోలేనీ అమాయకుడు కాడు.

టాపిక్ డైవర్ట్ చేద్దామనుకుంటూ అన్నాడు శ్రీహర్ష "అంటే.... మీరూ క్లాసుకి వచ్చారన్నమాట?"

"బ్రాహ్మణుడ్నిగా" మరో అస్త్రం సంధించాడు శర్మ.

ఈ ప్రసక్తిని పొడిగించటం యిష్టం లేదు శ్రీహర్షకి.

"ఏమిటి మాటలు దొరకనట్టు మౌనాన్ని ఆశ్రయించారు."

"గీతా యజ్ఞం ఉద్దేశించబడింది కేవలం బ్రాహ్మణులకే కాదను కుంటాను శర్మగారూ?"

"నిజమే. కాని మిగతా వాళ్ళు అక్కడకు వచ్చేది కాలక్షేపం కోసం మాత్రమే."

శ్రీహర్షలో సహనం నశించిపోతూంది "అంటే మీకు మాత్రమే ఆత్మ దర్శనం అవసరమంటారు."

ఇందాక తను అన్న మాటని తనకే అప్పచెప్పడంతో చురుక్కు-మందేమో వెంటనే రియాక్టయ్యాడు శర్మ. "ఆత్మ దర్శనం అంటే అమ్మాయి దర్శనం కాదుసుమండీ."

శ్రీహర్ష వెంటనే జవాబు చెప్పలేదు.

శర్మ మూర్ఖపు ఆలోచనలు చాలా స్పష్టంగా బోధపడిపోతుంటే రెండు క్షణాలు నిశ్శబ్దంగా చూసి ఆ తర్వాత అన్నాడు.

"మీకు బీర్బల్ తెలుసనుకుంటాను."

"శాస్త్రాలు చదివినవాడ్ని. తెలియకపోవటమేమిటి?"

"అవును....పండితులు కదూ!"

ఆఫీసు స్టాఫంతా ఉత్కంఠతగా చూస్తున్నారు.

అసలు శ్రీహర్ష యింతలా మాట్లాడటం అక్కడ ఎవరూ వూహించని విషయం.

"అక్బర్ కొలువులో వుండే బీర్బల్ ఆయనకి మంచి స్నేహితుడు, మంత్రి మాత్రమే కాదు మహా మేధావి."

"ఆ విషయం నాకూ తెలుసు."

"ఒకనాడు రాంపాల్ అనే ఓ బ్రాహ్మణుడు బీర్బల్ దగ్గరికి వచ్చాడు."

తన పేరు రామశర్మ కావటంతో ఇక్కడో రాంపాల్ అనే ఓ బ్రాహ్మణుడి గురించి చెబుతున్నాడనుకున్నాడే తప్ప ఏం చెప్పాలనుకుంటున్నదీ ముందు అర్థంకాలేదు శర్మకి.

"ఆ బ్రాహ్మణుడు మేధావననుకునే మూర్ఖుడు. నిజంగా శాస్త్రాలు చదవకపోయినా చదివేనని భ్రమపడే అవివేకి."

రామశర్మ మొహంలో రంగులు మారిపోతున్నాయి.

"అలా నలుగురూ అవివేకి అనుకోవడం తెలిసిన సదరు బ్రాహ్మణుడు బీర్బల్‌ని కలిసి నేను పండితుడ్ని అనిపించుకోవాలి అంటే ఏం చేయాలి

అని అడగడం కాదు........నీకు శక్తి వుంటే అందరూ నన్నలా పిలిచేట్టు చెయ్ అంటూ సవాల్ చేశాడు. బీర్బల్ నవ్వాడు........పాండిత్య ప్రకర్ష లేకుండా అలా పిలిపించుకోవటం కష్టం అన్నాడు........రాంపాల్ ఇప్పుడు మీలానే మొండిగా వాదించాడు. వాదించడమే కాదు అలా తనను నలుగురి చేతా పిలిపించలేని బీర్బల్‌ని అసమర్థుడిగా అంగీకరించమన్నాడు....బీర్బల్ లాంటి మేధావి అహం కూడా దెబ్బతింది."

జేవురించిన మొహంతో రామశర్మ చాలా ఏకాగ్రతగా వింటున్నాడు.

"ఎవరన్నా నిన్ను పండితోత్తమా అనగానే నువ్వు నాలుగు తిట్టి రాళ్ళతో కొడితే ఆ తర్వాత నిన్ను నలుగురూ ఇక అదే పద్ధతిలో పిలిచే అవకాశముందన్నాడు........రాంపాల్‌కి అర్థం కాలేదు. అసలు పండితుడ్ని కాదని అందరూ అనుకుంటుంటే పండితోత్తమా అని కూడా పిలవడమేమిటి అని ఆలోచిస్తూ యింటికి వెళ్తున్నాడు. సరిగ్గా అదే సమయానికి బీర్బల్ తన శిష్యుడ్ని పిలిచి చెప్పాడు రోడ్డుమీద నడుస్తున్న రాంపాల్‌ని 'పండితోత్తమా' అని పిలవమని....పిలిచాడు బీర్బల్ శిష్యుడు....బీర్బల్ చెప్పింది గుర్తుకొచ్చిన రాంపాల్ వెంటనే నాలుగు తిట్టి బీర్బల్ శిష్యుడ్ని రాళ్ళతో కొట్టాడు....జనం పోగయ్యారు........అసలే రాంపాల్ మూర్ఖత్వం తెలిసి వుండటంతో అతడ్ని రెచ్చగొట్టటానికి అలా పిలిస్తే చాలనిపించి అంతా అప్పటినుంచీ 'పండితోత్తమా' అంటూ ఎగతాళిగా పిలవడం ప్రారంభించారు.....పంతులుగారి కోరిక అలా నెరవేరింది....బీర్బల్ మంటా చల్లారింది."

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

"ఇదంతా నాకు ఎందుకు చెప్పినట్టు" అడిగాడు రామశర్మ అవమాన భారంతో.

"సింపుల్ శర్మగారూ........" నిజాయితీగానే అన్నాడు శ్రీహర్ష. "బ్రాహ్మణుడైనంత మాత్రాన బ్రహ్మజ్ఞానం తెలిసే అవకాశం లేదని చెప్ప టానికి....మీరు నిజంగా శాస్త్రాల్ని చదివివుంటే మీ ఎదుటివాళ్ని ప్రేమించే అలవాటు మీకూ అబ్బేదని స్పష్టం చేయటానికి."

"వండర్ ఫుల్"

అలా అన్నది స్టేఫ్ కాదు....మోనీ.

ఇందాకట్నుంచీ స్టేఫ్‌తోపాటు మోనీ కూడా వారి చర్చ వింటున్నట్టు శ్రీహర్షకి తెలీదు.

"యూ హేవ్ టాట్ నైస్ లెసన్ టు హిమ్ మిస్టర్ శ్రీహర్షా.... బహుశా శర్మగారు ఇప్పుడప్పుడే తేరుకోలేదనుకుంటాను" మోనీ మరింత రెచ్చగొట్టింది.

చిత్రం అదే........ఆఫీసులో అందరిపైనా దాడిచేయగల రామశర్మ మోనీ దగ్గర జాగ్రత్తగా వుంటాడు.

మెదిరేవాళ్ళపై స్వారీ ఉత్సాహంగా వుంటుందిగాని తిరుగుబాటు ధోరణిగల వ్యక్తులతో పేచీ పెట్టుకోవడం కొరకంచుతో కోరి తల గోక్కో వడంలాంటిది శర్మకి బాగా తెలిసిన థియరీల్లో యిదీ కూడా ఒకటి.

నిజానికి ఆంగ్లో ఇండియన్ అయిన మోనీ తిరుగుబాటు ధోరణిగల వ్యక్తిమాత్రమే కాదు....అవసరమైతే మగాడిలా కలియబడుతుంది. వెనకా ముందూ చూడకుండా దూషించేస్తుంది.

అప్పుడెప్పుడో లంచవర్‌లో కొలీగ్స్‌తో 'ఆడది శీలం' అన్న టాపిక్‌పై శర్మ అనర్గళంగా మాట్లాడుతుంటే అతడి మాటల్లో దొర్లుతున్న 'పురాణాలు' అన్న పదం విన్న మోనీ 'మీ పురాణాల ప్రత్యేకత ఏమిటి?' అంది.

మోనీ శీలం మీద నమ్మకంలేని శర్మ ఆమెను కంగారుపెట్టాలని "మా పురాణాలు సీత, సావిత్రి, అనసూయలాంటి పతివ్రతల కథలతో పవిత్రతని సంతరించుకున్న గొప్పగాథలూ" అన్నాడు.

మోనీ ఆలస్యం చేయలేదు.

"మీ పురాణాల్లోనే తప్ప మీ యింట్లో వుండే మీ తల్లులూ, చెల్లెళ్లూ, భార్యలూ పతివ్రతలు కారా?" ఠక్కున అడిగింది.

అంతే....శర్మకి యింకుమించు మూర్ఛ వచ్చినంత పనయింది.... మోనీకి జవాబు చెప్పలేకపోవడం ఒక్కటే కాదు. ఇక జన్మలో ఆమెతో ఏ విషయమూ చర్చించకూడదనుకున్నాడు.

ఆ తర్వాత మోనీ మామూలుగా మాట్లాడాలని ప్రయత్నించింది. కాని శర్మ తప్పించుకునేవాడు.

నిజానికి సర్కాస్టిక్‌గా అడిగినా మోనీ వుద్దేశ్యం పురాణాల్ని అవమానించడం కాదు....మేరీ మేగ్డలిన్ కథ తెలిసి వుండడంతో బైబిల్ చదివిన మోనీ పురాణాల గురించి నిజాయితీగా రియాక్టయింది.

శర్మ అదృశ్యమైపోగానే శ్రీహర్ష దగ్గరికి వచ్చింది మోనీ.

"కంగ్రాట్స్."

విడియంగా చూశాడు శ్రీహర్ష.

"దేనికి?"

"అమాయకంగా కనిపిస్తారే తప్ప అమాయకులు కారని తెలియచెప్పినందుకు...."

నిశ్శబ్దంగా వుండిపోయాడు జవాబు చెప్పకుండా.

"మనిషిలో గొప్ప బలహీనత ఏమిటంటే తను మేధావినని భావించటం అంటాడు సిమ్మన్స్....మీరు మేధావి అవునో కాదో నాకు తెలీదు. కాని శర్మకి మాత్రం అలా ఆలోచించే బలహీనత వుందని అర్థమయి

పోయింది శ్రీహర్షా! కాబట్టే మీరిచ్చిన షాక్ ట్రీట్‌మెంట్‌కు తోక ముడి చేశాడు....వెల్....ఇట్స్ నైస్ టు అబ్జర్వ్....”

అభినందించి వెళ్ళిపోయింది మోనీ.

దూరంగా శర్మ డ్రాయింగ్ బోర్డు ముందు నిలబడి ‘లే అవుట్’ చూస్తున్నాడు.

అతడు స్టడీ చేస్తున్నాడో, వట్టిగా చూస్తున్నాడో తెలీదు కాని శ్రీహర్ష మనసు ద్రవించినట్టయింది.

ఇంతవరకూ ఏనాడూ ఆతడి కామెంట్స్‌ని పట్టించుకోని తను యీ రోజూ నిశ్శబ్దంగా వుండిపోవాల్సింది అనుకున్నాడు కాని ఆ క్షణంలో శర్మ ఆలోచిస్తున్నది తన గురించే అని వూహించలేకపోయాడు శ్రీహర్ష.

బాగా తాగేవాడు రుచిని పట్టించుకోనట్టు అతిగా మాట్లాడేవాడు తక్కువగా ఆలోచిస్తుంటాడు........ఇందాక ఆలోచించకుండా అతిగా మాట్లాడిన శర్మ యిప్పుడు చేస్తున్నది ఆలోచించడం.

అదీ....

శ్రీహర్ష గురించే....

అసలు శ్రీహర్ష యిలా పాఠం చెప్పడం తను నిస్సహాయంగా మిగిలిపోవడం తన ఉనిక్కే ప్రమాదకరమనిపించింది.

ప్రమాదమూ అంటే శ్రీహర్ష పరంగా శర్మకేదో ముంచుకొస్తుందని కాదు....ఇందాక జరిగిన సంఘటన్ని స్టాఫంతా గమనించారు....అదీ చాలు అందరిలో తను చులకనై పోవటానికి.

ఆ మారుతి కారు అమ్మాయి ఎవరు....

అమ్మాయేనా....

మసక వెలుతురులో సరిగ్గా చూడలేదు....

ఈ రోజు చూడాలి....

ఆత్మ సాక్షాత్కారం సిద్ధించిన జ్ఞానినంటూ తన గురించి తాను గొప్పగా చెప్పుకునే ఓ వ్యక్తి యిలా తమోగుణంతో మనసుని పాడుచేసు కుంటున్న క్షణంలో....

శ్రీహర్షకి హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చింది....నిర్ణయతో ఆరోజు వెళ్ళా ల్సిన ఎగ్జిబిషన్ సంగతి మాత్రమే కాదు....నిన్నటి రాత్రి ప్రమీల కిచ్చిన మాట కూడా....

నిర్ణయ ఇప్పుడు మామూలు మూడ్‌లో వుంది. చెబితే అర్థం చేసు కుంటుంది.

కాని ప్రమీల బాధపడుతుంది. 'ఈసారిమాటతప్పి పోరిపోవుగా' అని ప్రమీల నిన్న అన్న వాక్యం పదేపదే గుర్తుకొస్తుంటే ఎదురుగా ఉన్న ఫోన్ అందుకున్నాడు.

నిర్ణయ పనిచేస్తున్న ఫ్యాక్టరీకి డయల్ చేశాడు.

సునాయాసంగా ఒప్పించగలిగేవాడే కాని ఫోన్ రిసీవ్ చేసుకున్నది నిర్ణయ కాదు....రాధేశ్యాం.

నిజానికి నిర్ణయ సీటులోనే వున్నా ఫోన్ చేసింది శ్రీహర్షగా తెల్సిన రాధేశ్యాం ఆమె పక్క డిపార్టుమెంట్‌కి వెళ్ళిందన్నాడు.

శ్రీహర్ష ఫోన్ క్రెడిల్ చేసేవాడే.

కాని శ్యాం "ఏమైనా మెస్సేజ్ చెప్పమంటారా?" అన్నాడు మరి కొన్ని వివరాల్ని తెలుసుకోవాలన్న ఆసక్తితో.

చాలా మామూలు ప్రశ్నది.

కాబట్టే శ్రీహర్ష అనుమానించలేకపోయాడు.

"సాయంకాలం ఎగ్జిబిషన్‌కి వెళ్లాలనుకున్నాం....ఆ ప్రోగ్రాం వీలు పడదని చెప్పండి."

అసంకల్పితంగా అనేసిన శ్రీహర్షకి వెంటనే స్ఫురించింది.

ఆ విషయం చెప్పాల్సింది తను మాత్రమే....మూడో వ్యక్తి కాదు.

"శ్యాం నిర్ణయ సీటుకి రాగానే నన్ను కాంటాక్ట్ చేయమంటారా" అన్నాడు శ్రీహర్ష ఓ అభ్యర్థనలా.

"ఓ.కె."

రిసీవర్ని హుక్ చేసిన రాధేశ్యాం కిటికీ వారగా సీటులో కూర్చుని ఫైల్స్ స్టడీచేస్తున్న నిర్ణయని చూశాడు.

పరిసరాల్ని గమనించనంత ఏకాగ్రతగా తన పనిలో నిమగ్నమై వుంది.

సయోధ్యలేని భార్యాభర్తలు....మధ్యతరగతి జీవితంతో రాజీపడలేక పోతున్న నిర్ణయ...చూస్తున్నకొద్దీ కాంక్షను పెంచుతున్న నిర్ణయ అందం..

నిజమైన అవకాశవాది అవకాశాల కోసం ఎదురు చూడడు ....అవ కాశం తీసుకుంటాడు. కొండొకచో అవకాశాల్ని సృష్టించుకుంటాడు....

"ఏమిటి బిజీగా చదువుతున్నారు"

తన ఆలోచనలకి రూపం యిచ్చే ప్రయత్నంగా నిర్ణయకి అభి ముఖంగా కూర్చుంటూ అడిగాడు శ్యాం.

నిర్ణయ తల పైకెత్తి చూసింది.

శ్యాంకి తెలుసు ఆమె స్టడీచేస్తున్నదేమిటో....

ఆ టాపిక్ కాదు తనకి కావాల్సింది.

"సో....నిన్న మీరు మైకేల్ జాక్సన్ డేంజరస్ కేసెట్ విన్నారన్న మాట...."

"లేదు....కొంచెం పనుండి కేసెట్ కొనలేకపోయాను" ముభావంగా అంది.

"అదేమిటి?" చాలా ఆశ్చర్యాన్ని నటించాడు. "వీలు కాకపోతే ఈ రోజన్నా నన్ను అడగొచ్చుగా"

ఆ 'అడగడం' అన్నది దేనికోసమో ముందామెకు అర్ధంకాలేదు.

"మనలో మనకి మొహమాటాలేమిటి నిర్ణయా....మీ ప్రస్తుత స్థితి నాకు తెలుసుగా."

అదే....సరిగ్గా ఆవాక్యమే ఆమెలోని సహనాన్ని సగానికి కుంచింప చేసింది.

"అలా ఆశ్చర్యంగా చూడకండి నిర్ణయా. ఒకప్పటి మీ స్థితిగతుల బట్టి అయితే కేసెట్స్ గాని, టేప్ రికార్డర్స్ కొనటం చాలా మామూలు విషయం. కాని ఇప్పుడో, మీరు కట్టుకున్నది ఓ మధ్య తరగతి వ్యక్తిని. సహజంగా కొన్ని ఆర్థికమైన ఇబ్బందులుంటాయి. అవి మీ ఆలోచనల్ని, సర్దాల్ని చాలా వరకూ సమాధి చేస్తుంటాయి."

"అలాంటిదేం లేదు" అర్ధోక్తిగా అంది నిర్ణయ.

"మీరలా అంటే మాత్రం నేనెలా నమ్మగలను" ఆమె నిస్సహాయ స్థితిపై పోజిటివ్‌గా దెబ్బ తీయాలనుకున్నాడు. "చాలా సుఖాల్ని కాదని కోరిన వ్యక్తితో వచ్చేసిన మీరు యిప్పుడు ఏ స్థితిలో బ్రతుకుతున్నదీ నేనూహించగలను నిర్ణయా. మీ స్వాభిమానం బాహాటంగా అంగీకరించ టానికి అడ్డు పడొచ్చు. కాని ట్రూత్ ఈజ్ ఆల్వేస్ ట్రూత్."

సన్నగా ప్రకంపిస్తోంది నిర్ణయ.

తన స్థితి చాలామందికి తెలిసిపోయింది.

ముఖ్యంగా శ్యాంకి బోధపడిపోయింది.

అలాంటి అమ్మాయికి ఎక్కువ బాధకలిగించేది లేమికాదు....లేమిలో బ్రతుకుతున్నామన్న ఫీలింగ్.

కేవలం అదే ఫీలింగ్‌తో యింత కాలమూ శ్రీహర్షని బాధపెడుతూ వస్తోందని గ్రహించిన శ్యాం యిప్పుడు ఆ భావం చావకుండా వుంచటానికి తరచూ చాలా ప్రయత్నిస్తున్నాడు.

"మీరు నా మాటల్ని అంగీకరించారనటానికి మీ మౌనమే సాక్ష్యం నిర్జయా....ఇక అట్టే ఆ విషయం చర్చించటం నాకూ యిష్టంలేదు. కాబట్టి ఓ పని చేయండి."

ఏమిటన్నట్టుగా చూసింది.

"సాయంత్రం మనిద్దరం ఎగ్జిబిషన్‌కి వెళదాం. ఓ ఫ్రెండ్‌గా మీకు కావాల్సినది నేను...."

"మిస్టర్ శ్యాం"

నిర్జయ హర్టయిందని అర్థమైపోయింది.

"సారీ మిసెస్ నిర్జయా.... ఇప్పుడు నేను అడిగింది మీ మీద ఓ ప్రయోగంలానే"

"అంటే?" ఆమె భృకుటి ముడివడింది.

"ఎంత ఉన్నింటి అమ్మాయి అయినా మధ్య తరగతి జీవితంలో అడుగు పెట్టాక రాజీపడి బతకటం అలవాటు చేసుకుంటుందన్నది నా నమ్మకం. మీరు ఆ స్థాయికి దిగజారలేదని తెలిసిపోయింది ఇప్పుడు మీరు ప్రదర్శించిన ఆత్మాభిమానంతో."

ఆమె అవాక్కయినట్టుగా చూసింది.

"స్ప్లెండిడ్ మిసెస్ నిర్జయా....మీరు మీరే.....ఇది తెలుసుకున్నందుకు నాకు చాలా గర్వంగా వుంది."

నిర్జయకిది చాలా గర్వంగా అనిపించింది.

అతను విసిరే వలలా లేదు, సంధించే అస్త్రాలలో ఇందాకటి చర్చ కూడా ఓ భాగం అని తెలుసుకోలేకపోయినా అతను తన గురించి వ్యక్తం చేసిన భావం ఆమె అహాన్ని చల్లార్చింది.

ఇద్దరు ప్రత్యర్థుల్ని సైతం దగ్గర చేయగల చిత్రమైన చర్చలు కొన్ని వుంటాయి.

ఇప్పుడు జరిగిందీ అలాంటిదే.

"సారీ" అంది నిర్ణయ అక్కడికి తనే అతడ్నేదో బాధపెట్టినట్టుగా.

ప్రసక్తిని ఖండించటం శ్యాంకి యిష్టంలేదు. "సారీదేనికి?"

"ఇందాక నేను ఆవేశాన్ని ప్రదర్శించినందుకు."

"భలేవారే" నవ్వేశాడు శ్యాం. "మీరు అలా ప్రదర్శిస్తే మాత్రం నేను బాధపడతాననుకున్నారా? ఇష్టమైన వాళ్ళచేత తిట్టించుకోవడమూ నాకిష్టమే."

ఈ 'ఇష్టం' అనే పదం శ్యాం యిప్పటికి చాలాసార్లు వాడినా అదీ కేవలం స్నేహం దాకానే అన్వయించుకుంది నిర్ణయ.

"మీ ఇష్టాన్ని లేదా మిమ్మల్ని మరెవరో ఇష్టపడటాన్ని మీ మేన కోడలు అనూహ్యాతే పరిమితం చేయడం బెటరనుకుంటాను మిస్టర్ శ్యాం...."

క్షణం పాటు రెప్పలార్పకుండా చూశాడు.

"నిజమే....కాని అనూహ్య ఇప్పుడప్పుడే నన్ను అంగీకరిస్తుందనుకోను."

"అదేం. గతాన్ని మరిచిపోలేకపోతుందా?"

"కారణం అది కాదనుకుంటాను....నిన్న రాత్రి అనూహ్య ఫోన్‌లో మాట్లాడిన దాన్నిబట్టి అర్థమైందదే."

"నిన్న రాత్రి మాట్లాడిందా?"

"నిన్న రాత్రే ఏమిటి....ఇంచుమించు ప్రతిరాత్రీ స్టేట్స్ నుంచి మాట్లాడుతుంది."

"అంటే అది ప్రేమేగా!"

"ప్రతి రోజూ మాట్లాడుకోవడం ప్రేమే అవుతుందా నిర్ణయా?"

అతడి ప్రశ్న నిర్ణయకి మరెక్కడో తాకినా నిభాయించుకుంది.

నిర్ణయలో కలిగిన సంచలనం చాలా సంతోషాన్నిచ్చింది శ్యాంకి. అలాంటి రియాక్షన్ ఆశించే ఆ వాక్యాన్ని ప్రయోగించాడు.

"నిన్న రాత్రి ఫోన్ చేయగానే అనూహ్య అడిగిన తొలిప్రశ్నేమిటో చెప్పమంటారా? సెన్సువల్ లవర్ అంటే ఏమిటి? అని.... షాక్ తిన్నాను. ఈ ప్రశ్నకి జవాబు తెలీని వాడివి నువ్వు నాకు భర్తవెలా కాగలవూ అంటూ హేళనగా మాట్లాడింది."

మౌనంగా వుండిపోయింది నిర్ణయ.

ఆ చర్చ గురించి వినాలనుకుందే తప్ప శ్యాంతో చర్చించటం ఆమె కిష్టంలేదు.

"సరిగ్గా నేనూ మీలాగే నిశ్శబ్దాన్ని పాటించాను నిర్ణయా. ఎందుకంటే నాకూ జవాబు తెలీదు కాబట్టి."

చురుక్కుమందేమో నిర్ణయ వెంటనే రియాక్టయింది.

"ప్రేమలో Sensuality అంటే బహుశా లోతుగా ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకోవడమనుకుంటాను."

ఏ ప్రసక్తిని రప్పించాలని శ్యాం ఇలాంటి చర్చకి సిద్ధపడ్డాడో నిర్ణయ గ్రహించి వుంటే జవాబు చెప్పాలనే ప్రయత్నం కన్నా చర్చని త్రుంచేసేది.

అలా చేయటానికి ఆమె అహం అడ్డుపడింది.

అదే శ్యాంకి అవకాశమైంది.

కూడని కొన్ని చర్చలు ఇద్దరు వ్యక్తుల మధ్య అడ్డుగోడలుగా వుంటే మొహమాటపు పొరల్ని ఛేదించి అనవసరమైన సాన్నిహిత్యాన్ని పెంచుతుంటాయి.

"మీరు సగందాకా కరెక్టుగానే గెస్ చేశారు నిర్ణయా.... ఇందాక తెలీదన్న నేను యిప్పుడు సగం నిజమని ఎలా చెప్పగలుగుతున్నానూ అంటే నా జవాబు ఒక్కటే....అనూహ్య ఛాలెంజ్‌తో షాక్‌తిన్న నేను ఉదయమే సెంట్రల్ లైబ్రరీకి వెళ్ళి మోడరన్ సైకాలజీ బుక్స్ వెరిఫై చేశాను."

నిర్ణయ మొహంలోని భావాల్ని గమనిస్తూ అన్నాడు.

"సెన్సువల్ లవ్ అంటే ప్రియుడు, ప్రియురాలు ఒకరి నొకరు లోతుగా అర్థం చేసుకోవడం ఒకటే కాదు ఫైవ్ ఫిజికల్ సెన్సెస్‌తో అంటే పంచేంద్రియాలతో ప్రేమను పంచుకోవడం అంటాడు సాన్ ఫ్రాన్సిస్‌కో సెక్స్ థెరపిస్ట్ లోన్నెకోలె."

నిర్ణయ విస్మయంగా చూస్తూందే తప్ప ఏ ఆలోచనల్ని అతడు బలవంతంగా తనలోకి చొప్పించాలని ప్రయత్నిస్తున్నాడో అర్థం చేసుకో లేక పోయింది.

"ఇదెలా సాధ్యం అన్నది మీ అభిప్రాయం కావచ్చు నిర్ణయా.... సహజమే....పంచేంద్రియాలలో మొదటిది స్పర్శ....అంటే టెండర్ టచ్....అమ్మాయిని అప్పుడప్పుడూ కౌగిలించుకోవడం, పెదవులతో ఆమె కంఠాన్ని స్పృశించడం ఆప్యాయంగా భుజంపై చేతినుంచి లాలనగా మాట్లా డ్డం ఈ కోవకి చెందుతుంది....ఇలా శారీరకమైన క్లోజ్‌నెస్‌ని ప్రదర్శించడం ఒకటి. రెండోది సైట్ అంటే పంచేంద్రియాలలోని నేత్రాలతో ప్రేమను పంచుకోవడం. కళ్ళతో శరీరాన్ని లోతుగా చూడటం ఒకరి కళ్ళలోకి ఒకరు ఆర్ద్రతగా పరామర్శించుకోవడం ఈ కోవకి చెందింది. మూడోది శ్రవదా నందం. అంటే పంచేంద్రియాలలో చెవికి ప్రాముఖ్యత నివ్వటం. సంగీతం వినటం ఇద్దరిలో కోరికల్ని నిద్రలేపే ఓ బలమైన సాధనమట. ఆ సంగీతం మరోవ్వా విస్పర్స్‌తో మనల్ని గిలిగింతలు పెట్టేది కావచ్చు. లేదా ఓ

వర్షం రాత్రి మనం గదిలో ఉండగా ఈదురు గాలులు ఉరుముల చప్పుడూ ఒకరి నొకర్ని దగ్గర కావాలని ప్రేరేపించేది కావచ్చు."

నిర్ణయకి చర్చ చాలా యిబ్బందిగా అనిపిస్తూంది.

కాని అతడ్ని వారించలేకపోయింది.

అవి ఇంకా తెలుసుకోవాన్న తపనో లేక మొహమాటమో ఆమెకె తెలీదు.

"నాలుగోది స్మెల్ అంటే ఘ్రాణ నాడులకి పని కల్పించడం అంటాడు న్యూయార్క్ సెక్స్ స్పెషలిస్ట్ జాస్‌మేన్. మీరు శరీరానికి ఇంటిమేట్ సెంట్ రాసుకుంటారు. లేదా సుగంధాన్ని వెదజల్లే పూలు తలలో తురుముకుంటారు....అది నాలో కోరికలు నిద్రలేవటానికి కారణ మవుతుంది. చివరిది అయిదో ఇంద్రియానికి చెందేది 'టేస్ట్' నాలుక్కి చెందిన రుచి........అంటే ఓరల్ సెక్స్ మాత్రమే కాదు. పదకొండో శతాబ్దానికి చెందిన పర్షియన్ పోయిట్ ఉమర్ ఖయ్యాం 'ఓ జగ్గులో వైన్ బ్రెడ్‌ని రుచిచూస్తూ నిన్ను దర్శించడం నా జీవితానికి అర్థం' అంటాడు తన ప్రియురాలితో. దీనికర్థం ఇష్టమైనది రుచి చూస్తూ ఇష్ట దేవతలాంటి ప్రియురాలి సమాగమనాన్ని కోరుకోవడమేగా."

"కాని...." మరెటో చూస్తూ అంది నిర్ణయ.

"మీరు చెప్పిన థియరీ కేవలం శారీరక సుఖాన్ని ప్రేరేపించేదిగానే వుంది తప్ప సెన్సువల్ లవ్‌ని స్పష్టం చేసేదిగా లేదు."

"సెక్స్‌లేని ప్రేమే లేదు నిర్ణయా....ఉదాహరణకి మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాననుకుందాం....మరోలా అనుకోకండి....జస్టెన్ ఎగ్జాంపుల్. చాలామంది అమ్మాయిల కన్న ఆ మాట కొస్తే నేను జీవితంలో యింత వరకూ చూసిన ఎందరో గాళ్స్ కన్నా మీరు అందగత్తె....కాబట్టే నేను మీకు మనసిచ్చాను. నా ఆరాధనకి పులకించిన మీరు కొంత కాలానికి నా

ప్రేమను అర్థం చేసుకుని మీరూ ప్రేమించడం మొదలు పెడతారు. ఆ తర్వాత మన ప్రేమ పరాకాష్టకి చేరుతుంది. ఎలా....మన మధ్య శారీరక సంబంధంతో."

"అదీ...." అసహనంగా తల వంచుకుంది "ఈ దేశానికి యిక్కడ ప్రేమలకి చెందిన నిర్వచనం కాదు. ఎందుకంటే యిదీ యూరోపియన్ కంట్రీ కాదు."

నవ్వేశాడు శ్యాం...."గాడ్."

నిర్ణయ అర్థం కానట్టు చూసింది.

"ఓ చదువుకున్న అమ్మాయి...పైగా మోడర్నిటీ గురించి అసాధారణ మైన అవగాహన గల మీలాంటి యువతి మాట్లాడాల్సిన పద్ధతి కాదిది."

"నేననేదీ అది కాదు మిస్టర్ శ్యాం. మీరిందాక అన్నారే....సెక్స్ థెరపిస్ట్ లోన్నెకో లెథియలీ....అదీ కేవలం పెళ్ళయిన భార్యాభర్తల సెక్స్ లైఫ్‌కి చెందినదయ్యుంటుంది."

"యూ మీన్" అబ్బురంగా చూశాడు శ్యాం అక్కడికి తనేదో ఓ ఘోరమయిన విషయం విన్నట్టు "సెక్స్ అన్నది కేవలం పెళ్ళయిన వాళ్ళకి మాత్రం చెందిన ప్రక్రియంటారా?"

"యస్...." ఖండితంగా అంది.

"సారీ మిసెస్ నిర్ణయా....మీరిలా ఆలోచించడం నా వూహ కంద నిది....ఆడా లేక మగ అని నిర్దేశించేది మెదడే తప్ప మనిషి శరీర అవయ వాలు కావని ఒకపక్క సైన్సు ఉద్ఘోషిస్తుంటే మీరు అసలు సిసలైన ఆడ పిల్లలా మాట్లాడ్డాన్ని నేను భరించలేకపోతున్నాను." అసలు సెక్స్ కేవలం పెళ్ళయాక మాత్రమే ఎందుకు ఆమోదయోగ్యం అవుతుంది. "భర్త ఇంపోటెంట్ లేదా సరైన ప్రేమని అందించలేని మగాడై వుంటాడు. అంతమాత్రం చేత భార్య జీవితాంతం అతడితోనే అడ్జస్టయిపోవాలా....తన సుఖం గురించి తను ఆలోచించకూడదా?"

"తప్పదు. అడ్జస్ట్ కావాలి. లేదూ అంటే విడాకులు తీసుకుని తను కోరిన జీవితానికి సిద్ధపడాలి."

"కాని ఈ దేశంలో విడాకులన్నవి విస్తరాకులు కొనడమంత తేలిక్కాదే...." అలాంటి భర్తనుంచి విడాకులు తీసుకునేసరికి ఆమె యవ్వనం కరిగిపోయింది."

"అదీ కాదు మిస్టర్ శ్యాం" ఎలా ఒప్పించాలో ఆమెకు తోచడం లేదు.

"కొన్ని కట్టుబాట్లు అంటూ ఉండకపోతే వివాహ వ్యవస్థకే అర్థం లేకుండా పోతుంది."

"అంటే మీ ఉద్దేశ్యం వివాహ వ్యవస్థకి అర్థం ఎలాంటి స్థితిలో అయినా కాంప్రమైజ్ అయి బ్రతకడం అంతేగా."

"తప్పదు."

"అదీ తప్పంటాను నేను....భార్యాభర్తల మధ్య సెక్స్‌కి వివాహం ఆమోద ముద్ర వేస్తుందేమో తప్ప సంతృప్తికరమైన సెక్స్ జీవితానికి మార్గాన్ని నిర్దేశించదు. ఒకవేళ భర్తలో శారీరక సుఖాన్నిచ్చే శక్తి లేక పోతే ఆ సుఖానికి వివాహం ఎలాంటి హామీనీ యివ్వదు. ఇవ్వలేదు.... నిజానికి సెక్స్ అన్నది దాంపత్యంలో మరోతరాన్ని సృష్టించే ప్రక్రియ మాత్రమే కాదు నిర్ణయా.......జీవితాంతం అవగాహన్ని పెంచే సాధనం కూడా. అలాంటిది మిస్సయితే అదీ ఇష్టంలేని కాపరమేగా. అసలు సెక్సు వల్ ఇన్‌స్టింక్ట్స్ మొదలయ్యేది పెళ్ళితో మాత్రమే కాదుగా....పెళ్ళికి ముందు కూడా ఆ కేంద్రాలు పనిచేస్తూనే వుంటాయిగా....అలాంటప్పుడు ఇష్టం వున్నది పీల్చడమూ యిష్టమైనది తినడమూ కావాల్సింది తాగడం లాగే కోరిన మనిషితో సంబంధం పెట్టుకోవటం తప్పెలా అవుతుంది."

నిర్ణయ మాట్లాడలేకపోయింది.

ఒక వయసులో వున్న అమ్మాయి మాత్రమే అయితే అతడితో యింకా బలంగా ఆర్గ్యూ చేసేది.

కాని ఆమె పెళ్ళయిన స్త్రీ.

కాబట్టి తనకు కొన్ని పరిధులున్నాయన్నట్టు ఆగిపోయింది.

అసలు శ్యాం యిక్కడ సమర్ధిస్తున్నది ఫ్రీ సెక్సా లేక పెళ్ళయిన ఆడదయినా స్వేచ్ఛగా తిరగాల్సిన హక్కు గురించా అన్నది అర్థం కావడం లేదు.

"మన చర్చ మూలంగా నాకు అర్థమైందొక్కటే నిర్ణయా.... ఈ దేశంలో ఆడపిల్లలు పుట్టి పెరిగింది ఏ స్థాయిలో అయినా యిలాగే ఆలోచిస్తారని...."

మొత్తం స్త్రీ జాతిమీద సానుభూతి పెల్లుబికి పోతున్నట్టు బాధని అభినయించాడు రాధేశ్యాం. "అసలు స్త్రీ పురుషుడిలా ఎందుకు వుండలేక పోతోంది అన్న విషయంపై సైన్సు యిప్పటికే పరిశోధించడంగాని మెదడు నిర్మాణంలో వున్న తేడాల గురించి విశ్లేషించడం గాని ఆ తేడా మూలంగానే మేథమెటిక్స్ స్పేస్ టెక్నాలజీల్లో పురుషుడు స్త్రీకన్నా అమితంగా దూసుకుపోగలుగుతున్నాడనిగాని చెప్పడం చూస్తుంటే అసలు తేడా అదొక్కటే కాదని నా అభిప్రాయం."

క్షణం ఆగి అన్నాడు "స్త్రీ మనసు....ఏ సైన్సూ చెప్పలేనిదీ తరచి చూడలేనిది స్త్రీ మనస్సు గురించే నిర్ణయా........అందుకే మగాడు మెదడుతో స్త్రీ మనసుతో ఆలోచిస్తుందంటారంటా....అలా ఆలోచించినంత కాలం ఈ దేశంలో స్త్రీకి నిష్కృతి వుండదేమో."

పైకి లేచాడు రాధేశ్యాం.

ఇప్పుడు అతడికి చాలా ఉత్సాహంగా వుంది.

నిర్ణయ మౌనంతోనే బోధపడిపోయిందతడికి.

ఇంతకాలం ఏ ఆలోచనలతో ఆమెను కదిలించాలనుకున్నాడో అవి సందర్భోచితంగా చెప్పేసినందుకు చాలా సంతృప్తిగా వుంది.

అరుదైన మెచ్యూరిటీ తనకందదని అపోహపడే యువతిగా నిర్ణయ గురించి పూర్వమే స్టడీ చేసిన శ్యామ్ కోరింది యిలాంటి సన్నివేశాల్నే.

ఆధునిక భావాలుగల మధ్య తరగతి అమ్మాయి ప్రేమలో తేనెపట్టు లాంటిది. తనకన్నా తక్కువ వాడ్ని పెళ్ళిచేసుకుని దాంపత్య జీవితంలో అడుగుపెడితే తేనె తరిగిపోతుంది. అలాంటి సమయంలో అసంతృప్తివి రెచ్చగొట్టే ఒక్కోరాయీ యిలా విసురుకుంటూ పోతే చాలు పంకెళ్ళ తేనెటీగలు స్థానభ్రంశం చెంది సులభంగా దగ్గర చేరే అవకాశాన్ని యిస్తాయి.

"ఓకే నిర్ణయా....ఇప్పటి మన చర్చలో మిమ్మల్ని బాధ పెట్టివుంటే క్షమించండి. ఇంతసేపూ నేను మాట్లాడింది నా అభిప్రాయాలు కావు.... చాలా అనుభవజ్ఞులు చెప్పిన విషయాలు."

తను రుద్దాలనుకున్న ఆలోచనలకి యింకా పటిష్టమైన రూపాన్ని అందించి చివరగా అన్నాడు. "మీరు నన్ను కోపగించుకున్నా మీరంటే చాలా యిష్టపడే ఓ స్నేహితుడిగా నన్ను అర్ధం చేసుకోండి చాలు.... అన్నట్టు ఎగ్జిబిషన్‌లో షాపుకి కొన్ని లేటెస్ట్ పాప్‌కాలన్స్ కేసెట్స్ వచ్చాయని తెలిసింది. జార్జిమైకేల్ తెలుసుగా. ఈ సంవత్సరం గ్రామీ అవార్డు వచ్చింది. మెలోడియస్ సాంగ్స్ వున్న ఆల్బం అది....వస్తానంటే అదీ మీకు అభ్యంతరం లేదంటే సాయంకాలం వెళదాం."

ఆమెకోసం చాలా చాలా ఆలోచిస్తున్న వ్యక్తి అందమైన వాక్యాల్ని ప్రయోగించి వెళ్ళిపోయాడు.

నిర్ణయ నిర్లిప్తంగా చూస్తూ వుండిపోయింది. 

ఆ క్షణంలో ఆమె ఆలోచిస్తున్నది కేసెట్స్ గురించి కాదు....

"ఉదాహరణకి....నేను మీకు....మనసిచ్చాను ...మన ప్రేమ పరాకాష్ఠకి చేరేది....మనమధ్య శారీరక సంబంధంతో...."

శ్యాం అన్న మాటలు పదేపదే మనసు గోడలపై ప్రతిధ్వనిస్తుంటే ఎందుకు ఆమెకు తప్పుగా అనిపించలేదు.

అదే ఆమె దురదృష్టం కూడా....

చాలా సంఘటనలకి మూలం కాగలిగేవి ఇలాంటి చర్చలే అన్న చరిత్ర చెప్పిన సత్యం ఆమెకు తెలీదు.

తెలిసివుంటే పరిచయాల మాటెలా వున్నా మనసు ప్రేరణ్ణి అరికట్టేదేమో....

ఆ సాయంకాలం ఇవే ఆలోచనలతో యింటికి వచ్చింది నిర్ణయ. ఒకవేళ సమయానికి శ్రీహర్ష యింటి దగ్గరే వుంటే మనసులో రూపుదిద్దుకుంటున్న చాలా సందిగ్ధాలకి జవాబు చెప్పుకునేది.

కాని శ్రీహర్ష రాలేదు....

ఎందుకు రాలేదో ఆమెకు తెలీదు.

తనకోసం భర్త ఫోన్ చేశాడని తెలీని నిర్ణయ మరికాస్త సహనం పాటించివుంటే చాలా సమస్యలు ఉత్పన్నం కాకుండా జాగ్రత్త పడేదేమో కాని....

మధ్యతరగతి యిల్లు....తన స్థితిని పదేపదే గుర్తుచేసే పరిసరాలు.... కోరని ఒంటరితనం....శ్యాం మాటల్లోని విశ్లేషణ........నిస్సహాయతపై పగ తీర్చుకోవాలనే తొందరపాటు....ఆమెను ఎంతగా రెచ్చగొట్టుతూ అంటే........సాయంకాలం ఆరున్నర దాకా యింటి దగ్గర భర్తకోసం వెయిట్ చేసిన నిర్ణయ ఆ తర్వాత యిక నిభాయించుకోలేకపోయింది.

శ్రీహర్ష లేకపోతేనేం....

తను వెళ్ళగలదుగా....

అలా అనుకుని నిర్ణయ ఒంటరిగా వెళ్ళలేదు.

శ్యాం గురించి ఆలోచించింది.

ఆ క్షణంలో ఒక స్నేహితుడిగానే అనిపించడంతో అతడికి ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుంచి ఫోన్ చేసింది.

వ్యాపారం కోసం ఈ దేశంలో అడుగుపెట్టిన ఈస్టిండియా కంపెనీ ఆ తర్వాత ఎన్నెన్ని వ్యవహారాలకి కారణమైందీ ఎప్పుడో ఆమె చదువుకున్నా యించుమించు అలాంటి ఆలోచనలే వున్న శ్యాం కంపెనీ పేరిట ఏమేం చేయగలడో ఆ క్షణంలో ఆలోచించలేకపోయింది.

సరిగ్గా పది నిమిషాలలో మారుతీలో వచ్చాడు శ్యాం.

కొనాల్సిన వాటికి డబ్బుని వాలెట్‌లో వుంచుకుని అతడితోపాటు ఎగ్జిబిషన్‌కి బయలుదేరింది.

కాదు....

నిర్ణయ గడప దాటింది.

*   *   *   *

"కష్టం....సుఖం రెండూ ఇంటికి రెండు తలుపుల్లాంటివి. ఒకటి మూసుకుంటే రెండోది తెరుచుకుంటుంది" వేలాదిమంది భక్తుల్ని చూస్తూ గంభీరంగా చెప్పుకుపోతున్నారు స్వామి సుందర చైతన్యానంద్.

"అసలు కష్టమంటే ఏమిటి....? మనం కోరుకున్నది మనకి దక్కక పోవడం. ఇదే కష్టమైన పదానికి ప్రాపంచికమైన నిర్వచనం....అసలు కోరుకోవడమే నేరం, కోరికలకి మూలమైన అవిష్వర్గాలని ఆశ్రయించడమే కష్టాలకి మూలమని తెలిస్తే సుఖాలకోసం యీ తాపత్రయం ఉండేది కాదేమో."

సూది నేలపడితే వినిపించేటంత నిశ్శబ్దం.

"సుఖం అంటే ఏమిటి....కళ్ళజోడు రంగును బట్టే ప్రపంచం రంగు దర్శన మిస్తుంది తప్ప ప్రపంచానికి రంగు లేదు. అంటే మన మనోస్థితిని బట్టి సుఖమూ అవగతమవుతుంది. ఆకలి మీద వున్నవాడికి గారెలు సుఖంలాంటి ఆహ్లాదాన్ని యిస్తాయి. అంటే సుఖానికి మూలం 'గారెలు'గా భావించలేం. కాబట్టే కడుపు నిండితే గారెలు చేదు. ఒకే వ్యక్తి ఒకరికి మిత్రుడైతే మరికొందరికి శత్రువు....బాల్యంలో ఆనందానిచ్చే వస్తువులు యవ్వనంలో నిస్సారంగా కనిపిస్తాయి. యవ్వనాన్ని తేజోవంతం చేసే వస్తువులు వృద్ధాప్యంలో హాస్యాస్పదంగా గోచరిస్తాయి. దీనికి కారణం మనసు. త్రాటిలో పామును చూపించే మనసు ఆ పాము గురించి భయపడే ఆందోళన్నిస్తుంది. మనసులోని కోరికలు ఈ అస్తవ్యస్తతకు మూలమైతే ఆ మనస్సును దాని ప్రవృత్తిని గ్రహించటం జ్ఞానం. సంతృప్తి మనస్కుడికి అంతా సచ్చిదానందమే. అసలు ఏ కోరికలు లేని స్థితే సత్యదర్శనం....దైవ సాక్షాత్కారానికి మూలం."

ప్రమీల ఏకాగ్రతగా వింటూంది.

ఆమెకు కొన్ని అడుగుల దూరంలో కూర్చున్న శ్రీహర్ష ఓ కొత్త ప్రపంచాన్ని చూడగల్గుతున్న తమకంలో పరిసరాలను మరిచిపోయాడు.....

అవి ప్రబోధనలు కావు.

అంతరంగ సప్తశిలా శాసనాక్షరాలు....

దృశ్య మార్గాన్ని వెలిగిస్తున్న దివ్య చైతన్య స్రవంతులు.

"ఒకనాడు శ్రీకృష్ణుని సమీపంలో కూర్చున్న సత్యభామ నిద్రపోతున్న విభుడి మొలని అలంకరించిన వేణువుని చూసింది. అసూయ పడుతూ అడిగింది. ఏమని....ముల్లోకాలకి పూజ్యుడైన నా భర్తని యింతగా ఎలా ఆకట్టుకోగలిగారూ అని....ప్రతిక్షణం అతడి పెదవులపై నర్తించే

అదృష్టాన్ని ఎలా పొందగలిగారూ అంది. మురళి నిర్మలంగా నవ్వింది. కేవలం వెదురుబొంగుని మాత్రమే అయిన నాలోకి చూడూ అంది. సత్య భామ మురళిలోకి చూసింది. ఏమీ లేదు. లోపల అంతా ఖాళీ....ఆమె విస్మ యం చెందుతుండగానే అంది మురళి. ఏ ఆలోచనలూ లేని మనసుతో వున్న భక్తులకే దేవుడు అందుబాటులో వుంటాడంటూ సత్యదర్శనం గావించింది."

క్షణం ఆగేరు స్వామీజీ....

"అంటే సుఖదుఃఖాలకి అతీతమైన ఆస్థితత్వం....అదే అద్వైతం ....సీత కథ తీసుకుందాం...."

గీతా యజ్ఞమైనా రామాయణంలోని సంఘటనల్ని ఉటంకిస్తూ చెప్పుకుపోయారాయన.

"భర్త సన్నిధే తనకు సుఖాన్నిచ్చే ఆలోచన గల సీత రాముడితో పాటు అరణ్యాలకు వెళ్ళిపోయింది. ప్రతిక్షణం భగవన్నామస్మరణే తన ధ్యేయంగా తన భర్త సన్నిధిలో ప్రశాంతంగా గడిపింది. ఎంతకాలం.... ఆమెలో ప్రలోభం అడుగిడనంతకాలం....ఎంత మహాసాధ్వి అయినా మనో వైకల్యంలో బంగారు లేడిని కోరింది. అంటే ప్రతిక్షణమూ భర్తని మాత్రమే తలచే సీతమ్మ ప్రాపంచికమైన వ్యామోహాన్ని ప్రకటించి భర్తని పంపింది. బంగారులేడి కోసం రాముడు వెళ్లాడు. దూరం నుంచి 'సీతా.... లక్ష్మణా' అన్న కేకలు వినిపించాయి. వెళ్ళింది తన భర్తని ఆ భర్త అవ తార పురుషుడైన రాముడని తెలిసి కూడా చిత్త చాంచల్యంతో అతడు ఆపదలో వున్నాడని భావించింది. ఆమెకు నచ్చచెప్పబోయిన లక్ష్మణుడ్ని అవమానించి భర్తకోసం అతడ్ని సాగనంపింది. అంటే సీత వివేకాన్ని కోల్పోయింది. బంగారు లేడి కోసం తపించడం భర్తని తనకి దూరంగా పంపడమైతే కాపలా వున్న లక్ష్మణుడ్ని పంపటం తనకి అంతకాలం రక్షణ నిచ్చే వివేకాన్ని కోల్పోవటం. అంతే....ఇంద్రియాల ప్రలోభాలకి లొంగిన సీత వశేంద్రియాల నిగ్రహం లేని దశకంఠుడికి అవకాశమిచ్చింది.

అయోధ్యని విడిచిన సీతారాములు అరణ్యానికి రావడం భార్యా భర్తలు తల్లిదండ్రుల్ని విడిచి వేరు కాపరానికి రావడం లాంటిది. అలా వేరు కాపరానికి వచ్చిన భార్యా భర్తలు ఒకరికోసం మరొకరు బ్రతకాలే తప్ప వ్యామోహం వెంట పడితే ఒకరికి మరొకరు దూరమౌతారు. అదే రామాయణంలోని అరణ్యకాండ మనకి అందించే సందేశం."

సుఖాల కోసం అర్రులు చాచిన జంటలకి ఎన్ని పరిణామాలు ఎదురయ్యేదీ అన్న సత్యం మొదలుకొని గీతలోని గజేంద్రమోక్షం దాకా వివరించిన స్వామీజీ ఉపన్యాసం రాత్రి ఎనిమిది గంటలకి పూర్తయ్యింది....

వేలమంది భక్తుల మధ్యగా నడిచారు ప్రమీల, శ్రీహర్షలు.

తెలిసిన విషయాలకి కొత్త నిర్వచనాన్ని అందిస్తూ అసాధారణమైన జీవిత సత్యాల్ని ఎరుక పరిచిన స్వామీజీ ఉపదేశాలు చిత్రమైన వివశత్వానికి గురి చేస్తుంటే కారు దగ్గరికి రాగానే అంది ప్రమీల "థేంక్స్."

"దేనికి" సాలోచనగా అన్నాడు శ్రీహర్ష.

"మాట తప్పకుండా వచ్చినందుకు."

విస్మయంగా చూశాడు శ్రీహర్ష. "నాకూ ఇంట్రెస్టింగ్‌గా అనిపించింది."

"ఏమిటి? మాట నిలబెట్టుకోవడమా....లేక గీతా దర్శనమా....."

వెంటనే జవాబు చెప్పలేకపోయాడు.

"ఇప్పటికీ మొహమాటమేనా" నవ్వేసింది ప్రమీల.

"వెళదామా."

కారులో కూర్చున్నారిద్దరూ....

రోడ్డుపైకి వచ్చాక అడిగింది. "మీ యిల్లెక్కడ."

చెప్పాడు.

"ఇప్పుడు మీ ఇంటికి వెళుతున్నాం. మీ ఆవిడ్ని పరిచయం చేసుకోవాలని వుంది శ్రీహర్షా....నీకు అభ్యంతరం లేదుగా."

మరో రోజైతే బాగుణ్ణు అనుకుంటూ నెమ్మదిగా అన్నాడు శ్రీహర్ష. "అభ్యంతరం దేనికి."

"మీ ఆవిడకి నన్నెవరని పరిచయం చేస్తావ్" ప్రమీల గొంతులో సీరియస్‌నెస్‌కన్నా చిలిపితనమే ధ్వనించింది. "బహుశా ఒకప్పటి స్నేహితురాలని సరిపెడతావనుకుంటాను. అయినా మన మధ్య వున్నది కేవలం స్నేహమేగా."

ఆమె మాటల్ని వింటూ ఆ క్షణంలో శ్రీహర్ష ఆలోచిస్తున్నది నిర్ణయ గురించే.

నిర్ణయ ఎగ్జిబిషన్‌కి వెళదామంది.

తను సరేనని కూడా మళ్ళీ ప్రమీల కిచ్చిన మాట గుర్తుకొచ్చి ప్రోగ్రాం క్యాన్సిల్ చేస్తూ ఫేక్టరీకి ఫోన్ చేశాడు. నిర్ణయ సీటులో లేదనేసరికి తనను మళ్ళీ కాంటాక్ట్ చేయమని మెస్సేజ్ యిచ్చాడు.

నిర్ణయ ఫోన్ చేయలేదు.

కోపం వచ్చి వుంటుందా.

ఒకవేళ నిర్ణయ యిప్పుడు యింటిలో అదే మూడ్‌తో వుంటే....

ప్రమీలని ఎలా రిసీవ్ చేసుకుంటుంది.

అనాలోచితంగా ఏ మాటనైనా అనేయగల నిర్ణయ ఒకవేళ కోపాన్ని ప్రదర్శిస్తే....

అయినా తను ఎక్కువగా ఊహించుకుంటున్నాడేమో.

బహుశా నిర్ణయ మామూలుగా వుండి వుంటుంది.

కారులో వున్న శ్రీహర్ష యిలా ఆలోచిస్తున్న సమయానికి నిజానికి నిర్ణయ యింటిలో లేదు.

శ్యాంతోబాటు ఎగ్జిబిషన్‌లో నడుస్తూంది.

జాతరలా రద్దీగా వున్న జనం మధ్యగా చాలాసేపు నడిచేక ఓ ఎలక్ట్రానిక్ షాప్‌లోకి వెళ్ళి టేప్ రికార్డర్ కొంది.

శ్యాం డబ్బుల్ని చెల్లించబోతే వాదించింది.

శ్యాం నొచ్చుకున్నట్టు ఆమెకు అర్థమైనా ఎందుకో అంత డబ్బు అతడు చెల్లించటాన్ని అంగీకరించలేకపోయింది.

జైంట్‌వీల్ సమీపంలోని కేసెట్ షాప్ కెళ్ళిన తర్వాత ఓ పాతిక దాకా కేసెట్స్ కొన్నాడు శ్యాం.

అవన్నీ అతడికోసమేమో అనుకుంది కానీ శ్యాం చెప్పాడు "నన్ను మీరు పిలిచింది స్నేహితుడిగానే అయితే మనం స్నేహితులమే అయితే ఈ కేసెట్స్ మీరు కాదనకుండా తీసుకోవాలి."

ఆమె ఏదో నచ్చచెప్పబోయింది.

"కాదనకండి మేడమ్"

ఇలా అన్నది శ్యాం కాదు.

ఇందాకట్నుంచీ శ్యాం, నిర్ణయల్ని అనుసరిస్తున్న ఓ యువకుల బృందంలోని అబ్బాయి.

అతడి వెకిలి నవ్వు చాలా అసహ్యంగా వుంది.

"పైగా ఎంత ప్రేమగా యిస్తున్నాడో"

శ్యాం ఆవేశంగా అతడివేపు నడవబోతుంటే అసంకల్పితంగా అతడి చేయి పట్టుకుంది "వద్దు...."

ఎలక్ట్రిక్ షాక్కి గురైనట్టు చూశాడు శ్యాం.

తను పట్టుకున్నది పరాయి మగాడి చేతినన్న స్పృహలేదు నిర్ణయకి. కాని ఆమె స్పర్శతో నరాల్లో అదోలాంటి రాపిడి మొదలైపోయింది.....

"వెళదాం రండి" అంది అతడ్ని మరోపక్కి లాగుతూ

ఆమె పిడికిలి బిగింపు అతడి ఆలోచనలకి అందించే ఆహ్వానంలా అనిపిస్తుంటే అనుసరించాడు.

ఆ క్షణంలో ఇందాక ఆకతాయిగా ప్రవర్తించిన అబ్బాయిమీద అణువంత గౌరవం పెరిగిందంటే అది అతడి తప్పు కాదు.

ఇద్దరిమధ్య రవ్వంత సాన్నిహిత్యం పెంచటానికి కారణమయ్యాడు మరి.

"బాస్టర్డ్స్...." చాలా ఆవేశాన్ని ప్రదర్శించాడు శ్యాం. "పొట్టచింపితే అక్షరం ఉండదు. కాని అందమైన అమ్మాయిల్ని చూడగానే అల్లరి ప్రారంభిస్తారు"

'అందం' అనే పదాన్ని ఉపయోగించిన శ్యాం యుక్తిగా ఆమె ఆహాన్ని చల్లార్చే ప్రయత్నం చేశాడు.

ఆ గేంగ్ వెనుక రావడం గమనించింది నిర్ణయ.

అంతే....

"బుక్స్ కొందాం రండి" అంటూ ఓ బుక్ స్టాల్‌లోకి అడుగు పెట్టింది.

నిజానికి ఆమె బుక్స్ కొనాలనుకోలేదు. వెనుక అనుసరిస్తున్న గేంగ్ దృష్టినుంచి తప్పించుకోవాలనుకుంది.

ప్రతి సంఘటన్ని తన కనుకూలంగా అన్వయించుకోవటం కొందరి ప్రత్యేకత.

శ్యాం ఇక్కడా అవకాశం తీసుకున్నాడు.

ఓరకంట బయట నిలబడ్డ గేంగ్‌ని గమనిస్తూ రేక్స్‌లోని బుక్స్ చూస్తున్న నిర్ణయని చేరుకున్న శ్యాం ఓ బుక్‌ని అందిస్తూ "ఇదీ నా ప్రజంటేషన్‌గా మీరు స్వీకరించాలి. తప్పదు" అన్నాడు.

"థేంక్స్" అంది అది ఏ పుస్తకమో పరిశీలించకుండా.

బయటికి వచ్చింది అక్కడ గేంగ్ లేదని నిర్ణయించుకున్నాక.....

ఎందుకో పుస్తకం ముఖచిత్రం చూసిన నిర్ణయ ఉలిక్కిపడింది.....

దేవాలయంపై వుండే బూతు బొమ్మలు కనిపించాయి.

'వాత్సాయనా ది సెక్స్ థెరపిస్ట్'

పుస్తకం పేరది....

వాత్సాయనుడి కామసూత్రాల్ని ఆమె చదవలేదు. ఎప్పుడో వింది. అంతే....

ఆమె ముఖ కవళికల్ని గమనించిన శ్యాం వెంటనే అన్నాడు "మన లాంటి ఎడ్యుకేటెడ్ పీపుల్ వాత్సాయనుడు చెప్పిన సూత్రాల్ని సైన్స్‌గా అంగీకరిస్తే అలాంటి ఆధునికమైన భావాలు లేని వ్యక్తులు దీన్ని బూతు పుస్తకంగా భావిస్తారు."

ఏదో అనబోయిన నిర్ణయ గొంతు మూగబోయింది.

తప్పదు. తను ఆధునికమైన భావాలుగల అమ్మాయిగా అతడంగీక రించాలంటే నోరు మెదపకూడదు.

"అర్బుత్‌నాట్, రిచర్డు బోర్డన్‌లవంటి వ్యక్తులు మన వాత్సాయనుడి సంస్కృత కామసూత్రాల్ని ఇంగ్లీషులోకి అనువదించారూ అంటే ఇదెంత గొప్ప గ్రంథమో మనం ఆలోచించాలి నిర్ణయా....ఆహారం, నిద్ర సమస్త ప్రాణులకి ఎంత అవసరమో సెక్స్ కూడా మనిషికి చాలా అవసరమని మన ప్రాచీన శాస్త్రాలు చెప్పటం మాత్రమేగాక సెక్స్ అన్నది ఓ కళగా కూడా ఆరాధించమన్నారు. ఇది అశ్లీలత, అసభ్యత కానే కాదు. సృష్టికి మూల కారణమైన 'కామం' గురించి మనం తెలుసుకుంటే తప్ప వేదాలని, ఉపని షత్తుల్ని గౌరవించినట్టు కాదని మన శాస్త్రకారులు చెప్పిన విషయం...."

ఒక్కోమారు ప్రాచీనతని దుయ్యబడ్తే శ్యాం యిక్కడ హఠాత్తుగా వేదాల ప్రాముఖ్యత గురించి, శాస్త్రాల గొప్పతనం గురించి మాట్లాడుతుంటే అతడి అవకాశవాదాన్ని అంచనా వేయలేదు నిర్మల.

అతడి మేధస్సుకి అబ్బురపడిపోయింది.

"ప్రత్యేకించి ఈ గ్రంథాన్ని మీకివ్వడంలో నా ఉద్దేశ్యం పంచేంద్రియాలలో ఓ ఇంద్రియానికి పని కల్పించాలని .... అంటే ఈ కామ సూత్రాల్ని మీరు కళ్ళతో చదివి జీర్ణించుకుంటే మీ దాంపత్య జీవితంలో సెక్స్ అన్నది నేత్రపర్వంగా వుంటుంది. అన్నట్టు శ్రవణేంద్రియాలకీ ఇంపుగా ఉండాలని ఇందాక కేసెట్స్ కొని ప్రజెంట్ చేశాను. అంటే మీకు ఉండే అయిదు సెన్సెస్‌లో రెండింటికి నేనే పని కల్పించానన్నమాట....."

అసభ్యతని సభ్యతగా చెబుతున్నట్టనిపించి ఆమె నవ్వేసింది.....

ఓ విద్యుద్దీపం కాంతి ఆమె చెక్కిలిపై పరావర్తనం చెంది అదృశ్యము కావడం శ్యాంలో చాలా ఆవేశాన్ని కలిగించింది.

క్షణంపాటు ఆమె చూపులు అతడి చూపుల్తో కలిశాయి.

"ఏమిటి ?" రెప్పలార్చకుండా అన్నాడు "నేను అతిగా మాట్లాడుతున్నాననిపిస్తుందా ?"

"అబ్బే....అదేం లేదు"

"థేంక్స్"

"దేనికి?" అంది విస్తుపోతూ.

"భర్తతో మాత్రమే చర్చించాల్సిన విషయాలు నాతో మాట్లాడుతున్నందుకు."

"మీరే మాట్లాడుతున్నారు తప్ప నేనేం మాట్లాడ్డం లేదు"

"అంటే మొత్తం అవకాశం నా కిస్తున్నారన్నమాట"

ఇక్కడ 'అవకాశం' అన్న పదాన్ని చాలా ఒడుపుగా సంధించాడు. "ఆఫ్‌కోర్స్....అవకాశం అంటే మాటలవరకే అనుకోండి."

అతడి మాటలు కొంచెం ఇబ్బందిగా అనిపించాయి.

అయినా 'శ్యాం' మాట్లాడే పద్ధతే అంత అని సరిపెట్టుకుంది తప్ప అంతకన్నా ఎక్కువగా వూహించలేకపోయింది.

ఆ చర్చ అంతటితో ఆగిపోయింది.

మరో అయిదు నిమిషాలలో ఎగ్జిట్ ద్వారాన్ని చేరుకునేవారే....

కాని ఇంతలో మరో అనుకోని సంఘటన జరిగింది.

కాస్త జనం పలుచగా వున్న ఓ ప్రదేశంలో హఠాత్తుగా ప్రత్యక్షమైంది యిందాకటి బృందం. ఒక్క ఉదుటున నిర్దయని సమీపించింది.

ఆమెపై అఘాయిత్యం చేయాలని కాదు....

వట్టిగా టీజ్ చేయాలన్న ఆలోచన మాత్రమే....

ఆమె నడక వేగాన్ని తగ్గించబోతుండగా ఓ యువకుడు చేతిని అడ్డం వుంచాడు.

'బా....స్ట....ర్డ్' శ్యాం హుంకరింపుగా ఓ అడుగు ముందుకేశాడు.

క్షణంలో బృందమంతా శ్యాం మీద కలియబడేదే.

"హెల్ప్....హెల్ప్...."

గావుకేకలు పెట్టింది నిర్దయ.

అదే చాలామంది జనాన్ని ఆకర్షించింది.

కొందరు వ్యక్తులు అక్కడికి వచ్చారు నిర్దయ కేకలు విని.

పరిస్థితి అనుకూలంగా లేదనిపించిన యువకుల గేంగ్ చల్లగా జారుకునేదే.

ఇంతలో మఫ్టీలో వున్న పోలీసులు ప్రత్యక్షమయ్యారు.

గేంగ్‌నంతా అదుపులోకి తీసుకోవడంతోపాటు ఎగ్జిబిషన్ గ్రౌండ్‌లో వున్న సెక్యూరిటీ అవుట్‌పోస్ట్‌కి తరలించారు.

"మీరో స్టేట్‌మెంట్ యివ్వండి" అన్నాడు యస్సై శ్యాంని చూస్తూ.

నిర్ణయకిదంతా చికాగ్గా వుంది. "స్టేట్‌మెంటు దేనికి?"

"మీవారూ మీరూ నడుస్తుంటే యీ గేంగ్ అస్సాల్ట్‌కి ప్రయత్నించారని...."

షాక్ తిన్నట్టు చూసిన నిర్ణయ 'మీవారు' అని యస్సై వాడిన పదాన్ని కరెక్ట్ చేయబోతుంటే అర్థోక్తిగా అన్నాడు శ్యాం.

"ఓకె ఇన్స్‌పెక్టర్" స్టేట్‌మెంటు రాయడానికి సిద్ధపడ్డాడు శ్యాం చాలా కేజువల్‌గా.

అందులో తన ఫేక్టరీ అడ్రస్ యిచ్చాడు.

అయిదు నిమిషాలపాటు ఆ జుగుప్సాకరమైన వాతావరణంలో నిలబడ్డ నిర్ణయ ఆ తర్వాత శ్యాంతో పాటు బయటికి వచ్చింది మౌనంగా.

కారుని సమీపిస్తుండగా అన్నాడు శ్యాం "సారీ."

"దేనికి?" తల వంచుకునే అంది.

ఆమె ఏ విషయం అంత తీవ్రంగా ఆలోచిస్తున్నదీ అతడికి తెలుసు.... "మీరు నా భార్య అని ధ్వనించేట్టు అక్కడ నేను ప్రవర్తించినందుకు."

"మీరు నిజం చెప్పాల్సింది."

"అలా నిజం చెబితే మరో సమస్య మొదలవుతుంది."

"ఏమిటది?"

"మనం డీల్ చేస్తున్నది పోలీస్ డిపార్ట్‌మెంటుని నిర్ణయా....వట్టి స్నేహితులమే అంటే మనమధ్య స్నేహాన్ని అనుమానిస్తారు....ఎలాంటి

స్నేహితులు ఎన్నాళ్ళుగా స్నేహితులా అంటూ మనమధ్య యింకా లేని సంబంధాన్ని అంటగట్టి నానా రభసా చేస్తారు....అవొక్కటే కాదు.... మీపై అటాక్ చేయబోయిన ఆ స్త్రీంగుని వెంటనే క్షమించి వదిలి పెడతారు...."

ఆమె జవాబు చెప్పలేదు.

"అప్పటికలా మౌనాన్ని పాటించడం తప్పని సరైంది నిర్జయా.... అలా మిమ్మల్ని బాధపెడితే క్షమించండి."

ఎప్పటికి ఏ సంజాయిషీ యివ్వాలో బాగా తెలిసిన శ్యాం యిప్పటి క్షమార్పణలతోనూ ఆమెను అమితంగానే ఆకట్టుకున్నాడు.

ఒకవేళ మరోలా అతడు తన చర్యని సమర్థించుకుంటే రియాక్టయ్యేదేమో కాని చాలా తెలివిగా ప్రవర్తించాడు శ్యాం.

కారులో వెళుతున్నంత సేపూ మాట్లాడలేదు శ్యాం.

అతడి మౌనాన్ని మరోలా అర్థం చేసుకున్న నిర్జయ "బాధపడకండి" అంది అణువంత జాలితో.

తాత్కాలికంగా నవ్వేశాడు.

తనేదో బాధపడుతున్నానని ఆమె అపోహపడటం అతడికి చాలా ఆనందాన్నిస్తున్నా ఆ భావాల్ని మొహంలో కనపడనివ్వకుండా జాగ్రత్త పడ్డాడు.

కారు ఆమె యింటిముందు ఆగేక అన్నాడు సీరియస్‌గా "అదృష్టానికి దురదృష్టానికి మధ్యదూరం ఎంతో నాకు తెలీదు నిర్జయా....కాని ఒక ఊహ మాత్రంగానైనా నేను అదృష్టవంతుణ్నయిపోయాను."

ఆమెకు అతడు చెబుతున్నదేమిటో అర్థంకాలేదు.

"ఆధునికమైన భావాలు కల అమ్మాయిగా మీరు నా ఆలోచన్ని అపార్థం చేసుకోరని తెలుసు." సహజమైనధోరణిలో ఓ అస్త్రాన్ని సంధిం

వాడు "మీ గురించి నేను ఇష్టుబ వాటి ఆలోచించడం నేరమని తెలిసినా ఓ దురదృష్టంలో అదృష్టం క్షణం పాటైనా మీ భర్త స్థానంలో నేను నిల బడగలగడం...."

నిర్ణయకి ముచ్చెమటలు పోసినంత పనైంది.

"నేను మనసులో ఏదీ దాచుకోనని మీకు తెలుసు నిర్ణయా.... అందుకే మీరు యిది విని అసహ్యించుకున్నా నా భావాల్ని మాత్రం తెలియ చేశాను."

ఇంకా అతడక్కడే వుంటే ఆమె ఏం మాట్లాడేదో ఆ అవకాశం ఇవ్వనట్టుగా వాహని ముందుకు పోనిచ్చాడు.

నిర్ణయ చాలా సేపటి దాకా తేరుకోలేకపోయింది.

కాలేజీ రోజులు ఆమెకు గుర్తుకొచ్చాయి.

తనకోసం చాలామంది పెంపడ్డాడే వారు....తనతో పరిచయం కోసం ఎందరో యువకులు అంగలార్చుకు పోయేవారు.

అయినా తను ఎవరికీ ఆ అవకాశం ఇవ్వలేదు.

అయినా తనను అతడు కోరుకుంటున్నాడేమో తప్ప న్యాయం గురించి తనేం ఆలోచించడం లేదుగా.

ఇలా సరిపుచ్చుకోవటం ఆమెకు చాలా ఆనందాన్నిచ్చింది.

ఓ చిన్నబీజం సరిగ్గా ఇలా మొదలైన భావమో ఆ తర్వాత చాలా అనర్థాలకి కారణమవుతుందని తెలీని నిర్ణయ సాలోచనగా ఇంట్లో అడుగు పెడుతూ ఆగిపోయింది.

శ్రీహర్ష నిలబడి వున్నాడు ఎదురుగా.

తత్తరపడింది క్షణంపాటు.

అయినా మొండిగా అనుకుంది. తన గురించి పట్టించుకోని ఈ మనిషికి తనెందుకు సంజాయిషీ ఇవ్వాలి.

"నా స్నేహితురాలు....ప్రమీల....నేను ఇంజనీరింగ్ ప్రారంభంలో వీళ్ళయింట్లో అద్దెకుండేవాణ్ని" పరిచయం చేశాడు ప్రమీలని.

"నమస్తే" ప్రమీల విష్ చేసింది.

ప్రతి నమస్కారం చేసిన నిర్జయ ప్రమీలతో మాట్లాడకుండా గది లోకి వెళ్ళిపోయింది.

ఇబ్బందిగా కదిలాడు శ్రీహర్ష.

తను అనుకున్నంత పనైంది.

మాట తప్పినందుకు నిర్జయ కోపంతో తను ఎగ్జిబిషన్‌కి వెళ్ళి వచ్చింది. ఇప్పుడదే మూడ్‌లో వుందామె.

ఒకటి రెండు మూడు....అయిదు నిముషాలు గడిచినా నిర్జయ జాడ లేకపోవడంతో ప్రమీల కళ్ళలోకి చూడలేని శ్రీహర్ష నిర్జయ గది లోకి వెళ్ళాడు.

ఇంకా చీర మార్చుకుంటూ వుంటనుకున్నాడు కాని ఆమె నైటీలో కని పించింది. అంతేకాదు. టేప్‌రికార్డర్‌లో కేసెట్ వుంచి 'ఆన్' చేసింది. అతడి రాకని గమనించనట్టుగా.

"టేప్‌రికార్డర్ కొన్నావా" అది ప్రశ్న కాదు. యథాలాపంగా ఆమెను ప్రసన్నం చేసుకోవాలనే ఆరాటం "బాగుంది."

నిర్జయ మాట్లాడలేదు.

"కేసెట్స్ కూడా చాలా కొన్నట్టున్నావ్."

"మీకేమన్నా అభ్యంతరమా" అంది తక్కువ.

సీరియస్‌గా తీసుకోలేదు శ్రీహర్ష.

నవ్వేసాడు....కోపంలో నిర్దయ చర్చను రావాలని ఏ దారికి మళ్ళిం చేదీ అతడికి తెలిసిన విషయం కాదు.

"అభ్యంతరం దేనికి నిర్దయా....నీ సర్దాని నేను కాదనలేనుగా."

"ఓహో" సర్కాస్టిక్‌గా ఒత్తి పలికింది "అందుకే అన్నమాట.... కలిసి ఎగ్జిబిషన్‌కి వెళదామని చెప్పి మరేదో రాచకార్యాలున్నట్టు మరెక్కడికో వెళ్ళింది."

ఉలిక్కిపాటుగా చూశాడు బయటి గదివైపు.

ప్రమీలకి వినిపిస్తే అసహ్యంగా వుంటుంది.

పరిచయం చేశాక కూడా అపరిచితురాలిలా బయట గదిలో కూర్చున్న ప్రమీల బాధ పడుతుంది.

"నేను నీకు ఫోన్ చేశాను నిర్దయా....నువ్వు సీటులో లేవు."

అతడు చెప్పింది నిజమే అయినా ఆ నిజాన్ని అంగీకరించే స్థితిలో లేదామె.

"నిజం నిర్దయా...."

"చాలు....ఇంతకాలం మీరేం చేసినా చేయకపోయినా అబద్ధాలు చెప్పడం మాత్రం తెలీదని సంతృప్తి పడేదాన్ని. ఆ అభిప్రాయం కూడా చెరిపేయకండి" ఈసారి నిర్దయ గొంతుస్థాయి పెరిగింది.

కలవరపడుతూనే అన్నాడు "అర్థం చేసుకోవేం."

"మీరు చేసుకోని అర్థం నేనెందుకు చేసుకోవాలి మీకులేని కమిట్‌మెంటు నాకెందుకు వుండాలి."

"బయట నా స్నేహితురాలు వుంది."

"సో వాట్" ఆక్రోసుగా అడిగింది "నేనేం చేయాలి. మీకోసం నేను అక్కడికొచ్చి అభిమానాన్ని వర్షించేయాలా....సారీ....కుదరదు మీకోసం నేను అలా నటించను....నటించలేను."

"ఎందుకిలా ప్రవర్తిస్తున్నావు."

"ఆ ప్రశ్న మీకు మీరు వేసుకుంటే బెటరు."

ఆ తర్వాత నిర్ణయ రికార్డర్ వాల్యూమ్ పెంచింది. అతడి మాటలు వినే యిష్టం లేనట్టు అలాగే బెడ్‌పై వెల్లకిలా పడుకుంది.

నిస్సహాయంగా చూస్తూ వుండిపోయాడు.

పెళ్ళయిన తర్వాత బహుశా యిలాంటి సన్నివేశాన్ని ఎదుర్కోవడం తొలిసారి....

శంకర్ యింటిలో ప్రవర్తించిన తీరు ఇంకా గుర్తుంది. కాని అది వేరు.శంకర్ ప్రవర్తనతో ఆమె అలా రెచ్చిపోయిందని సమర్థించుకున్నాడు. కానీ యిక్కడ ప్రమీల ముందు- అందులోనూ చాలా ఏళ్ళ తర్వాత కలిసిన స్నేహితురాలు ముందు యిలాంటి స్థితిలో చిక్కుకుని నలిగిపోవడం అతడికి దుర్భరంగా వుంది.

ప్రమీలకి మొహం ఎలా చూపించాలి....

ఎన్ని క్షణాలు టెన్షన్‌గా గడిపాడో గుర్తులేదు. నెమ్మదిగా బయట గదిలోకి వచ్చాడు.

ప్రమీల కళ్ళలోకి సూటిగా చూడలేకపోయాడు.

"వెళతాను శ్రీహర్షా.... రాంగ్ టైంలో వచ్చినట్లున్నాను."

"అదికాదు" ఏదో చెప్పబోయాడు.

"ఎందుకలా సిగ్గు పడతావ్" మృదువుగా నవ్వేసింది. "వయసులో వున్న భార్యాభర్తల మధ్య ఇలాంటి గిల్లికజ్జాలు చాలా మామూలు హర్షా! మళ్ళీ కలుస్తానుగా! నువ్వు బుజ్జగించాల్సిన టైంలో మీ యిద్దరి మధ్యా నేనెందుకు."

ప్రమీల వెళ్ళిపోయింది కేజువల్‌గా తీసుకున్నట్టుగా.

కాని ఆమె నిజానికి చాలా సీరియస్‌గా తీసుకుంది.

తను ఓ మధ్యతరగతి నుంచి వచ్చిన అమ్మాయి అయినందుకేమో! కారులో మరో యువకుడితో ఎగ్జిబిషన్ నుంచి వచ్చిన నిర్ణయ యింటిలోకి రాగానే యిలా ఆవేశాన్ని ప్రదర్శించడాన్ని చాలా లోతుగా ఆలోచించింది.

నిర్ణయ అప్పటికి సహజమైన అశాంతిని కాదు ప్రదర్శిస్తున్నది.....

మరేదో వుంది....

'మాట' అనాలనే దూకుడుతనానికి 'మాట' పడనాడదనుకునే అహానికి మధ్య వ్యత్యాసం చాలా వుంది.

ఇందాక నిర్ణయ ప్రవర్తన దూకుడు కాదు....ముందెప్పుడో తెరుచుకున్న 'అహం' ద్వారంలో నుంచి మరేదో సందేహాలకి ఆహ్వానంలా వుంది....

అది నిర్ణయ తొందరపాటైతే పర్వాలేదు.

కోరిచేసే పొరపాటే అయితే చాలా త్వరలో సమస్యల్లో అడుగు పెడుతుంది.

* * * *

వెలుగు గనుల్ని ఆవేశంగా తవ్వుతున్నట్టు ప్రచండభానుడు తన ప్రతాపాన్ని చూపుతున్న మిట్టమధ్యాహ్నం వేళ....

నిర్ణయ అసహనంగా తన సీటులో నుంచి లేచింది.....

రాత్రి భోంచేయలేనందుకేమో చాలా ఆకలిగా వున్నట్టుంది.

ఉదయం నిద్ర లేచాక కూడా శ్రీహర్ష గురించి పట్టించుకోలేదామె.

ఇచ్చిన మాట నిలబెట్టుకోని శ్రీహర్ష రాత్రిగాని, పొద్దుటగాని సంజాయిషీ యివ్వాలని ప్రయత్నించకపోవడంతో మానసికంగా చాలా అలసిపోయింది.

అసలు రాత్రి సరిగా నిద్రపోలేదు....

తండ్రి, తమ్ముడు, చెల్లెలుతో పాటు చాలా ప్రశాంతంగా గడిచిపోయిన బాల్యము గుర్తుకొస్తుంటే తెల్లవార్లూ కలవర పడుతూనే వుంది....

ఫేక్టరీకి వచ్చాక కూడా ఉత్సాహంగా వుండలేకపోయిండి.....

శ్యాం రెండు మూడు సార్లు అఫీషియల్ వర్క్ గురించి మాట్లాడి వెళ్ళిపోయాడు.

ఎందుకో శ్యామ్ కూడా ముభావంగానే వున్నట్టు అర్థమైంది.

ఏమిటిదంతా....?

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో ఒంటరిగా కేంటీన్‌లో కూర్చుని ఆలోచించింది.

రాత్రి శ్యాం ఏమన్నాడు?

దురదృష్టంలో అదృష్టంలా క్షణం పాటైనా తన భర్త స్థానంలో నిలబడగలిగినందుకు సంతృప్తిగా వుందా?

ఇలా ఆలోచించడమేమిటి?

ఎంత నిర్మొహమాటంగా మాట్లాడగలిగే వ్యక్తి అయితే మాత్రం యిలాంటివి చెప్పటానికి సంకోచం అడ్డం రాదా?

ప్రస్తుతం ఆమె వున్న మానసిక స్థితిలో ఆమెకు కోపం రావడం లేదు.

ఊరటగా వుంది.

అంతకన్నా గర్వంగా వుంది.

తన కోసం ఓ చదువు అర్హతలు గల వ్యక్తి పరితపించిపోతున్నాడు.

ఇలాంటి భావం పాపభూయిష్టమైందో కాదో తెలుసుకోటానికి ఆమె వచ్చింది మామూలు కుటుంబం నుంచి కాదు..... హైక్లాస్ భావాలు గల కుటుంబం నుంచి....మధ్యతరగతి కన్న కాస్త ఎక్కువ స్థాయి నుంచి.

కాబట్టే కట్టుకున్న భర్తనైనా నిర్మొహమాటంగా నిలదీయగల్గుతూంది.

అతడి స్నేహితుడు ముందే అవసరమై అతడ్ని అవమానించి లేని షైనెస్‌ని ప్రదర్శించగలుగుతూంది.

అలా ప్రవర్తించడాన్ని షైనెస్‌మంటారా?

తప్పకుండా షైనెస్....

లేకపోతే శ్రీహర్ష ఎందుకంతగా తత్తరపడిపోయాడు.

సిగ్గుతో తలవంచుకున్నాడూ అంటే తన అనుచిత ప్రవర్తనకి మొహం చెల్లకేగా.

శ్రీహర్షలోని సాత్వికతని సిగ్గుగా, తనలోని అహాన్ని షైనెస్‌గా వర్గీకరిస్తూ సాయంకాలం దాకా గడిపిన నిర్జయ అప్పటికే శ్యాం తనకోసం పని గట్టుకు రాకపోవటాన్ని టాలరేట్ చేయలేకపోయింది.

మనసులో కోరుకుంటున్న 'సాన్నిహిత్యమ్'ని చల్లబరుచుకోవాలీ అంటే యిలాంటి సమయంలో శ్యాంలాంటి వ్యక్తి చాలా అవసరం....

సీటు దగ్గరికి వచ్చి ఏవో ఫోల్డర్ తీసుకుని వెళ్ళిపోతున్న శ్యాంని చూస్తూ అంది "ఎందుకు పారిపోతున్నారు?"

టక్కున ఆగిపోయ్యాడు.

నిర్జయ కొత్తగా కనిపిస్తూంది.

కాదు.... కొత్తగా కనిపించాలని ప్రయత్నిస్తున్నట్టుగా వుంది

"తప్పదు నిర్జయా...." నిర్జయ నిన్న రాత్రికే చాలా అర్థమైపోవ టంతో యిప్పుడే మొదలైన కొత్త అధ్యాయంలోని రెండో పుటని తెరుస్తు న్నట్టుగా అన్నాడు "మీ మనసు బాధ పెట్టానుగా. అందుకే మొహం చెల్ల డంలేదు."

"అలా ఎందుకనుకుంటున్నారు?"

ఇప్పుడిప్పుడే తెరుచుకుంటున్న ఆమె మస్తిష్కపు ద్వారంలోనుంచి చాలా దూరం చూశాడు మీ ప్రశ్నతో....

రేపటి అనుభవాల వేకువని ప్రసవిస్తున్న సూర్యతాపంలా వుందామె చూపు.... "నాకు తెలుసు నిర్ణయా.... నా మనసులోని భావాన్ని నిర్మొహమాటంగా చెప్పడంతో మీరు హర్టయ్యారని గ్రహించాను...."

"అందుకే వుదయం నుంచీ మొహం దాచేస్తున్నారా?"

జారిపోతున్న ఆమె వ్యక్తిత్వపు విలువలకి యిదో మచ్చుతునక....

"అంటే" విడియాన్ని నటించాడు శ్యాం "మీరు హర్ట్ కాలేదని నన్ను అనుకోమంటారా?"

పరోక్షంగా కోరుకుంటున్న గ్రీన్ సిగ్నల్ అది.

"లేదు శ్యాం.... నేను హర్ట్ కాలేదు"

"కాకపోతే రాత్రి మీ యింటి దాకా వచ్చిన నన్ను కనీసం యింటిలోకి ఎందుకు పిలవలేదు...."

ముందు తెల్లమొహం వేసింది. మరుక్షణం మామూలుగా నవ్వేసింది.

"రానిస్తే మరింత చనువు తీసుకుంటానన్న భయమేగా."

ప్రతి పదంలో ప్రతి వాక్యంలో ఆమెపై తనకున్న కోరికని వ్యక్తం చేయడమే ధ్యేయంగా పెట్టుకున్న శ్యాం ఆమెలో ఎంతటి సంచలనాన్ని రేపేడూ అంటే....

"ఛ ఛ!" నిర్ణయ అలజడిగా అంది "అదికాదు....నేనలా ఆలోచించలేదు."

ఇంతవరకూ ఆలోచించకపోయినా యికనుంచీ ఆలోచించేట్టు చేయడమే శ్యాం లక్ష్యం. అందులోనూ అనుకున్న గడువు సమీపిస్తూంది. స్నేహితుడు వికాస్ అదే విషయాన్ని పదే పదే గుర్తు చేస్తుంటే అవమానంగా వుంది శ్యాంకి.

"అదిగో...." ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అన్నాడు "అక్కడికి నేనేదో ఘోరమైన స్టేట్‌మెంటిచ్చినట్టు కంగారు పడిపోతున్నారు."

ఇంకా ఆందోళన రేపుతున్నాడేం....

"కొన్ని విషయాల్ని నిక్కచ్చిగా మాట్లాడ్డం నాకు అలవాటు నిర్జయా.... మీకు నా మీద అలాంటి అభిప్రాయం లేకపోవచ్చు.... కాని నాకుండటాన్ని మీరు అభ్యంతర పెట్టలేదుగా.... ఒకవేళ అది మీకు అభ్యంతరమనిపించినా నేను బయటికి వ్యక్తం చేసినప్పుడేగా.... అలా చేయకుండా నేను మనసులోనే మిమ్మల్ని ఆరాధిస్తే అది మీకు తెలిదుగా?"

ఇక అక్కడ కూర్చో లేనట్టుగా పైకి లేచింది.

ఎందుకో అతడి వేపు చూడలేక పోతూంది.

"ఒక పెళ్ళయిన స్త్రీనిలా ఆరాధించడాన్ని సంఘం ఆమోదించక పోవచ్చు.... ఇదంతా వింటుంటే మీకే జుగుప్సగా అనిపించొచ్చు. అంత మాత్రం చేత నేను మిమ్మల్ని మభ్యపెట్టలేను నన్ను నేను మభ్యపెట్టుకో లేను నిర్జయా.... ఒక్క మాటలో చెప్పాలీ అంటే మీమీద నాకు కోరిక లేదు. గుండె లోతుల దాకా పేరుకున్న గౌరవం అడోరేషన్.... వర్షిప్ వుంది."

ఎందుకు అతడి మాటల్ని ఖండించలేకపోతూంది.

మనసు లోతుల్లోకి యింత నిర్భయంగా చొచ్చుకుపోతున్నాడేం....

అసలు ఆ మాటలేమిటి యింతటి ఆహ్లాదాన్ని అందిస్తున్నాయి.

ఇక అతడిముందు నిలబడలేనట్టు హఠావుడిగా పక్క డిపార్ట్ మెంట్ వేపు నడిచింది.

నుదుట పేరుకున్న స్వేదాన్ని చీర చెరగుతో తుడుచుకుంటూ కారి డార్ లో నడుస్తుంటే ఎవరో పిలిచారు.

"నిర్జయా...."

టక్కున ఆగింది.

ఈశ్వరి నిలబడివుంది సమీపంలోని సైన్స్ డిపార్ట్ మెంట్ ద్వారం దగ్గర....

ప్రొడక్షన్ ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్ అయిన ఈశ్వరి నిర్ణయకి ప్రాణస్నేహితురాలు కాకపోయినా బాగా పరిచయస్తురాలు.

కొస్త చనువు తీసుకోగల యువతి....

"నీతో మాట్లాడాలి" ఇంచుమించు తన యీడు గలదే కావడంతో ఏకవచనంతో సంబోధిస్తుంది. "ఓసారి నా సీటు దగ్గరికి వస్తావా?"

వెళ్ళాలని లేదు.

వెళ్ళి ఏదో హస్కు వేసేంత స్థిమితంగా లేదు మనసు.

అయినా వెళ్ళింది.

అరనిమిషం సందిగ్ధంగా గడిచింది.

"నిన్న సాయంకాలం ఎగ్జిబిషన్‌కి వెళ్ళావా?"

నిర్విణ్ణురాలయింది నిర్ణయ. వెళ్ళడం తెలిసినందుక్కాదు. ఆ విషయం ప్రత్యేకించి అడుగుతుంటే నొసలు చిట్లించింది. "యస్ వెళ్ళాను"

"శ్యాంతో కలిసి వెళ్ళావా?"

"వెళితే...."

"ఏదన్నా గొడవయిందా?"

ముందు కొస్త ఇబ్బందిగా అనిపించినా అబద్ధం చెప్పాల్సిన అగత్యం కనిపించలేదు. "అవును...." చెప్పింది క్లుప్తంగా ఓ గేంగు వెంటపడటం మొదలుకొని పోలీసులు జోక్యం చేసుకోవడందాకా.

నిర్లిప్తంగా వుండిపోయింది ఈశ్వరి.

"అయినా ఎందుకలా అడిగావ్" నిర్ణయ ఉద్విగ్నతని దాచుకోలేకపోయింది.

"ఊరికనే."

"ఊరికనే అడుగుతున్నాను ఈశ్వరీ......" నిర్ణయ నిలదీస్తున్నట్టుగా అంది.

"మరేదో ఉండి వుంటుంది. అదేమిటో చెపితే సంతోషిస్తాను"

"నువ్వు చెప్పింది చాలా మామూలు సంఘటన నిర్ణయా. కానీ కొందరు అప్పుడే దానికి చాలా కలరింగ్ యిచ్చేశారు."

"అంటే" నిర్ణయ మొహం వివర్ణమైపోయింది.

నిర్ణయ యింత రియాక్టవడం ఈశ్వరికి నచ్చలేదు.

"వదిలెయ్ నిర్ణయా...వందమంది వందరకాలుగా అనుకుంటారు."

"అది వదిలేసే విషయం అయితే నువ్వు పనిగట్టుకుని ఎందుకు పిలిచావ్...అసలు జనందాకా ఎలా వచ్చింది విషయం......వాళ్ళంతా ఏమనుకుంటున్నారు?"

హైక్లాసులో పుట్టి పెరిగాననుకునే ఓ అమ్మాయి మధ్యతరగతి ఆడపిల్లలా ఆందోళన పడిపోతూంది. చెప్పక తప్పేట్టు లేదని బోధపడిపోయింది ఈశ్వరికి.

"ఓ గేంగు మీవెంట పడటం శ్యామ్ చేయి పట్టుకునేదాకా వెళ్ళటం పోలీసులు రావటం ఇవేమీ నేను వినలేదు నిర్ణయా....శ్యాంతోపాటు నువ్వు ఓ కార్నర్‌లోని చీకటిలో నిలబడి ఏదో చేస్తుంటే....చేయడమూ అంటే ముద్దుపెట్టుకోవడంలాంటిది అనుకుంటాను"

ఈ వాక్యాన్ని నెమ్మదిగా కూడగట్టుకుంటూ చెప్పింది ఈశ్వరి. "అలా వుండగా పోలీసులు పట్టుకుని పబ్లిక్ న్యూసెన్స్‌గా కేసు పెట్టారని మీరు భార్యాభర్తలమని చెప్పి తప్పించుకున్నారని...."

"స్టాపిట్" ఆర్తోక్తిగా అరిచింది నిర్ణయ.....ఆ కేక ఎంత దూరం వినిపించింది అంటే ఆ డిపార్టుమెంట్‌లోని డిజైనర్స్ అంతా నిర్ణయ వేపు చూశారు.

"అలా రాసిన ఆ ఇడియట్ ఎవడు.......ఇలాంటి స్కేండల్ సృష్టించటానికి వాడికెన్ని గుండెలు....జరిగింది ఒకటైతే మరోటి........" నిర్ణయకి కళ్ళనీళ్ళ పర్యంతమైపోతుంటే ఇందాకట్నుంచీ ఆమెనే గమనిస్తున్న నివాస్ వచ్చాడు ఆమె దగ్గరికి.

"మేడమ్" నిర్ణయపై అసాధారణమైన అభిమానాన్ని వర్షిస్తూ అన్నాడు. "ఎవరో ఏదో అనుకుంటే దానికి మీరంత రియాక్ట్ కావాలా.... అయినా యివన్నీ మీ వ్యక్తిగత విషయాలు....మీరెందుకు పట్టించుకోవాలి" అన్నాడు.

"యస్...." నివాస్ ఓదార్పు చాలా నచ్చిందామెకి. "నా యిష్టం... నేను నాకు తోచినట్టు బ్రతుకుతాను....ఎవరి ప్రమేయాన్నయినా నేనెందుకు పట్టించుకోవాలి?"

ఏ 'క్లాసు'లో బ్రతికే అమ్మాయికైనా యిలాంటి మాటలు ఎంత క్షోభని కలిగించేదీ అర్థమౌతుంటే ఆవేశంగా బయటికి నడిచింది.

ఈశ్వరి అనుసరించడాన్ని ఆమె గమనించలేదు.

"నిర్ణయా."

"యస్" వుక్రోషంగా ఆగి చూసింది అక్కడికి ఈశ్వరి అసూయతో ఇదంతా సృష్టించినంత క్రోధంతో. "చెప్పు."

"మనం వుంటున్నది మగవాళ్ళ లోకంలో"

"అంటే?"

"ఈ ఫేక్టరీలో మనలాంటి ఉద్యోగినుల సంఖ్య కేవలం రెండు. శాతం మాత్రమే"

"అయితే?"

"వంటకి పరిమితం కావల్సిన ఆడపిల్ల ఇంజనీరింగ్ చేసి ఆ ఆఫీ సరు స్థాయిలో ప్రతకడం చాలామందికి అసూయ కల్గించే విషయం. సో.... సహజంగా అవకాశం కోసం చూస్తుంటారు"

"ఏమిటా అవకాశం కోసం చూడటం?"

క్షణం సంశయిస్తూ నిలబడిన ఈశ్వరి అంది. "నువ్వు పెళ్ళయిన దానివి....శ్యాం బ్రహ్మచారి....పైగా...."

"చెప్పు" పంటి బిగువున కోపాన్ని ఆదిమిపెడుతూ అంది నిర్ణయ.

"శ్యాంకి అంత మంచి చరిత్ర లేదు"

"సో వాట్? అతనికి మంచి చరిత్ర లేకపోయినంత మాత్రాన అత నితో మాట్లాడే ప్రతి అమ్మాయి శ్యాంకి లొంగిపోతుందా?"

"అదికాదు నిర్ణయా" ఎలా నచ్చచెప్పాలో తెలీలేదు ఈశ్వరికి. "అలాంటి వాడికి కాస్త దూరంగా వుంటే బెటరుగా"

"అది నిర్ణయించుకోవాల్సింది నేను" ఖండితంగా అంది నిర్ణయ.

"ఎవరో ఏదో అనుకుంటే కుమిలిపోవటానికి నేను చదువు సంధ్య లేని ఆడపిల్లను కాను."

ఆ తర్వాత ఈశ్వరితో మాట్లాడటం ఇష్టం లేనట్టుగా తన ఆఫీసు రూమ్‌లోకి నడిచింది.

ఆ సమయంలో శ్యాం అక్కడే వుండటం నిర్ణయకి నచ్చలేదు.

సీటులో కూర్చున్న చాలా సేపటిదాకా ఆమె మామూలు స్థితికి రాలేక పోయింది.

"సారీ నిర్ణయా" అన్నాడు తలవంచుకునే. "నా మూలంగా మీరు అవమానాన్ని ఎదుర్కోవాల్సి రావడం నేను భరించలేకపోతున్నాను"

"ఐ కేరేపిన్ ఫరిట్"

నిర్వేదాన్ని నటించటం అతడికి కష్టం కాదు. "కానీ యీ విషయం ఫేక్టరీదాకా ఎలా వచ్చిందో నాకర్థం కావడంలేదు."

నిజం చెప్పలేదామె.

"అంటే?" సాలోచనగా అన్నాడు శ్యాం. "నన్ను ద్వేషించడమే పనిగా పెట్టుకున్న ఓ వర్గం ఇప్పుడు మనమీద బురద చల్లటానికి ప్రయత్నించింది.

"మనమెందుకు భయపడాలి శ్యాం!" నిర్జయ నేత్రాలు అరుణిమని పుంజుకున్నాయి. "అసలు మనమేమన్నా తప్పు చేస్తేగా?"

"తప్పు చేస్తే మాత్రం నిలదీయటానికి వాళ్ళెవరు?" ఉద్రేక పూరిత స్వరంతో అన్నాడు శ్యాం. "ఏది తప్పో ఏది ఒప్పో నిర్ణయించటానికి వాళ్ళకున్న పరిజ్ఞానం ఏమిటి....కలిసి తిరిగినంత మాత్రాన తిరుగుబోతులుగా ముద్రవేయటమేనా....డేమిట్....ఇంతటితో నేనూరుకోను నిర్జయా... దీనికి మూల కారణమైన వ్యక్తుల్ని పట్టి తోలువలిచే దాకా నిద్రపోను."

ఆవేశంగా గదిలో పచార్లు చేస్తున్నాడు శ్యాం. "ఇట్స్ అన్ బేరబుల్ నిర్జయా....ఒకేచోట కలిసి పని చేసే మనమధ్య యిలాంటి అపవాదు వస్తే మనం ఒకరి మొహాలు మరొకరం ఎలా చూసుకోగలమని....రేపు యిలాగే యిక్కడ కూర్చుని మనం సీరియస్‌గా ఫేక్టరీకి సంబంధించిన విషయం చర్చించుకుంటుంటాం....రేపు ఫేక్టరీ పనిమీద సర్వీసింగ్‌కి టూర్ వెళ్తాం....అయితే మనమధ్య అక్రమ సంబంధం వుందని తేల్చేయడమేనా. ఇలాంటి స్థితిలో వీళ్ళనుంచి ఎలా కాపాడుకోగలం....ఇప్పుడేం చేయాలి?"

"ఒక్కటే...." టక్కున అంది నిర్జయ సాలోచనగా. "ఏడ్చే వాళ్ళని మరింత ఏడిపించటం....యస్....అదే నాకు చాలా యిష్టమైన మెథడనిపిస్తూంది శ్యాం...."

తల్లిదండ్రులైనా వద్దన్నది చేయడం బాల్యంనుంచీ ఆమెకెంతగా అలవడిన విషయమో స్ఫురణకి తెచ్చుకుంటూ అంది.

తెలివిగా తను వేసిన పథకంలో చిక్కుకుని నలిగిపోతున్న నిర్ణయని చూశాడు. నివాస్ ద్వారా తను సృష్టించిన స్కేండల్‌తో మొండిగా తప్పటడుగు వేయటానికి సంకల్పిస్తున్న నిర్ణయ ముఖ కవళికల్ని గమనిస్తూ అన్నాడు శ్యాం. "మీరు అలా సహకరిస్తే మనపై బురద చల్లటానికి ప్రయత్నిస్తున్న ఆ వ్యక్తిని సులభంగా గుర్తు పడతాను మిసెస్ నిర్ణయా ఆ తర్వాత మా ఫేక్టరీ మేనేజింగ్ డైరెక్టరుకి కాబోయే అల్లుడిగా డిసిప్లినరీ ఏక్షన్‌తో వాడికి ఉద్వాసన చెప్పిస్తాను. కొన్ని రోజులు జస్ట్ ఫ్యా చేస్.... మీరు యిందాక అన్నారే అలా సహకరించండి."

ఆ వ్యక్తెవరో శిక్షింపబడాలని నిర్ణయ కోరుకుంటూంది బలంగా.

"ఆ తర్వాత మీరు మీకు తోచినట్టు బ్రతికినా నాకు అభ్యంతరం లేదు నిర్ణయా....కొంతకాలంపాటు నాతో కలుపుగోలుగా వుండండి.... మీకు యిష్టం లేకపోయినా అవతలివాడ్ని దెబ్బగొట్టడమే ధ్యేయంగా నాతో మిక్సకండి."

తను కోరుకున్న టార్గెట్‌ని సాధించాలీ అంటే యిది అవకాశంగా దూసుకుపోవాలి. అదే శ్యాం ఆ క్షణంలో ఆలోచిస్తున్నది.

ప్రపంచం కాలుష్యం గురించి అంతగా తెలీని నిర్ణయ అనుభవ రాహిత్యంతో తప్పుదోవకి నెట్టబడుతున్నా తెలుసుకోలేకపోయింది.

కోరిన ప్రేమని పెళ్ళిగా మార్చుకున్నా అక్కడ వెలితికి ఏది కారణమో గ్రహించలేకపోయిన నిర్ణయ ఎంత చదువుకున్నా మంటల మధ్య చిక్కుకున్న మేధాగ్రంథాలయమై పోయింది.

ఎవరిమీద కోపమో ఎవర్ని సాధించాలనుకుంటూందో ఖచ్చితంగా ఆమెకు తెలియకపోయినా శ్యాం పథకానికి సహకరిస్తానని మాటిచ్చింది.

మాయలేడికోసం వెళ్ళిన రాముడి గొంతులాంటి ఆర్తనాదం విన్న సీత బలవంతంగా లక్ష్మణుడ్ని పంపింది వివేకాన్ని కోల్పోవడంతో.

అదే సీతపై దశకంఠుడి గెలుపుకి కారణం అయితే యిదిగో యిక్కడ ఓ నిర్ణయ తనూ వివేకాన్ని కోల్పోయి శ్యాం అనే ఓ మగ వాడికి తిరుగులేని అవకాశం యిచ్చింది.

* * * *

"ఏమిటి? అలా వున్నావ్"

అడిగింది ప్రమీల శ్రీహర్షని తదేకంగా చూస్తూ.

ఆఫీసునుంచి శ్రీహర్ష యింటికి వెళ్ళలేదు....సరాసరి ప్రమీల దగ్గ రికి వచ్చాడు.

అసలు పొద్దున్నే రావాలనుకున్నా రాలేకపోవటానికి కారణం ఆఫీసులో పని ఎక్కువైనాదు....మొహం చెల్లక.

రాత్రి జరిగిన సంఘటన అతడ్ని ఎంతగా కలచి వేసిందీ అంటే ప్రమీలకి సంజాయిషీ యిచ్చుకునే దాకా స్థిమితంగా వుండలేదనిపించింది.

"ఒంట్లో బాగోలేదా" అడిగింది మళ్ళీ.

అభ్యంగన స్నానం చేసిన ప్రమీల కురులు కిటికీ దాటి వస్తున్న గాలి అలలకి అందంగా నర్తిస్తూంటే రెప్పలార్పకుండా చూశాడు శ్రీహర్ష.

నవ్వింది సుతారంగా....

రచయిత పదాలను వెతుక్కుంటున్నట్టు వయసు చెల్లినవాడు పారేసుకున్న బాల్యం కోసం శోధిస్తున్నట్టు కనిపిస్తున్నాడు.

"బహుశా రాత్రి జరిగిందానికి నువ్వు చాలా కలవరపడుతున్నావను కుంటాను హర్షా....ఏమంత పెద్ద విషయమని....చిరు కోపాలూ, చిలిపి అలకలూ దాంపత్యంలో మామూలేగా."

వినకోసం కాదని ఆమెకు అనిపిస్తున్నా అలానే ఓదార్చాలనుకుంది. అంతకుమించి అంతగా పరిచయంలేని దాంపత్య జీవిత పుటల్ని చదవాలను కోవటం సభ్యత కాదు.

ఏవో చెప్పాలనుకుంటూనే అప్రయత్నంగా కలిసిపోతున్నాడు శ్రీహర్ష.

ఓ చిన్న వృత్తంలాంటి ప్రపంచంలో చాలా ఇరుకుగా బ్రతికిన మనిషి అతడు. తన ఆలోచనల్ని తనకే పరిమితం చేసుకుని బ్రతుకుతున్న వేళ ముందు ఆలోచనల్నీ తర్వాత అతడ్ని పంచుకోవటానికి అంత దగ్గరగా వచ్చింది కేవలం నిర్ణయ మాత్రమే.

ఇంకా ఎందరున్నా అందరినీ దూరంనుంచే దర్శించటం అలవాటుగా మార్చుకోబట్టే నిర్ణయకి దగ్గరైనంతగా మరెవరికీ అందకుండా మిగిలి పోయాడు.

ఇంతకాలానికి ప్రమీల కలిసినందుకన్నా ఆమె ఆత్మీయురాలిలా పరామర్శించటం చాలా ఆనందంగా వుంది....కాబట్టే తొలి రోజునుండే ఆమె సమక్షంలో అలవాటైన ఆత్మన్యూనత నుంచి బయటికి వచ్చి మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు.

"నిర్ణయ స్వతహాగా చాలా మంచి అమ్మాయి" ప్రసక్తి ఎక్కడ ప్రారంభించాలో తెలీనట్టుగా అన్నాడు. "కాని యిప్పుడిప్పుడు నాతో యిబ్బంది పడుతున్నట్టుగా అనిపిస్తోంది ప్రమీలా....ఎందుకో తెలీదు....కాని ఈ మధ్య చాలా అసహనంగా వుంటూంది."

"ఈ మధ్యంటే...." సాలోచనగా అంది ప్రమీల.

"అసలు మీకు పెళ్ళయింది ఆరునెలల క్రితమేగా."

"మొదటి నెల దాకా బాగానే వుంది. ఆ తర్వాతనుంచీ చాలా అసహానానికి గురైపోతూంది."

"ఎందుకో తెలుసుకోవాలని ప్రయత్నించావా."

"అవకాశం యిస్తేగా."

"చూడు హర్షా...." భావరహితంగా అడిగింది ప్రమీల. "నిర్జయకీ నీకూ మధ్య పరిచయం పెరిగిన తొలిరోజుల్లో నన్ను ప్రేమించావా అంటూ ఎప్పుడైనా అడిగిందా?"

"లేదు"

"మరి ఆమె నిన్ను యిష్టపడుతున్నట్టు ఎలా తెలిసింది."

జవాబు చెప్పలేకపోయాడు.

"బహుశా నీకు అది ప్రేమగా అనిపించి వుంటుంది. అనిపించటంతో నువ్వు ఆమెకు దగ్గరయ్యావు."

"అవును."

"ఎందుకు దగ్గరయ్యావు."

మళ్ళీ సందిగ్ధంగా చూశాడు.

"నువ్వు ప్రేమించావు కాబట్టి" క్షణం ఆగి అంది. "అవునూ అని నువ్వు అననక్కర్లేదు హర్షా....అన్ని ప్రేమ కథల్లో జరిగేదీ అదే కాబట్టి నీ విషయంలోనూ అంతే జరిగి వుండాలి. అంటే .... నువ్వు ఆమెను ప్రేమించావు కాబట్టి ఆమె ప్రేమని అర్థం చేసుకున్నావ్ .... ఆ యిష్టపడటాన్ని అవకాశంగా తీసుకుని అనక ఎన్నిసమస్యల తర్వాతైనా ఆమెకు భర్తవి కాగలిగావు. ఇక్కడ అవకాశం అని నేను ప్రయోగించిన పదం

'అవకాశవాదం'గా భావించకు. నేను మాత్రమే ప్రేమించడంతో నా ప్రేమ విఫలమైతే, ఇద్దరూ ప్రేమించుకున్నారు కాబట్టి మీ ప్రేమ సఫలమైంది. చెప్పొచ్చేదేమిటంటే అప్పుడు అవకాశంగా మార్చుకున్న నువ్వు ఇప్పుడు ఆమె మనసేమిటో తెలుసుకునే అవకాశం ఎందుకు తీసుకోలేకపోతున్నావ్. అప్పుడు నువ్వు అవకాశం తీసుకోవటానికి ప్రేరణగా మారిన ప్రేమ నీలో యిప్పుడు లేకనా?"

ఆమె విశ్లేషణకి తొట్రుపడుతూనే అన్నాడు.."ఎందుకు లేదు నిర్ణయని యిప్పటికీ నేను ప్రేమిస్తున్నాను."

"ప్రేమించడమే నిజమైతే ఆమె మనసులోని బాధని యింత దాకా ఎందుకు అర్థం చేసుకోలేకపోయావ్?"

ఉన్నట్టుండి పేరుకున్నది నిశ్శబ్దం....

తార్కికంగా ప్రమీల అన్నది నిజమే కావచ్చు. కాని అసలు మనసు విప్పి మాట్లాడం మానేసిన నిర్ణయ మనసులోని విషయాన్ని ఏం చెబుతుంది.

"శ్రీహర్షా" ఏ జ్ఞాపకాలు ఆమె కళ్ళముందు మెదిలాయో నెమ్మదిగా అంది ప్రమీల "ఒకనాడు నా ప్రేమను అపునంటే నువ్వు మామూలు మధ్య తరగతి ఆడపిల్ల భర్తగానే ఉండిపోయేవాడివి. కాని నిర్ణయ ఓ స్థాయికి చెందిన అమ్మాయి....నీకోసం చాలా సుఖాల్ని కాలదన్ని వచ్చిన ఆడపిల్ల. అంటే నీకన్నా ఆమె ప్రేమే గొప్పదని, నీ కోసం చాలా నష్టపోవడానికి సిద్ధపడ్డ ఆమె ప్రేమతో మానసికమైన రిచ్‌నెస్ నీకు అందించిందని ఎప్పుడైనా అనుకున్నావా?"

ఈ విశ్లేషణ సరిగా అర్థం కాలేదు. కాని నిర్ణయ ప్రేమలోని ఔన్నత్యాన్ని గుర్తు చేస్తుందని బోధపడింది.

“చాలా చాలా కావని వచ్చిన నిర్ణయకి సమర్పించాల్సింది చాలా ఎక్కువే శ్రీహర్ష.”

“కాని....” వెంటనే అన్నాడు “నేను మామూలు స్థితిని మించి ఆమెకేమీ ఇవ్వలేనివాణ్ని”

“నేనన్నది ఆర్థికంగా ఆమెకు అన్ని సుఖాల్నీ అందించాలని కాదు శ్రీహర్షా. ప్రేమలో ఉన్న ఫ్రెష్‌నెస్‌ని పెళ్ళి తర్వాత కూడా ఇవ్వగలగాలి. ఆదిలో నిన్ను మరిచిపోలేక నేనూ నా భర్తతో ఇష్టసఖి కాలేక పోతుండేదాన్ని....అయినా నా భర్త విసుగు చెందకుండా నన్ను తన మనిషిగా మార్చుకోగలిగాడు.”

“కాని మేం ప్రేమించి పెళ్ళి చేసుకున్న వాళ్ళం.”

“అంచేత మీ ప్రేమ ఎప్పుడూ ఫ్రెష్‌గా వుంటుందనుకోకు. పెళ్ళన్నది బ్రతికినంత కాలం ప్రేమించుకుంటూ వుండాలి అని తెలియచెప్పే కాంట్రాక్ట్ కాదు. ఓపెన్‌గా ప్రశ్నించుకుంటూ వుండటం, హానెస్ట్‌గా జవాబులు చెప్పుకోవడమూను.

“కాని మా మధ్య నిందతే తప్ప ప్రశ్నలేవి?”

“అంటే ప్రేమించుకున్నప్పుడు సాధ్యమైన కమ్యూనికేషన్ పెళ్ళితో మిస్సయిందనేగా” అనలైటికల్‌గా అంది ప్రమీల “మంచి దాంపత్యమంటే ఎదురైన ప్రతి సమస్యనీ కలసి చర్చించుకుంటూ కలిసి ఎదుర్కొనేది. నీకేం కావాలి అన్నది నువ్వు, ఆమెకేం కావాలి అన్నది ఆమె నిర్మొహమాటంగా చెప్పుకోగలిగితే తప్ప మీలో సాన్నిహిత్యం పెరగడంమాట అటుంచు, కొనసాగడమూ ఆగిపోతుంది. సమస్యని చెప్పుకోగానే సగం పరిష్కారమైపోతుంది....ప్రేమించుకున్న మీరు పెళ్ళికోసం చాలా మందిని

ఎదుర్కోగలిగారు. కాని మీరు దాని ఎదుర్కోలేకపోతున్నారు. అంటే పెళ్ళితో అనుకున్నది జరగలేదన్న ఫీలింగ్ కావచ్చు. ప్రేమనుంచి పెళ్ళి దాకా వెళ్ళి విఫలమవుతున్న చాలా దాంపత్యాలకి కారణం యిదే శ్రీహర్షా....పెళ్ళన్నది ఒక జంటజీవితాల్లో మొదటి పేరా మాత్రమే. కాని దంపతులుగా జీవించటం ఎంత చదువుతున్నా యింకా మిగిలిపోయేది...."

నిశ్శబ్దంగా వింటున్నాడు.

"ఏ దాంపత్యంలో అయినా సమస్యలు మొదలైతే అందులో ఎక్కువ కారణం భర్తే అంటాన్నేను. ఇలా అనటానికి ఉదాహరణ నా జీవితమే శ్రీహర్షా .... ఒకవేళ నా దాంపత్య జీవితపు తొలిరోజుల్లో మావారు సహనాన్ని పాటించి స్పందించకపోతే, నన్ను ప్రసన్నం చేసుకోవడం ధ్యేయంగా పెట్టుకుని అంత శ్రమపడి ఉండకపోతే నేను మారేదాన్ని కాదు....వయసులో, అనుభవంలో, ఆలోచనల్లో నాకంటే ఉన్నతుడైన వ్యక్తి కాబట్టి తన మెచ్యూరిటీతో నన్ను తన మనిషిగా తీర్చిదిద్దుకోగలిగారు. మరి అదే మెచ్యూరిటీ మీ నుంచి నేను ఎక్స్పెక్ట్ చేయటం నేరం కాదుగా?"

"నీకు అర్థం కాదు ప్రమీలా!" ఇంతదాకా వచ్చేక మరికొంత నిజం చెప్పడం తప్పు కాదనిపించిందేమో ఏదో గుర్తు చేసుకుంటున్నట్టుగా అన్నాడు "అసలు నా ఉనికినే హర్షించనట్టు ప్రవర్తించే నిర్లక్ష్యాన్ని నేనెలా మార్చుకోను."

"చిన్న పిల్లాడిలా మాట్లాడకు" అనేసింది కాని ప్రమీలకి తెలుసు శ్రీహర్ష బాల్యం నుంచీ ఎలాంటి స్థితిలో పెరిగిందీ....చాలా మంది పరిసరాలనుంచి నేర్చుకోగలిగే విషయాలు శ్రీహర్షకి అందుబాటులో లేనివి, అర్థం కానివి. కాబట్టే మరింత స్పష్టంగా చెప్పడం అవసరమేమో.

"అవును శ్రీహర్షా నువ్వలామాట్లాడ్డం ఎద్బెట్టుగా వుంటుందని నేనన డానికి కారణం మీది పెద్దలు చేసిన పెళ్ళి కాదుగా? అరేంజ్డ్ మేరేజ్‌లు అయితే పెళ్ళి దాకా ఒకరి గురించి మరొకరు తెలుసుకునే అవకాశం లేదు. కాని మీరు ముందే ప్రేమించుకున్న వాళ్ళుగా. అలాంటప్పుడు నిర్ణయి యిష్టా యిష్టాలు ఆలోచనలు అన్నీ నీకు ముందే తెలిసి వుండాలిగా వాటి అలం బనగా ఆమెకు దగ్గర కావటం మనను తెలుసుకోవటం నీకు కష్టం కాదుగా?"

ప్రమీల చెప్పింది యదార్థం కావచ్చు.

అలా దగ్గర కావాలని ప్రయత్నించకపోవడమూ నిజమే. వయసులో అనుభవంలో మెచ్యూరిటీ తనకే ఎక్కువ అనుకోవటానికి అసలు పెళ్ళి దాకా వచ్చిందీ అంటే ఆమెకున్న మెచ్యూరిటీయే కారణంగా అనుకోవాలి. ఇప్పుడు ఆమేేం తెలీదు తను కొత్తగా చెప్పాలి.

"ఓ ప్రశ్నకి సమాధానం చెబుతావా శ్రీహర్షా?"

ఆలోచనల నుంచి తేరుకుంటూ చూశాడు.

"మనిషి జీవితంలో చాలా రకాల ప్రేమల్ని రుచి చూస్తాడు. ఉదా హరణకి తల్లి ప్రేమ, సోదర ప్రేమ, తండ్రి ప్రేమ, భార్య ప్రేమల్లాంటివి. అందులో దాంపత్యంలో ప్రేమే ప్రత్యేకమైనదిగా ఎందుకు గుర్తించబడి నదో తెలుసా?"

అర్థంకానట్టుగా చూశాడు.

"అన్ని ప్రేమల్లోనూ మనసు మాత్రమే ప్రాతిపదిక అయినా దంప తుల ప్రేమలో శరీరమూ భాగస్వామ్యం వహిస్తుంది. అవును శ్రీహర్ష.... ఎమోషన్స్‌ని శరీరంద్వారా సైతం పంచుకోగలిగేది దాంపత్యజీవితంలోనేగా. అలాంటి అవకాశంగల దంపతుల మధ్య యిష్టాన్ని చెప్పుకోటానికి సెక్స్ కూడా ఓ బలమైన సాధనం అయినప్పుడు ఏ మగాడైనా ఎందుకు వీలా సఫర్ కావాలి?"

'అర్టాఫ్ ఇంటిమసీ" గురించి ప్రమీల చెప్పిన వివరాల్ని విభ్రమంగా వింటున్నాడు.

"అలా అని సెక్స్ ఒక్కటే దంపతుల్ని కలిపి వుంచగలదని నేననటము లేదు శ్రీహర్ష....తక్కిన బంధాల్లో లేని అడిషినల్ ఛాన్సు మేరేజ్ అందిస్తుందని చెబుతున్నానంతే. నిజానికి భార్య స్థానంలో వున్న ఆడపిల్లకి ప్రేమతో అందించబడే సెక్స్ కన్నా తను ప్రేమించబడుతున్నాననే ఫీలింగ్ ఎక్కువ ఆనందాన్నిస్తుందంటుంది మోడరన్ సైకాలజీ. అలాంటిదేదో మిస్సయి నిర్దయ యిలా ప్రవర్తిస్తుందేమో ఎప్పుడైనా ఆలోచించావా?"

మాట్లాడలేకపోయాడు శ్రీహర్ష.

"అసురసంధ్యా సమయాన హిందూమహా సముద్రపు ఒడ్డున ఒకరి కళ్ళల్లోకి మరొకరు చూసుకుంటూ పరిసరాల్ని, ప్రపంచాన్ని మరిచిపోగలిగే ఓ ప్రేమికుల జంట భార్యాభర్తలుగా మారేక పరిసరాల్లోని విషాదాన్ని మూటగట్టుకోవాలనుకోటానికి ఒకరి కళ్ళల్లోకి మరొకరు చూసుకోలేనట్టు గిల్టీగా చూపులు మరల్చుకోటానికి కారణం ఏమై వుంటుంది?" భావుకత్వానికి తర్కాన్ని జోడిస్తూ చెప్పుకుపోతూందామె. "వెన్నెల స్నానాల్లా, వెండి మబ్బుల నీడన బాసల్లా, ఒకరినొకరు చూసుకోకుండా వుండలేని విరహ బాధలా పేరుకుంటున్న అవాంతరాలను అధిగమించి ఒకరికొకరు చేరువకావాలనే తపనా ....ఇవన్నిటికీ కాలదోషం పట్టించేది పెళ్ళి. ఆశ్చర్యపోకు....ప్రేమ తర్వాత పెళ్ళి నేరం అని నేనడంలేదు. కాని అలాంటి ఆకర్షణలూ, ఆనందాలూ పెళ్ళితో ముగింపుకొస్తాయి. అప్పుడప్పుడూ మాత్రం కలుసుకునే అవకాశమున్న ప్రేమికులిద్దరూ భార్యాభర్తలైతే ఎప్పుడూ కలిసి బ్రతికే అవకాశం ఏర్పడుతుంది. అద్భుతమైన థ్రిల్ చేజారిపోతుంది. ప్రతిక్షణమూ ఎదురెదురుగా వుండటంతో లోపాలే ఎక్కువగా కనిపిస్తుంటాయి."

క్షణం ఆగింది ప్రమీల.

"అంటే ప్రేమ పెళ్ళిళ్ళు విఫలం కావటానికి ఇలాంటివెన్నో కారణ మవుతుంటాయి. మరి వీటన్నిటినీ అధిగమించి ప్రేమించుకున్నప్పటిలా దాంపత్య జీవితంలోనూ ఆకర్షణతో బ్రతకాలీ అంటే ఏంచేయాలి....? అదే శ్రీహర్షా....అది ఆలోచించి ఆచరణలో పెట్టగలిగితే దాంపత్య జీవితం అద్భుతంగా వుంటుంది. ఒక్క మాటలో చెప్పాలీ అంటే పెళ్ళి తర్వాత మొదలయ్యే ప్రేమకన్నా ప్రేమతో పెళ్ళిదాకా వచ్చిన జీవితమే ఎక్కువ సమస్యాత్మకమైనది. అలా సమస్య కాకూడదూ అనుకుంటే చాలా శ్రమ పడాలి. అదీ శ్రమ కూడా కాదు....మనోజ్ఞమైన సాధన....అందులో ఇంకా పెళ్ళికాని ప్రేమికులమే అనిపించే విరహమూ ఉండాలి. ప్రేమించుకున్న నాటి ఆకర్షణతో కూడిన కమిట్ మెంట్సూ వుండాలి....ఒకరికోసం మరొకరు అనుక్షణమూ ఆలోచించే దూకుడూ కావాలి. ఒకరికొకరు నిర్మొహమాటంగా మాట్లాడుకునే మనసూ వుండాలి. ప్రతిరోజూ ప్రేమలో తొలిరోజు అని పించే శృంగారమూ కావాలి. అన్నింటికీమించి ఒకరినొకరు మనస్ఫూర్తిగా నమ్మగలిగే సహృదయత కావాలి. ఇవన్నీ వున్న ప్రేమ వివాహాలే జీవితాం తమూ ఆనందాన్నిచ్చేవి."

ప్రమీల మాటలు వింటూ ఆమెనే తదేకంగా చూస్తున్నాడు.

ఎప్పుడో ఒకనాడు బిడియంగా తనముందుకొచ్చి మనసులోని ఆలో చనల్ని సరిగా చెప్పలేక చాలా నెలలే తాత్సారంచేసిన ఓ అమ్మాయి ఇప్పుడు దాంపత్యంలోని అర్థంకాని చాలా పుటల్ని యిప్పటికే చదివినట్టు అర్థవంత ముగా చెబుతుంది.

రెప్పవార్చకుండా తననే చూస్తున్న శ్రీహర్షని గమనించగానే ఏమను కుందో వెంటనే రేక్ లోని ఓ బుక్ తీసుకొచ్చి శ్రీహర్ష కందించింది.

"ది ఆర్ట్ ఆఫ్ ఇంటిమసీ"

పెళ్ళి గురించి, శృంగారం గురించి ప్రపంచ ప్రసిద్ధులైన సైకో థెరపిస్ట్‌లు సెక్స్ అనలిస్టులూ రాసిన ఆర్టికల్స్‌తో నిండిన పుస్తక మది.

"ఇదీ కాదా మావారు కొని తెచ్చిందే శ్రీహర్షా" మృదువుగా నవ్వుతూ అంది. "నా మొండితనాన్ని ప్రేమతో, మూర్ఖత్వాన్ని మాటలతో కరెక్టుచేస్తూ అప్పుడప్పుడూ ఇలాంటి బుక్స్ కొనితెచ్చి చదవమనేవారు. నిజానికి ఎంత శ్రమ తీసుకునేవారో, ఎంతటి ఓర్పుతో నామీద శ్రద్ధ చూపించేవారో నువ్వూహించలేవు శ్రీహర్ష."

ఏ జ్ఞాపకాల తెరలు కలిగి కలతపెట్టాయో కళ్ళలో పేరుకుంటున్న నీళ్ళు కనిపించకుండా జాగ్రత్తపడుతూ ఆమె బయటికి చూస్తూంది.

"ప్రేమించబడటం ఓ వరం శ్రీహర్షా.... అందుకే ప్రాణాలంతగా అపురూపంగా కాపాడుకోవాల్సింది ప్రేమ కూడా" నిష్ఠూరంగా ఆగింది ఓ క్షణంపాటు." ఇంతసేపూ నీకు చెప్పింది నీకన్నా నాకేదో తెలుసనీ కాదు— మీ దాంపత్యం కూడని సమస్యల్లో కూరుకుపోతోందన్న కంగారుతోనూ కాదు. పోగొట్టుకున్న నా దాంపత్య జీవితం విలువేమిటో తెలిసినదాన్ని కాబట్టి అలా మీరు కోరి చేజేతులా విషాదాన్ని మూటగట్టుకోకూడదని.... అంతే."

"క్లాసుకి వెళదామా" అన్నాడు.

"వద్దు" అంది.

"ఏం?"

"నువ్వు ఇంటికి వెళ్ళు శ్రీహర్షా....అలిసిపోయి ఫేక్టరీనుంచి వచ్చిన భార్యకి కంపెనీ ఇవ్వడమూ నీ బాధ్యతే. నువ్వు అర్జెంటుగా చేయాల్సింది గీతా యజ్ఞం గురించి తెలుసుకోవడం కాదు....నువ్వు తప్ప మరెవరూ చేర్చ

అన్నట్టుగా బ్రతుకుతున్న నీ భార్య విషయంలో ఓ 'కన్సర్న్' చూపించ వేమి....ముందు ఆ కార్యక్రమంలో విజీకా...."

మారు మాట్లాడకుండా బయలుదేరాడు శ్రీహర్ష.

ప్రమీల మాటలకి ఎంత రియాక్టయినాగాని తెలీని చాలా సత్యాలు తెలుసుకున్న శ్రీహర్ష అంతా సవ్యంగా జరిగితే పాతబడిపోయిన ప్రేమలో కొత్త పుటల్ని తెరవాలనుకున్నాడు నిజాయితీగా.

కాని....

ఇంటిదగ్గర నిర్జయ లేదు.

సకాలంలో సాపుదిద్దుకోని ఆలోచనలు ఒక్కోమారు జీవితకాలపు దూరాన్ని అందించడమే నిజమైతే శ్రీహర్ష దాంపత్యమూ ఇంచుమించు అదే స్థాయికి వెళ్ళిపోయింది.

బాధాకరమైన అలాంటి ఓ మలుపుకి కారణంలా గదిలోని టేబుల్‌పై ఓ ఉత్తరం కనిపించింది.

"అర్జెంటుగా ఆఫీషియల్ టూర్‌పై బొంబే వెళుతున్నాను. ఓ రెండు రోజులపాటు అక్కడే వుండాలి. చెప్పాలని మీ ఆఫీసుకి వచ్చాను. మీరు లేరు.

— నిర్జయ"

క్లుప్తంగా రాసి వుంది.

ఇలా నిర్జయ టూర్‌కి వెళ్ళడం కొత్తకాదు ....రెండోసారిది.

అయితే ఇలా మాటమాత్రం చెప్పకుండా ఉత్తరం రాసివెళ్ళడం తొలిసారి.

అదీకూడా కాదు....

ఆమె రాసిన ఉత్తరంలో ఆత్మీయత లేమ యాంత్రికత తప్ప ....
అదే శ్రీహర్షని బాధపెట్టింది అణువంతైనా.

* * * *

అర్ధరాత్రి దాటుతున్నా నిర్ణయకి నిద్రపట్టలేదు.

చీకటిని చీల్చుకుంటూ ట్రైన్ సాగిపోతుంటే ఫస్ట్ క్లాస్ కూపేలో బెర్త్‌పై పడుకున్న నిర్ణయ తలతిప్పి చూసింది.

శ్యాం ప్రశాంతంగా నిద్రపోతున్నట్టనిపించింది.

పరాయి మగాడితో బాటు తను కలిసి ప్రయాణం చేస్తున్నానన్న ఆలోచన రాలేదామెకు.

భర్తపై ఇలా కసితీర్చుకున్నందుకు ఆనందంగా వుంది.

ఉదయం ఫేక్టరీలో ప్రచారమైన స్కేండల్ గురించి ఆమె ఆలోచిస్తుండగానే జాయింట్ జనరల్ మేనేజర్ హఠాత్తుగా ఛాంబర్‌లో అడుగు పెట్టాడు.

రెండు నెలల క్రితం బాందేలోని ఓ ప్రైవేటు ఇండస్ట్రీకి సప్లయ్ చేసిన మెషిన్‌కి సంబంధించిన సమస్య గురించి తెలియచెబుతూ ఆయన అందుకొన్న టెలెక్స్ మెస్సేజ్ చూపించి వెంటనే శ్యాంని బయలుదేరమన్నాడు. అవసరమైతే తోడుగా మరో ఎంప్లాయీని తీసుకు వెళ్ళమని చెప్పాడు.

సాధ్యమైనంత త్వరగా ఆ సమస్య పరిష్కరించకపోతే కేంద్రంలోని ఇండస్ట్రీస్ సెక్రెటరీకి కంప్లయింట్ చేయడమొక్కటే కాదు ఆ ప్రైవేట్ ఇండస్ట్రీ నుంచి ఇంకా రావాల్సిన పేమెంట్ ఆగిపోతుంది.

జాయింట్ జనరల్ మేనేజరు వెళ్ళిన అరగంటసేపటిదాకా ఆలోచనలో మునిగిపోయిన శ్యాం డిజైన్స్ డిపార్ట్‌మెంట్‌లోని నివాస్‌ని తోడుగా

దమ్మంటే నీ అసిస్టెంట్ నిర్జయ వుండగా మరొకర్ని తీసుకు వెళ్ళాలను కోవడం సహ్యం కాదన్నాడు.

నిజమే.... శ్యాంకి తోడుగా వెళ్ళాల్సింది మెకానికల్ ఇంజనీర్ నివాస్ కాదు....మరో ఎలక్ట్రానిక్స్ గ్రాడ్యుయేట్.

"లాభంలేదు నివాస్....ఇప్పటికే నలుగురూ అనుకుంటున్నది చాలు. నిర్జయని అనవసరంగా రొంపిలోకి లాగటం నా కిష్టంలేదు" వీలుకాదన్నట్టుగా తెగేసి చెప్పాడు శ్యాం సమీపంలో వున్న నిర్జయని చూస్తూ.

"పిరికివాడిలా మాట్లాడకు....ఏ నలుగురూ అలా కామెంట్ చేశారో వాళ్ళ నోరు మూయించాలీ అంటే యిదే అనుకోకుండా వచ్చిన అవకాశం" నచ్చచెప్పాడు నివాస్. "ఒకవేళ నిర్జయగారికి అభ్యంతరమైతే ఆల్టర్నేటివ్ గురించి అప్పుడు ఆలోచించు."

"నాకు అభ్యంతరం లేదు" అంతసేపూ వారి చర్చ వింటున్న నిర్జయ టక్కున అంది. "ఎవరో ఏదో అనుకుంటే వెనకడుగు వేయటానికి నేనేం పిరికిదాన్ని కాదు."

చాలా అభ్యుదయ భావాలుగల ఆడపిల్లనన్న విషయాన్ని అలా ధ్వనింపచేసింది.

అంతే....నివాస్ అభినందనగా చూశాడు. "దట్స్ ది స్పిరిట్. రేపో మాపో ఒక డిపార్ట్‌మెంట్‌ని లీడ్ చేసే స్థాయికి ఎదగాల్సిన వ్యక్తి ఇలాంటి స్కేండల్స్‌ని పట్టించుకుంటే ఎలా?"

ఎదిగే అవకాశం వుందో లేదోగాని ఆ వాక్యం ఆమెకు చాలా స్ఫూర్తినిచ్చింది.

సాయంకాలం ప్లైన్‌కి టిక్కెట్స్ రిజర్వ్ చేయబడ్డాయని పబ్లిక్ రిలేషన్స్ డిపార్టుమెంట్ తెలియచేయగానే నిర్మల శ్రీహర్ష కోసం అతడి ఆఫీసుకు వెళ్ళింది.

శ్రీహర్ష లేడు. ఎక్కడికి వెళ్ళిందీ ఎవరూ చెప్పలేకపోయారు.

వెనక్కి తిరిగి వస్తున్న నిర్మలని శర్మ అనుసరించాడు. శ్రీహర్షపై వున్న కక్ష తీర్చుకోవటానికి ఇదో మంచి అవకాశంగా అనిపించిందేమో ఓ రహస్యంలా అన్నాడు. "రోజూ వెళ్ళేది మాయతికారు అమ్మాయి దగ్గరికే కాబట్టి ఈ రోజూ అక్కడికే వెళ్ళుంటారు."

ఆ అమ్మాయెవరో నిర్మలకి తెలుసు....

కాబట్టే తెలిసీ ఆశ్చర్యపోలేదు....

కానీ శర్మ చెప్పిన పద్ధతికి బాధపడింది....

శ్రీహర్ష కేరెక్టరు విషయంలో నిర్మలకి చాలా నమ్మకముండి.... కానీ నమ్మనిది, నమ్మకం సన్నగిల్లిపోతున్నది ప్రమీల విషయంలోనే....

ఎంత మోడరన్‌గా ఆలోచించేదైనా ఇప్పుడిలా అనుకోవటానికి కారణం ఈమధ్య శ్రీహర్షలో ఆమెకు కనిపించిన మార్పు.

అతడు ముభావంగా వుండటానికి, ఆలస్యంగా ఇంటికి రావటానికి ప్రమీలే కారణమైతే తనలో పెరుగుతున్న అశాంతికి పరోక్షంగా నిందించాల్సింది ప్రమీలనైనా ప్రత్యక్షంగా ప్రశ్నించాల్సింది శ్రీహర్షనే.

ప్రశ్నించడమూ కాదు........తన ఏబ్‌సెన్స్ అతడికి తెలిసొచ్చేట్టు చేయాలి.

అందుకే బొంబే ప్రయాణాన్ని ఓ గొప్ప అవకాశంగా భావించింది. ఒకవేళ సమయానికి శ్రీహర్ష కనిపించి 'నిన్ను చూడకుండా ఎలా ఉండనూ' అంటే ఆనందంగా టూర్ క్యాన్సిల్ చేసుకునేదే—కాని లేడుగా....

మనసు మండిపోతుంటే నాలుగు వాక్యాలు రాసింది ఉత్తరంలా.

ట్రైనేదో స్టేషన్‌లో ఆగింది.

మసక వెలుతురులో నిర్జనంగా వుంది ప్లాట్‌ఫామ్.

నిముషం తర్వాత మళ్ళీ ట్రైన్ బయలుదేరింది ఆగి ఆగి కదిలే ఆమె ఆలోచనల్లా....

తప్పు చేశానా....

చెప్పి రావాల్సిందేమో కదూ....

శ్రీహర్ష ఏదీ సరిగా వ్యక్తం చేయటం చేతకానివాడని ఆదినుంచీ తెలుసు. ఇప్పుడు అతడి మౌనాన్ని మరోలా అర్థం చేసుకుంటూందేం....

ప్రమీలనే అమ్మాయితో పరిచయాన్ని అపార్థం చేసుకునే సంకుచిత మైన మనిషి కాదు తను.

కానీ అతడ్ని క్షమించలేక పోతూంది.

అసలు శ్రీహర్ష చేస్తున్న తప్పేమిటి....

రోజూలానే ఈ ఆలోచన యిక్కడే ఆగిపోయింది.

అక్కడినుంచి మరికాస్త లోతుగా వెళితే కనిపించేది శూన్యమే.

ఆ శూన్యాన్ని దర్శించగలిగితే తన ఆరాటానికి అర్థం లేదని బోధ పడిపోతూంది.

అతిగా ఆలోచించి కుమిలిపోవడాన్ని యిష్టపడ్డ చాలామంది సగటు ఆడపిల్లల్లా ఆలోచనల్ని మళ్ళించిన నిర్జయకి తెలీదు.

తను పెరిగింది ఉన్నింటి అమ్మాయిగా కాదు. తన పరిసరాలు తన ఆలోచనలు మధ్య తరగతికి చెందినవే. కాదూ అని మభ్యపెట్టుకుంటూ తన వూహాల మేరకి శ్రీహర్ష తనకి చేరువ కావటంలేదని కుమిలిపోతూంటుంది.

"ఇంకా నిద్రపోలేదూ?"

ఎప్పుడు మేల్కొన్నావో బడలికగా చూస్తున్నాడు శ్యాం.

విసియంగా నవ్వేసింది.

నిట్టూర్పులా గాలిపీలుస్తూ అన్నాడు. "బాధపడుతున్నారా?"

"దేనికి?"

"ఇలా బయలుదేరినందుకు."

"ఇంతకు ముందూ మనం ఓసారి యిలా వెళ్ళాం."

"కాని అప్పటి పరిస్థితులు వేరు నిర్మలా...."

తనో నిజాయితీపరుడయిన వ్యక్తిలా కనిపించాలని శ్యాం చేసిన ప్రయత్నం ఫలించింది.

"ఆడదానికి నాకు లేని వెరుకు మీకెందుకు?" నవ్వేసిందామె. "మీరు ఎన్ని కబుర్లు చెప్పినా మీదీ పిరికి మనస్తత్వమే."

"అది కాదు నిర్మలా....గొడవైన రోజే మనం యిలా బయల్దేరడం ఘోరం కాకపోయినా నేరం."

"నేరమెలా అవుతుంది....మనం వెళ్తున్నది మన యిష్టప్రకారం కాదు. కంపెనీ పనిమీద."

కంపెనీ పనిమీద అయినా ఆ పనిని సృష్టించింది శ్యామే అని ఆమెకి తెలీదు.

నిజానికి తాము వెళ్తున్న ఆ సమస్య పరిష్కరించటానికి ఓ ఎలక్ట్రీషియన్ చాలు.

ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్స్ అటెండ్ కావాల్సినంత పెద్ద సమస్య కాదు.

కానీ తననే పంపమని ఫేక్టరీ మేనేజరుకి చెప్పాడు విడిగా కల్సుకుని.

మధ్యాహ్నందాకా ఆలోచించిన జాయింట్ జనరల్ మేనేజర్ అలా అభ్యర్థించింది శ్యాం ఫేక్టరీ మేనేజింగ్ డైరెక్టర్‌కి కాబోయే అల్లుడుగా అనిపించడంతోనూ పైగా తనకు రావాల్సిన ట్రాన్స్‌ఫర్ విషయంలో శ్యాం అవసరం వుండటంతోనూ అతడ్నే పంపాలని నిర్ణయించి అతడి సీటు దగ్గరికే వచ్చాడు.

"పడుకుందామా?" అన్నాడు మరేదో అర్థం స్ఫురించేలా.

ఆమె కళ్ళు మూసుకుంది.

"గుడ్‌నైట్" అంటూ పక్కకి ఒత్తిగిల్లాడు.

ఆచరించబోయే ఏ పథకం గురించి ఆలోచిస్తూ శ్యాం నిద్రకు ఉపక్రమించాడో నిర్ణయకి తెలీదు.

కానీ ఆమె నిద్ర లేచేసరికి 'పాట్'లో తెప్పించిన కాఫీతో సిద్ధంగా వున్నాడు శ్యాం.

శ్యాం గురించి ఎవరెన్ని చెప్పినాగాని అతడు తనపై చూపించే శ్రద్ధకి విస్మయం మాత్రమేగాక ఆమెకి గర్వంగానూ అనిపించింది.

ఉదయం పదిగంటలకల్లా బొంబే విక్టోరియా టెర్మినస్‌కి ట్రెయిన్ చేరగానే ఆమె సూట్‌కేస్ కూడా తనే అందుకున్న శ్యాం అరగంటకల్లా బాంద్రా గెస్ట్‌హౌస్‌కి చేర్చాడామెని.

మరో పదిహేను నిముషాలలో ఫేక్టరీకి బయలుదేరటానికి సిద్ధమైన శ్యాం రెడీ అవుతున్న నిర్ణయని చూస్తూ అన్నాడు. "మీరు రిలాక్స్‌వ్వండి. నేను ప్రాబ్లెమ్ సాల్వ్‌చేసి వస్తాను."

"నేను వచ్చింది జాలీ ట్రిప్‌కి కాదుగా" అందామె.

"అది కాదు నిర్ణయా...మీరు బాగా అలిసిపోయినట్టున్నారు."

"నేను పరుగెత్తుకుంటూ రాలేదుగా?"

"అయినా నాకు పాపం చుట్టుకుంది."

"అదేమిటీ?" విస్మయంగా అడిగిందామె.

"నిజం నిర్ణయా....కొత్తగా పెళ్ళయిన అమ్మాయిని భర్తతో పంచుకోవాల్సిన స్వీట్ నథింగ్స్‌కి ఫుల్‌స్టాప్ పెట్టించి యిలా లాక్కొచ్చాను."

"మీరు లాక్కురాలేదు. నేనే వచ్చాను."

"నేను లాకొచ్చినా లేక మీ అంతట మీరే వచ్చినా జరిగింది ఒకటే నిర్ణయా....ఓ జంటను బాధపెట్టాను."

మరో అరగంటకి ఫ్యాక్టరీకి చేరుకున్నారిద్దరూ. ప్రొటక్షన్ మేనేజర్ సక్సేనా రిసీవ్ చేసుకున్నాడు.

కేవలం గంటన్నరలో సమస్యను పరిష్కరించాడు శ్యాం. మెషిన్ ఇప్పుడు యథాతథంగా నడుస్తుందంటే అన్నాడు నిర్ణయతో. "చాలా చిన్న సమస్యను ఎగ్జాగరేట్ చేశారు నిర్ణయా....మనం ఈ రాత్రికే బయలుదేరి పోవచ్చు. మీరు కుదరదంటే తప్ప."

"నేనెందుకు కుదరదంటాను?"

"కాంపే అంతా చూస్తారేమో అని...." మొహంలోని భావాల్ని కనిపించకుండా జాగ్రత్తపడ్డాడు.

నిర్ణయపై మీ వాక్యం బలంగా పని చేసింది.

నిజమే....

ఎప్పుడో కాని రాని అవకాశం....

ఒకవేళ తను తల్లిదండ్రుల యిష్టప్రకారం పెళ్ళి చేసుకుని వుంటే భర్తతో హనీమూన్‌కిలా రాగలిగేదేమో కాని అలాంటి అవకాశాన్ని తను కోల్పోయింది.

శ్రీహర్ష గుర్తొస్తుంటే యింతమించి ఉక్రోషంగా అంది "చూసి వెళదాం."

అంతే....

ఫేక్టరీ యాజమాన్యం ఏర్పాటు చేసిన లంచ్ పూర్తి చేసి టాక్సీలో బయలుదేరారు రెండు గంటల కల్లా....

గెట్ వే, ఎలిఫెంటా కేవ్స్, హేంగింగ్ గార్డెన్స్, అరేబియాసముద్రపు ఒడ్డున ఆడా మగా విచక్షణ లేకుండా సాయంకాలం వేళ తిరిగే జంటల్ని, కాస్మోపోలిటన్ కల్చర్ని చూస్తూ ఆదమరచి పోయింది.

అన్నింటి కన్నా ఆమెను ఆకట్టుకున్నది శ్యాం.... స్నేహితుడిలా కాదు ఓ ఆత్మీయుడిలా ప్రతిక్షణమూ చాలా ఇంప్రెస్ చేశాడు.

రాత్రికి సన్ అండ్ సీలో డిన్నర్ పూర్తి చేస్తుండగా అంది నిర్మల. "అనూహ్య అదృష్టవంతురాలు"

"హఠాత్తుగా మా అనూహ్య గుర్తు కొచ్చిందేమిటి?" అన్నాడు ఓరకంట గమనిస్తూ.

"నిజం శ్యాం అనూహ్య నిజంగా అదృష్టవంతురాలు"

కోరిన జీవితానికి పొందిన దానికి మధ్య పొంతన లేని ఆలోచనల్ని, అంతకు మించి వ్యక్తీకరించడం యిష్టం లేనట్లు మొహంపై పేరుకున్న అసహనానికి నవ్వును పులిమేసుకుంటూ అంది. "షి యీజ్ గోయింగ్ టు బి లక్కీ"

ఆమెలో ఏ సంచలనాన్ని కోరుకున్నాడో అది సాధించ గలిగినందుకు సంతృప్తి చెందిన శ్యాం తన పథకంలో మొదటి సగం పూర్తయిన ఉత్సాహంతో గెస్టుహౌస్కి చేరుకున్నాడు.

ఆమెకు అలజడిగా వుంది.

అది కాదు.

శ్రీహర్షతో దాంపత్యంలోని వెలితి యిప్పుడు మరింత స్పష్టంగా అర్థమయిపోతూంది.

"చెస్ ఆడుకుందామా?" అడిగాడు శ్యాం.

"వద్దు నిద్రొస్తూంది"

నిజానికి ఆడకూడదనుకున్నది నిద్ర మూలంగా కాదు.

శ్యాం మాటలు వింటూ కూర్చునే శక్తి లేక....

అతడు తనపై కనబరుస్తున్న శ్రద్ధ శ్రీహర్ష పై ద్వేషాన్ని మరింతగా పెంచుతుంటే ఏ క్షణంలో అయినా తను బరస్టయిపోతుంది.

శ్యాం ముందు తను అలా ఓడిపోవడం యిష్టం లేదు.

నిర్ణయ గదిలోకి వెళ్ళబోతుంటే "ఒక్క క్షణం" అన్నాడు.

"చెప్పండి" అంది మరెటో చూస్తూ.

"నేను మిమ్మల్నేమన్నా బాధ పెట్టానా?" శ్యాం గొంతులో ఆత్మీయత ధ్వనించింది.

"ఎందుకలా అనుకుంటున్నారు"

"ఉన్నట్టుండి మీలో ఏదో మార్పు కనిపిస్తూంది"

నవ్వేసింది "భలేవారే...."

"ప్లీజ్....నిజం చెప్పండి....బహుశా నేను చనువు తీసుకుంటున్నందుకు మీరు యిబ్బంది పడుతున్నారేమో కదూ!"

"చనువేమిటి" అర్థం కానట్టుగా చూసింది. "మనం స్నేహితులం. అంతకుమించి కొలీగ్స్మి....అయినా మీరలా ఆలోచిస్తున్నారేం?"

"ఆలోచించక....' బాధని అభినయించాడు శ్యాం. "పగలంతా చాలా ఉత్సాహంగా కలిసి తిరిగిన మీరు యిప్పుడు నేను మాట్లాడుతున్నది ఓ పరాయి మగాడితో అన్నట్టు గదిలోకి వెళుతుంటే నేనేం అనుకోవాలి?"

ఆగిపోయింది నిర్జయ....

శ్యాం తన గురించి అలా ఆలోచించడం చాలా సంతృప్తినిచ్చిందేమో "ఓ.కె.... ఆడదాం రండి" అంది.

ఐదు నిమిషాలలో బాల్కనీలో లైటు వెలిగింది. ఆమెతోబాటు చెస్ బోర్డు ముందు కూర్చున్నాడు.

రాత్రి తొమ్మిది గంటలు కావస్తూంది....

ఇంకా సద్దుమణగని నగరం....సమీపంలో కార్ల రొద....దూరంగా సముద్రపు హోరు.... నిర్జయలో గెలుపు కోసం ఆరాటం....

ఏకాగ్రతగా బోర్డుపై పావుల్ని చూస్తున్నాడు శ్యాం....

అయినా అతడి ఆలోచనలు నిర్జయ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

ఇక్కడ పావుల్ని కోల్పోతేనేం....

నిర్జయని పావుగా మార్చుకోగలగాలి....

చెస్‌లో ప్రావీణ్యత ఉన్నవాడైనా నిర్జయతో ఓడిపోవాలని సంకల్పించుకోవడం ముందుగా అతడు నిర్ణయించుకున్నదే.

ఎదుటి వ్యక్తి ఓటమితో తప్ప ఆటపై మక్కువ పెంచుకోని నిర్జయ లాంటి అమ్మాయిని పూర్తిగా ఓడించాలీ అంటే ఆ మాత్రం వెసులుబాటుని ప్రదర్శించక తప్పదు.

జారిన పైటని సైతం గుర్తించకుండా నిర్జయ 'పాన్స్' కదుపుతుంటే ఓరకంట ఆమె పొంకాన్ని గమనిస్తున్నాడు శ్యాం.

"మార్వలెస్"

ఆమెని అభినందిస్తూ చివరి గెలుపుకోసం నిరీక్షిస్తున్నాడు.

"షా" రాజుకి చెక్ చెప్పిన ఆమె గర్వంగా చూసింది శ్యాంవేపు....

"ఓడిపోయాను" నవ్వేశాడు శ్యామ్. "మీరింత మంచి ప్లేయరని ఇంతవరకూ తెలీదు."

"మరోసారి ఆగవాచూ" ఈసారి ఆమే అడిగింది.

"వెల్‌కమ్" అంగీకరించాడు శ్యామ్.

ఆట మొదలై ఇంకా అయిదు నిమిషాలు కూడా కాలేదు గెస్ట్‌హౌస్ వాచ్‌మేన్ రెండు ప్లేట్స్‌లో ఐస్‌క్రీం తెచ్చాడు.

"కసాటా....ఐ థింక్ యూ లైకిట్" అన్నాడు శ్యాం.

విభ్రమంగా చూసింది ఆమె "ఇదెప్పుడు తెప్పించారు?"

"ఎప్పుడు తెప్పిస్తేనేం మీకు కసాటా ఇష్టమేగా?"

ఆమె క్షణంపాటు అతడి కళ్ళల్లోకి చూసింది.

తనకేవి యిష్టమో శ్రీహర్షకన్నా శ్యామ్‌కే ఎక్కువగా తెలుసని అనిపించడం యాదృచ్ఛికమే.

"థేంక్యూ" అంటూ ప్లేటు అందుకుందామె.

స్పూన్‌తో ఐస్‌క్రీం తీస్తూ చూస్తూనే ఆడుతున్న నిర్గయకి తెలీదు— ముందు వేసుకున్న పథకం ప్రకారం వందరూపాయల టిప్ యిచ్చిన శ్యాం వాచ్‌మేన్ని వెంటనే గెస్ట్‌హౌస్ నుంచి పంపేశాడని.

మరో అయిదు నిమిషాలు గడిచాయి....

నిర్గయకి బడలికగా వుంది .... బడలికగా కూడా కాదు అదోలాంటి మత్తు. కనురెప్పలు భారంగా వాలిపోతున్నాయి.

ఏమిటిలా అవుతోంది....

శ్యామ్‌ని అడగలేకపోయింది ఆమె.

ఉన్నట్టుండి తనలో ఈ మార్పేమిటి అనుకుంటూనే పైకి లేచింది. లేస్తూ తూలింది.

"వాట్ హేపెండ్?" అనహా ఇవ్వబోయాడు శ్యామ్.

ఆమె జవాబు చెప్పలేదు.

జారిన పైట సంగతి పట్టించుకోకుండా గోడకి జారగిలబడిపోయింది.

శ్యామ్‌లో వేడి ప్రకంపనలు....

తను వేసిన పథకంలో నిర్జయతో సుఖానికి చివరి పావుని కదిపే సమయం ఆసన్నమైపోయింది.

"ఆట మధ్యలో...." శ్యాం మాటలు యింకా పూర్తికాలేదు.

"సారీ....నాకు....నిద్రొ....స్తూం....ది" నిర్జయ నాలుకే కాదు కాళ్లూ తడబడి ముందుకు తూలబోయింది.

అది ఆసరా అందించడమో లేక కావాలని పొదివిపట్టుకోవడమో గుర్తించే స్థితిలో లేదామె.

శ్యామ్ చేతుల్లో ఒదిగిపోయింది.

చరిత్ర గుహాంతరంలో ఓ తోడేలు కదిలిన అలికిడి....పెపేల్మన్న సంకెళ్ళ విశ్వాసానికి దీపం ఆరి సుప్త మనః ప్రాంగణంలో పేరుకున్న బ్లాకవుట్....దాంపత్య మధుపాత్రలో చిలకబడిన విషబిందువుల ఒరిపిడి.

ఆమెని పైకెత్తుకున్నాడు శ్యామ్.

శబ్దం....నిశ్శబ్దం.... భవం....అనుభవం.... బ్రతుకు పణం ..... యవ్వన రణం....

ఆమె నలిగిపోతూంది అలసటగా....వివశంగా....

*　　*　　*　　*

"ఇదీ మోసమెలా అవుతుంది శ్రీహర్షా" ఉదాసీనంగా అంది ప్రమీల. "అవసరం....ఎందుకంటే పెళ్ళయిన ఏ మగాడూ కావాలని మరో ఆడదాని వెంటపడటాన్ని కోరుకోడు కాబట్టి."

అర్థం కానట్టుగా చూశాడు శ్రీహర్ష.

అసలు ప్రమీల విశ్లేషణ సహజంగా అనిపించలేదు.

ఓ స్త్రీ మరో స్త్రీకి జరుగుతున్న అన్యాయం విషయంలో ఆ స్త్రీనే సమర్థిస్తుందనుకుంటే యిలా మాట్లాడుతుందేమిటి.

నిన్న నిర్ణయ టూర్ వెళ్ళాక రాత్రంతా ప్రమీల యిచ్చిన 'ఆర్టాఫ్ ఇంటిమసీ' పుస్తకం చదువుతూ గడిపేశాడు శ్రీహర్ష. అందులో చాలా విషయాలు ఆసక్తిగా కనిపించాయి....కొన్ని అతడి ఆలోచనలకి భిన్నంగానూ అనిపించాయి.

నిజానికి వాటి గురించి ప్రమీలతో మాట్లాడాలనుకుంటూ సాయంకాలం దాకా ఆఫీసులో గడిపేసిన శ్రీహర్ష పొద్దుపోయాక ఓ టెండరు విషయం అర్జెంటుగా శంకర్‌తో మాట్లాడి ఫైనలైజ్ చేద్దామనుకుంటే శంకర్ ఆఫీసునుంచి వెళ్ళిపోయాడు.

ఇంటికి ఫోన్ చేస్తే ఇంకా రాలేదని చెప్పింది శంకర్ భార్య సీత.

బహుశా శంకర్ గెస్ట్‌హౌస్‌లో స్నేహితుల్తో మందులో సెటిల్ అయ్యుంటాడనిపించి వెళ్ళాడక్కడికి.

స్నేహితులెవరూ లేరు.

చాలా నిశ్శబ్దంగా వుంది.

గెస్ట్‌హౌస్ వాచ్‌మేన్ కోసం చూశాడు గాని కనిపించలేదు.

వెనక్కి తిరిగి వచ్చేయాలనుకుంటుండగా లోపలినుంచి నెమ్మదిగా మాటలు వినిపించాయి.

ఆసక్తిని చంపుకోలేక కిటికీలో నుంచి చూశాడు.

అంతే. షాక్ తిన్నాడు....

సోఫాపై అర్ధనగ్నంగా పడుకునివుంది మోనీ శంకర్ సెక్రెట్రీ.

ఆమెకు అభిముఖంగా కూర్చున్న శంకర్ లిక్కర్ సేవిస్తూ జోవి యల్‌గా మాట్లాడుతున్నాడు.

శ్రీహర్షకి ముచ్చెమటలు పోశాయి.

మోనీ మోడరన్‌గా ఆలోచించే అమ్మాయి మాత్రమే అనుకున్నాడు గాని ఓ పెళ్ళయిన స్త్రీ అయ్యుండీ మరో పెళ్ళయిన మగాడితో యిలా బరి తెగించి తిరగ్గలదని వూహించలేకపోయాడు.

నిజానికి మోనీపై కాదు కోపం వచ్చింది.

తప్పంతా శంకర్‌దే అనిపించింది.

భర్తే తన సర్వస్వం అనుకునే సీత లాంటి భార్యని మోసగిస్తూ యిక్కడ సుఖాన్ని వెతుక్కుంటున్నాడు. ఏ రోజూ మోనీ శంకర్‌ల చనువు గురించి లోతుగా ఆలోచించని శ్రీహర్ష ఈ రోజు పూర్తిగా అర్థం చేసుకున్నాడు.

శంకర్‌ని నిలదీసేవాడే....

'కేరెక్టర్' విషయంలో శంకర్ యింతలా దిగజారడం అతడికి చాలా కోపకారణమై ఆవేశంగా ద్వారం తట్టబోతుండగా మోనీని శంకర్ పైకెత్తుకుని టేబిల్‌పై వెల్లకిలా పడుకోబెట్టాడు.

ఆమె కాదనలేదు....

నవ్వుతూ సహకరిస్తూంది....

ఇది చూసేక ఒక అకృత్య జోక్యం చేసుకోవడంగాని ఆ యిద్దర్నీ నిలదీయడంగాని అర్థంలేని విషయమనిపించింది.

వెనక్కి మరలాడు....

శ్రీహర్ష పెరిగిన వాతావరణంకాని, నైతిక విలువల గురించి అతడు పెంచుకున్న నమ్మకాలుకాని యింత బాహాటంగా అతడ్ని వెక్కిరించటం బాధాకరంగా అనిపించడంతో సరాసరి ప్రమీల దగ్గరికి వచ్చాడు.

అప్పటికే గీతా యజ్ఞానికి వెళ్ళి వచ్చిన ప్రమీల శ్రీహర్ష మొహం చూస్తూనే గ్రహించింది అతడి మానసిక స్థితిని.

ఇప్పుడిప్పుడే తన మనసులోని భావాల్ని బహిర్గతం చేయగలుగు తున్న చనువు మూలంగానేమో శంకర్, మోనీల పేరు చెప్పకుండా 'అక్రమ సంబంధం' అన్న టాపిక్ తెచ్చి ఆమె అభిప్రాయం అడిగాడు.

ఆమె కూడా ఇది ఎవరికి సంబంధించింది అని అడగలేదు.

అంతా విన్నాక పెళ్ళయిన మగాడు తప్పు చేయటానికి కారణం ఏక్షై శాతం భార్యే అవుతుందని తేల్చేసింది.

"దాంపత్యమంటే ఎవరి అవసరాలు వాళ్ళు తీర్చుకోవడం కాదు ప్రమీలా....పెళ్ళయిన మగాడు మరో ఆడదానికోసం వెంపర్లాడటం అంటే తన సగభాగంలోని లోపం కాదు....తన సగభాగాన్ని మోసం చేయటం."

"అది ఓల్డ్ థియరీ శ్రీహర్షా....దాంపత్యం అంటే ఫిఫ్టీ ఫిఫ్టీ అఫైర్ కాదు" టక్కున అంది ప్రమీల.

"అలాంటప్పుడు సగభాగం అన్న పదానికే అర్థం లేదు."

"అసలు సగభాగం అంటే అర్థం ఏమిటి....?అన్నిటా సగం సగం పంచుకుంటూ రెండు సగాలూ ఒకటిగా రూపుదిద్దుకోవడమా?"

"యస్"

"అది వర్తించేది కేవలం భార్యాభర్తల సెక్స్ సుఖం దాకా మాత్రమే శ్రీహర్షా."

"సెక్స్ కూడా దాంపత్యంలో ముఖ్యమైన భాగమేగా?"

"అది ముఖ్య భాగంగా అనిపించాలీ అంటే మిగతా దాంపత్య జీవితం లోనూ ఎమోషనల్ షేరింగ్ కావాలి" మృదువుగా అందామె .... అర్థం కాలేదు శ్రీహర్షకి.

"అవును శ్రీహర్షా....ముందు ఈ సగభాగం అనే పదాన్ని డిఫైన్ చేయగలమో లేదో ఆలోచిద్దాం" ఓ విశ్లేషణలా చెప్పుకు పోతుంది ప్రమీల "ఆ మధ్య ఓ సైకో అనలిస్టు ఆర్టికల్ చదివాను....దాంపత్య జీవితంలో సుఖంలేదని వాపోయిన ఓ భర్తని సుఖాన్ని చెరిసగం పంచుకోగలుగు తున్నారా అని అడిగాడట ఆ సైకో అనలిస్ట్. దానికి ఆ భర్త ఏం చెప్పాడో తెలుసా....వంద శాతం సంపాదన నేను తెస్తుంటే, వంద శాతం యింటి పనులు ఆమె చేయకుండా అక్కడికి తనే ఏదో శ్రమపడుతున్నట్టు ఆందో ళన పడుతుందీ అని....అంటే సగటున యిద్దరూ సమాన బాధ్యతలు తీసు కోవాల్సి వుండగా తను మాత్రమే ఎక్కువ శ్రమ పడిపోతున్నట్టు తన భార్య ఎందుకు గొడవ చేయాలీ అని ఆ భర్త ఉద్దేశ్యం అన్నమాట. కొంత దాంపత్య జీవితం తర్వాత ప్రతి భార్యా భర్త ఖచ్చితంగా యిలాగే ఆలో చిస్తారంటాడా సైకో అనలిస్ట్....ఇందులో తప్పు భర్తదా లేక భార్యదా అన్న విషయం పక్కన పెడదాం. అసలు షేరింగ్ అంటే ఏమిటి?"

క్షణం ఆగింది ప్రమీల.

"ఒక వారం భార్య రిలాక్స్‌డ్‌గా తను కోరిన టి.వి ప్రోగ్రామ్స్ చూసుకుంటూ యిష్టం వచ్చిన నవల్సు చదువుకుంటూ గడిపే అవకాశం కలగొచ్చు. ఆ వారం భర్త ఆఫీసులో తలమునకలయ్యే పనితో రేయిం బవళ్ళు శ్రమించాల్సి రావచ్చు. అదే భర్త మరుసటి వారం ఆఫీసులో రిలాక్సవుతూ యింటికి రాగానే తన యిష్టమొచ్చిన స్పోర్ట్స్ లైవ్ టెలికాస్ట్ చూస్తూ గడపవచ్చు. కాని బంధువులు రావడంతో భార్య ఆ వారమంతా బిజీగా ఊపిరందని శ్రమలో చిక్కుకోవచ్చు. అంటే ఓ వారం భర్త మరో వారం భార్య రిలాక్సవటానికి వాళ్ళ మన స్తత్వాలు రేక సోషల్ ఫైనాన్షియల్ కండిషన్స్ దోహదం చేస్తుంటాయి. దీన్ని బట్టి అర్థమయ్యేదేమిటంటే ప్రతి దాంపత్య జీవితంలోనూ ఫీలింగ్ అనేది ఒకే శాతంలో ఉండదనేగా. ఓ వారం మగాడికి తొంభై ఎనిమిది శాతం టెన్షన్ వుంటే ఆ వారం స్త్రీకి రెండు శాతం టెన్షనే ఉంటుంది. మరోవారం ఆ పర్సంటేజ్ రివర్స్ అవుతుంది. ఈ వాస్తవాన్ని ఖచ్చితంగా తెలుసుకున్న భార్యాభర్తలు బాధ్యతల్ని కాక యీ ఆలోచనల్ని చెరిసగం పంచుకుంటే తప్పకుండా సుఖపడతారు."

ఆమె ఆగింది సాలోచనగా చూస్తూ....

"నాకు తెలుసు శ్రీహర్షా ఇది నీకు రుచించని విషయం నీకే కాదు, ఏ భార్యా భర్తా అంగీకరించక పోవచ్చు....కాని ఇది హార్డ్‌గా వున్నా అర్థం చేసుకోవాల్సిన రియాలిటీ. అది అర్థం చేసుకోవాలీ అంటే 'సెన్సాఫ్ టుగెదర్‌నెస్'కి అర్థం తెలియాలి. దాంపత్యం అంటే నిల్వ నీరుండే చెరువు కాదు. పరిస్థితుల్ని బట్టి ఉరవడి నిర్ణయించాల్సిన ప్రవాహం. ఈ వారం భర్త ఎమోషనల్‌గా అప్పర్ హేండ్‌లో వుంటాడు. మరుసటి వారం భార్య ఎమోషనల్‌గా అప్పర్ హేండ్‌లో వుంటుంది .... అంటే భార్యాభర్తలు కలిసి బ్రతికే వ్యక్తులైనా అలా సమయాన్ని బట్టి ఎమోషన్స్ మారుతుం

టాయి. దానికి కారణం వ్యక్తిగతమైన అభిరుచులు. మెటీరియలిస్టిక్‌గా ఆలోచిస్తున్నాననుకోకు చాలా దాంపత్యాలు దెబ్బతినేది యీ అభిరుచుల విషయంలోనే. 'టు గెదర్‌నెస్ ఐడియల్' అంటే ఒకరి అభిరుచుల్ని మరొకరు చంపుకుని బ్రతకడం కాదు. అడ్జస్టు కావడం. ఉదాహరణకి నీకు ఫిలాసఫీ చదవటం యిష్టం. మీ ఆవిడకి ఇంగ్లీషు నవల్సు చదవాలని ఆసక్తి ఇద్దరికీ చదవడమనే ఆసక్తి కామన్ అయినా చదివే సబ్జెక్టులో వైవిధ్య ముంది. ఆవిడ్ని అవే చదవనీయక, నీ ఫిలాసఫీ బుక్స్ చదివించాలని తాపత్రయపడకు. అలాగే ఏ భార్యయినా తను వంట చేసేప్పుడు భర్త సహకరించాలని కోరుకోవాలే తప్ప మొత్తం వంటే అతడిచేత చేయించాలని ఆలోచించకూడదు. లేదు నేను అనుకున్నట్టే నా భర్త ప్రవర్తించాలనే భార్య తన సుఖాన్ని మాత్రమే కాక భర్త ప్రశాంతతనీ ధ్వంసం చేస్తుంది...అసలు ఆడది కోరుకుంటే మాత్రం భర్త అంగీకరిస్తే మాత్రం పిల్లల్ని తొమ్మిది నెలల పాటు కడుపులో మోయటం మగాడికి సాధ్యమైన విషయమేనా శ్రీహర్షా. అది అసంభవంగా....అలాంటప్పుడు 'ఫిఫ్టీఫిఫ్టీ మేరేజ్ సూత్రం' అన్నది స్పిరిట్ పంచుకోవటానికే తప్ప బాధ్యతల్ని పంచుకోవడంలోనే అని ఏ భార్య అయినా ఎందుకు ఆలోచించాలి."

"కాని" అంతసేపూ ప్రమీల తర్కాన్ని నిశ్శబ్దంగా విన్న శ్రీహర్ష నిర్లిప్తంగా అన్నాడు "ఇందాక నేను చెప్పిన దంపతుల్లోని భార్య పాత్ర అలా సగం బాధ్యతల కోసం భర్తని వేధించే తత్వం లేనిది....ఒట్టికగా భర్త చెప్పింది మాత్రమే వింటూ అతడి సేవలతోనే జీవితాన్ని వెళ్ళమార్చా లనుకునే వ్యక్తి. అలాంటి స్త్రీని మోసం చేయడం దారుణం కదూ."

"అదిగో 'మోసం' అంటూ మళ్ళీ ఇంకొకటి పదాన్ని వాడుతున్నావు. అపొరెంట్‌గా ఏదీ మోసంలా అనిపించని విషయానికి అది అవసరం శ్రీహర్షా...దాహం వేసే మనిషికి కావాల్సింది దప్పిక తీర్చే నీళ్ళు తప్ప అన్నం పెట్టడం కాదు...అలా చేస్తే ఆమె అతడికి ఏది కావాలో అది అందించటంలో విఫలమైనట్టే. ఆ వైఫల్యం ప్రేమను ఎక్స్‌ప్రెస్ చేయడంలో కావచ్చు. లేదా సెక్స్‌లో కావచ్చు."

ఇబ్బందిగా చూశాడతను.

"ఆడపిల్లలా అలా తెల్లమొహం వేసి చూడకు శ్రీహర్షా! దాంపత్యంలో శృంగారం అంటే ఏ ఒక్కరి మూలంగానో జరిగే చర్య కాదు. ఇస్తూ పుచ్చుకునేది. తీసుకుంటూ యిచ్చేది. అంటే యిచ్చే వ్యక్తిలో తీసుకోవాలనే ఆసక్తినీ కలిగించాలి. తీసుకునే వ్యక్తిలో యింకా యివ్వాలనే ఆసక్తినీ పెంపొందించాలి. ఇలా ఎందుకు చెబుతున్నానూ అంటే చదువుకున్న చాలామంది అమ్మాయిలు సైతం శృంగారంలో స్తబ్దతనే పాటిస్తారన్న విషయము నాకు తెలుసు కాబట్టి. అదీ ఓ కళ....ఆ విషయం తెలిసినా చాలామంది అమ్మాయిలు పార్టిసిపేట్ చేయటానికి సుముఖంగా వుండరు. దానికి కారణం పెరిగిన వాతావరణం కావచ్చు. లేదా అనాదిగా సాంప్రదాయాలు అందించిన బిడియం కావచ్చు. కానీ ఆ స్థితిలో భర్త ఏదో మిస్సయిపోయాననే బాధకి లోనవుతుంటాడు అతడు కోరుకున్నది భార్య నుంచి దొరకనప్పుడు అలా అందించే అమ్మాయి కోసం అర్రులు చాస్తాడు. ఇది వైస్ వెర్సా కూడా. అంటే కేవలం భార్యలకే సంబంధించింది కాదు. మగాళ్ళ పరంగా కూడా ఆడది యిలాంటి వెలితికి లోనుకావచ్చన్నది నా అభిప్రాయం."

టాయి. దానికి కారణం వ్యక్తిగతమైన అభిరుచులు. మెటీరియలిస్టిక్‌గా ఆలోచిస్తున్నాననుకోకు చాలా దాంపత్యాలు దెబ్బతినేది యీ అభిరుచుల విషయంలోనే. 'టు గెదర్‌నెస్ ఐడియల్' అంటే ఒకరి అభిరుచుల్ని మరొకరు చంపుకుని బ్రతకడం కాదు. అడ్జస్టు కావడం. ఉదాహరణకి నీకు ఫిలాసఫీ చదవటం యిష్టం. మీ ఆవిడకి ఇంగ్లీషు నవల్సు చదవాలని ఆసక్తి ఇద్దరికీ చదవడమనే ఆసక్తి కామన్ అయినా చదివే సబ్జెక్టులో వైవిధ్య ముంది. ఆవిడ్ని అవే చదవనీయక, నీ ఫిలాసఫీ బుక్స్ చదివించాలని తాపత్రయపడకు. అలాగే ఏ భార్యయినా తను వంట చేసేప్పుడు భర్త సహకరించాలని కోరుకోవాలే తప్ప మొత్తం వంటే అతడిచేత చేయించాలని ఆలోచించకూడదు. లేదు నేను అనుకున్నట్టె నా భర్త ప్రవర్తించాలనే భార్య తన సుఖాన్ని మాత్రమే కాక భర్త ప్రశాంతతనీ ధ్వంసం చేస్తుంది...అసలు ఆడది కోరుకుంటే మాత్రం భర్త అంగీకరిస్తే మాత్రం పిల్లల్ని తొమ్మిది నెలల పాటు కడుపులో మోయటం మగాడికి సాధ్యమైన విషయమేనా శ్రీహర్షా. అది అసంభవంగా....అలాంటప్పుడు 'ఫిఫ్టీఫిఫ్టీ మేరేజ్ సూత్రం' అన్నది స్పిరిట్ పంచుకోవటానికే తప్ప బాధ్యతల్ని పంచుకోవడంలోనే అని ఏ భార్య అయినా ఎందుకు ఆలోచించాలి."

"కాని" అంతసేపూ ప్రమీల తర్కాన్ని నిశ్శబ్దంగా విన్న శ్రీహర్ష నిర్లిప్తంగా అన్నాడు "ఇందాక నేను చెప్పిన దంపతుల్లోని భార్య పాత్ర ఆలా సగం బాధ్యతల కోసం భర్తని వేధించే తత్వం లేనిది....ఒద్దికగా భర్త చెప్పింది మాత్రమే వింటూ అతడి సేవలతోనే జీవితాన్ని వెళ్ళమార్చా లనుకునే వ్యక్తి. అలాంటి స్త్రీని మోసం చేయడం దారుణం కదూ."

"అదిగో 'మోసం' అంటూ మళ్ళీ ఇంకొకటి పదాన్నే వాడుతున్నావు. అపొరెంట్‌గా సరిపి మోసంలా అనిపించినా నిజానికి అది అవసరం శ్రీహర్షా....దాహం వేసే మనిషికి కావాల్సింది దప్పిక తీర్చే నీళ్ళు తప్ప అన్నం పెట్టడం కాదు....అలా చేస్తే ఆమె అతడికి ఏది కావాలో అది అందించటంలో విఫలమైనట్టే. ఆ వైఫల్యం ప్రేమను ఎక్స్‌ప్రెస్ చేయడంలో కావచ్చు. లేదా సెక్స్‌లో కావచ్చు."

ఇబ్బందిగా చూశాడతను.

"ఆడపిల్లలా అలా తెల్లమొహం వేసి చూడకు శ్రీహర్షా! దాంపత్యంలో శృంగారం అంటే ఏ ఒక్కరి మూలంగానో జరిగే చర్య కాదు. ఇస్తూ పుచ్చుకునేది. తీసుకుంటూ యిచ్చేది. అంటే యిచ్చే వ్యక్తిలో తీసుకోవాలనే ఆసక్తినీ కలిగించాలి. తీసుకునే వ్యక్తిలో యింకా యివ్వాలనే ఆసక్తినీ పెంపొందించాలి. ఇలా ఎందుకు చెబుతున్నానూ అంటే చదువుకున్న చాలామంది అమ్మాయిలు సైతం శృంగారంలో స్తబ్దతనే పాటిస్తారన్న విషయము నాకు తెలుసు కాబట్టి. అది ఓ కళ....ఆ విషయం తెలిసినా చాలా మంది అమ్మాయిలు పార్టిసిపేట్ చేయటానికి సుముఖంగా వుండరు. దానికి కారణం పెరిగిన వాతావరణం కావచ్చు. లేదా అనాదిగా సాంప్రదాయాలు అందించిన బిడియం కావచ్చు. కానీ ఆ స్థితిలో భర్త ఏదో మిస్సయిపోయామనే బాధకి లోనవుతుంటాడు అతడు కోరుకున్నది భార్య నుంచి దొరకనప్పుడు అలా అందించే అమ్మాయి కోసం అర్రులు చాస్తాడు. ఇది వైస్ వెర్సా కూడా. అంటే కేవలం భార్యలకే సంబంధించింది కాదు. మగాళ్ళ పరంగా కూడా ఆడది యిలాంటి వెలితికి లోనుకావచ్చన్నది నా అభిప్రాయం."

"అంటే?" శ్రీహర్షలో తెలియనితనమే తప్ప ఆమె ఆలోచనల్ని ఖండించాలని కాదు. అందుకే విడియంగానైనా అడిగేయగలిగాడు. "భార్య స్థానంలో వున్న స్త్రీ మగాడి నుంచి ఓ ప్రత్యేకమైన శృంగారం కోరుకుంటుందా?"

"ఏం...." నవ్వేసింది ప్రమీల బుద్ధిమంతుడైన స్కూలు పిల్లాడిలా మాట్లాడుతున్న శ్రీహర్షని చూస్తూ "ఇస్తూ కూడా తీసుకోవాలనే ఆసక్తికి ఆమె లోనుకాదా? పమెల్లా బ్రోక్ అనే ఓ థెరపిస్ట్ రాసిన పుస్తకం చదివాను శ్రీహర్షా! అదీ మావారు తెచ్చిచ్చిందే....అందులో ఆవిడ చెప్పిందేమిటో తెలుసా....? సెక్స్‌ని, దాంపత్య జీవితాన్ని వేర్వేరు కంపార్ట్‌మెంట్స్‌గా భావించే భర్త దగ్గర భార్య సుఖపడలేదని ఆదిలో నాకు అదీ ఎబ్బెట్టుగా అనిపించినా ఆ తర్వాత క్రమంగా అర్థమైంది..... ఆడపిల్లలకి కొన్ని సెక్సువల్ ప్రిఫరెన్సెస్ వుంటాయి. ఆమె బాహాటంగా అంగీకరించలేకపోవచ్చు. కానీ యిది నిజం....అసలు సెక్స్ మొదలయ్యేది బెడ్‌రూంలో కాదు. అది వంటగదిలో ప్రారంభం కావచ్చు. డైనింగ్ టేబుల్ దగ్గర పరాకాష్ఠకి చేరొచ్చు. ఆఫీసులో నుంచి భర్త ఫోన్ చేసి అల్లరిగా మాట్లాడితే ఆ కన్‌ఫర్ట్‌లో నుంచి అతడు కావాలనిపించే ఆలోచనకి దారితీయొచ్చు. ఇప్పుడు కాదు ఈసారి చెబుతాను."

"ఏమిటి?"

"భర్త నుంచి భార్య కోరుకునే అయిదు శృంగార సూత్రాల గురించి."

వెంటనే వినాలని వున్నా రెట్టించలేకపోయాడు.

అసలు ఈ చర్చే అవోలా అనిపిస్తుంటే ఆలోచనల మధ్య నిశ్శబ్దంగా వుండిపోయాడు.

అంటే....

శంకర్ అలా బరితెగించటానికి సీతలోని లోపయే కారణమై వుంటుందా?

దాంపత్య బంధం ఇంత బలహీనమైతే అసలు ఈ సాంప్రదాయాలకి నైతిక విలువలకి అర్థం ఏమిటి?

పుస్తక పరిజ్ఞానమే తప్ప ప్రపంచ జ్ఞానం అంతగా లేని శ్రీహర్ష యిక్కడ యిలా ఆలోచిస్తున్న సమయానికి మరెక్కడో నిర్ణయ చాలా షాక్లోనయింది.

కారణం ఏదన్నా కాని శ్రీహర్ష దాంపత్య జీవితంలో అతడు కోరని మరో కొత్త అధ్యాయానికి ప్రారంభం జరిగిపోయింది.

* * * * *

ఉలికిపాటుగా నిద్రలేచింది నిర్ణయ.

గదిలో బెడ్లైట్ కాంతి....గెస్టుహౌస్ చుట్టూ చీకటి....నగరం నిద్దుమణిగిన సూచనగా అంతటా నిశ్శబ్దం.

అప్పుడు చూసుకుంది....

తన ఒంటిపై చీర చెదిరి ఉంది అస్తవ్యస్తంగా.

బ్లౌజ్ హుక్స్ తెగిపోయి వున్నాయి.

ఏం జరిగిందీ అర్థం కావటానికి అట్టే వ్యవధి అవసరం లేకపోయింది.

శరీరంలో బడలిక....బడికాదు....చిత్తడి నాకిలిగా అనిపిస్తున్న నగ్న దేహం....ఎల్లలు పగిలిన అస్పష్ట జ్ఞాపకాల హాసేలీతో లొప్పుతున్న మనసు....దోపిడీకి గురైన ఆకు పచ్చని యవ్వనం....మైలపడిన గిరి చరులా....మెలితిరిగిన కొండదారులా.

ఏమిటిది? ఎలా జరిగింది?

చెరువుపై కమ్ముకున్న పొగమంచులాంటి నిస్త్రాణని విదిల్చుకుంది.

లేవబోతూ తూలింది. తూలిపోతూ పైకి లేచింది.

తెలియకుండా రాలిన ఓ కన్నీటి బొట్టు నిస్సత్తువుగా ఆమె పాదం క్రింద నలిగిపోగా ఆవేశంగా గదిదాటి బయటకువచ్చింది.

ఎక్కడ....శ్యాం కనిపించడేం—ఇంత దారుణం చేశాడేం?

పక్కగదిలోకి వచ్చింది.

శ్యాం పారిపోలేదు. ఉన్నాడు ఆ గదిలోనే.

నిద్ర పోతూ కాదు. స్మోక్ చేస్తూ కిటికీ దగ్గర నిలబడి బయట చీకటిలోకి చూస్తున్నాడు.

క్షణంపాటు అతడిపై కలియబడి రక్కి చంపాలన్నంత ఉద్వేగంగా అనిపించింది.

అసలు....ఇంతటి సాహసం ఎలా చేయగలిగాడు.

"బా....స్ట....ర్డ్"

ఉక్రోషంగా అరవబోయింది కాని నిద్రపోతున్న ప్రపంచానికి వినిపిస్తుందేమో అన్న భయంతో క్రోధాన్ని గొంతులో అదిమిపెడుతూ ఆగిపోయింది.

"ఎందుకు?"

ఆమె చెంపలపై ఓ నీటి బొట్టు జారింది.

అసలు మీ నుంచి కోరింది కేవలం అనుభవమే అని ఎందుకనుకుంటు న్నారు. మీ మాటల్లో, పరిచయంలో, కదలికల్లో నేను నూరుశాతం కోరు కున్న అమ్మాయిని చూశాను. ఎప్పటికైనా మీతో శారీరకంగా కలవనినాడు నా జీవితమే వృథా అనుకున్నాను. ఇంత కాలానికి అవకాశం తీసు కున్నాను."

"కాని—" అతడ్ని ఏం చేయాలో ఏం చేస్తే తన కసి చల్లారు తుందో ఆమెకి తోచడంలేదు. "నేను పెళ్ళయిన ఆడదాన్ని."

"అది నా ప్రేమకి అభ్యంతరం ఎలా అవుతుంది....." టక్కున అన్నాడు. "అవును నిర్ణయా....యూ ఆర్ మై డ్రీమ్‌గర్ల్....నువ్వు మరో వ్యక్తికి భార్యవి కావచ్చు. తాళి కట్టించుకున్నందుకు ప్రతిరాత్రి అతడితో ఫిజికల్‌గా కలుస్తుండొచ్చు. అలా ఫిజికల్‌గా కలుస్తున్నంత మాత్రాన అది ప్రేమ కాదుగా. కేవలం పెళ్ళే అవుతుంది. పెళ్ళి అందించిన సాంప్రదాయ బద్ధమైన అవకాశం అనిపించుకుంటుంది. కాని మన పరిచయం అలాకాదు. నిర్ణయా—ఇట్స్ డిఫరెంట్ అటాచ్‌మెంట్. కాబట్టే నాతో మాట్లాడటానికి నా మాటలు వినడానికి నాతో కలిసి తిరగటానికీ నువ్వు ఉత్సాహపడ్డావు. ఇది ఓపెన్‌గా నువ్వు అంగీకరించలేవు. ఎందుకంటే సంఘం అంగీకరిం చదు కాబట్టి. ఇక్కడ సంఘమనే అడ్డుగోడ అడ్డంలేకపోతే ఆ మత్తుమందు అవసరం లేకుండా నువ్వే నన్ను అడిగేదానివి. కారణం నువ్వు కాస్త అడ్వాన్స్‌డ్ సొసైటీకి చెందిన అమ్మాయివి కాబట్టి—అయినా—" క్షణం ఆగేడు. "నువ్వు ఓ మామూలు తెగకి చెందిన ఆడపిల్లలా అలా కుమిలి పోవడం నేనూహించలేకపోతున్నాను."

"ఏం చేయమంటావ్?" అతదు ఒక్క అనుభవంతో ఏకవచనంతో సంబోధించడం మొదలు పెట్టాడన్న కోపంతో అంది నిర్జయ కూడా "నీ సాహసానికి అభినందించి నేనంటే నీకింత యిష్టమా అని కావలించుకో మంటావా? లేక ఈ సారి నుంచి మత్తుమందుతో పనిలేదు. మామూలుగా నాతో యిలాంటి వ్యవహారానికి సిద్ధపడొచ్చని హామీ యివ్వమంటావా?"

"ఖచ్చితంగా అవునంటాను నిర్జయా. జరగాల్సింది ఎలానూ జరిగింది కాబట్టి యిక మనం యిలా కాలయాపన చేయకుండా సుఖంగా బ్రతుకుదాం అంటాను."

"అసంభవం."

"ఏం?"

"మిస్టర్ శ్యాం. నువ్వు మాటలతో ఎంత జోకొట్టినా నేను ప్రేమించింది నిన్ను కాదు. నా భర్తని మాత్రమే."

"ఎందుకు మభ్య పెడతావ్" నవ్వేశాడు "మీ మధ్య సయోధ్యలేదని నాకు ముందే తెలుసు నిర్జయా....ఎలా అని అడక్కు....అదంతే....నువ్వు నీ భర్తని ప్రేమించింది ఒకనాడు. ఆ ఒకనాటి ప్రేమ మిమ్మల్ని పెళ్ళిదాకా లాక్కొచ్చింది. అయినా ఏం సుఖపడుతున్నావు? కోరిన మనిషితో కలిసి బ్రతకడమే సుఖమని నన్ను ఓదార్చాలని ప్రయత్నించకు నిర్జయా. నువ్వు కోరే సుఖం వేరు—అది నాలాంటివాడు అందించేది. ఇది నీకెలా తెలుసూ అంటే నా జవాబు ఒక్కటే. యూ ఫీల్ లైక్ బీయింగ్ హై సైడ్. నీ స్టేటస్‌కి తగ్గ జీవితం."

ఆమె అతడితో వాదించలేకపోతూంది.

వాదించలేక కాదు....వాదించాలనిపించక.

ఇంతకాలం తన ప్రవర్తనతో అలా ఆలోచించే అవకాశం యిచ్చి నన్న భావమో లేక నిజంగా తను అలా ఆలోచించానేమో అన్న బాధో అతడి మాటల్ని ఖండించలేకపోతూంది.

"నిర్మలా!" నిశ్శబ్దంగానే నేల చూపులు చూస్తున్న ఆమెతో అన్నాడు శ్యామ్ దృఢంగా. "ఇప్పుడు నువ్వు కావాలీ అనుకుంటే నన్ను పోలీసులకి అప్పచెప్పగలవు. నిన్ను నీ అనుమతి లేకుండా అనుభవించానన్న అభియోగంతో నన్ను కటకటాల వెనక్కి నెట్టగలవు. కాని దానివలన నువ్వూ చాలా కోల్పోతావ్. ఓ మధ్యతరగతి భర్త చెడిన ఆడదాన్ని ఇక భార్యగా స్వీకరించలేకపోవడం ఒకటైతే ప్రేమా దోమా అంటూ మమ్మల్ని కాదని వెళ్ళి ఏం సాధించావ్ అని మీ తల్లిదండ్రులు నిలదీస్తే జవాబు చెప్ప లేకపోవడం మరొకటి. ఓకె....వాటితో నీకు పనిలేదూ అనిపిస్తే నీకు తోచి నట్టు నన్ను శిక్షించు."

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

ఎందుకు మనసుతో బాటు శరీరమూ ఇంతలా దహించుకు పోతూందో ఆమెకు అర్థం కావడంలేదు.

'శీలం' అన్నది మధ్యతరగతి అమ్మాయికే కాదు ఏ స్థాయి ఆడపిల్ల అయినా అపురూపంగా కాపాడుకోవాల్సిన అతి ముఖ్యమైనదని ఆమెకు అని పిస్తుంటే నిశ్శబ్దంగా ఉండిపోయింది.

అదికాదు....ఇందాక అతడన్న మాటలూ ఆమెను చాలా ఆందోళ నకి గురిచేశాయి.

జరిగింది తెలిస్తే లోకం మాట అటుంచి ముందు శ్రీహర్ష తనను అంగీకరించలేడు.

అంతకుమించి తన తల్లిదండ్రుల ముందు తను చులకనై పోతుంది.

అంతేకాదు కలిసి ఎగ్జిబిషన్‌కి వెళ్ళినంత మాత్రాన స్కేండల్స్ ప్రచారం చేసిన ఫేక్టరీ ఎంప్లాయీస్ ఇదో గొప్ప అవకాశంగా తీసుకుంటారు.

"నిర్లమా!" ఆమె మౌనం శ్యాంకి చాలా బాధాన్నిచ్చిందేమో నెమ్మదిగా ఆమెను సమీపించి చేతులు పట్టుకున్నాడు. "ఇందులో నిజానికి నీ ప్రమేయం లేకపోయినా బాధ్యత అంతా నాదే అయినా మానసికంగా నిన్ను చాలా ఆందోళనపరిచానని అర్థమైపోయింది. అందుకు నన్ను క్షమించు."

ఆమె జవాబు చెప్పలేదు.

అతడి స్పర్శనీ చూడలేదు.

మౌనంగా చూస్తూంది.

అయిపోయింది....ఆ విషయం ఆమెకూ అర్థమౌతూంది. నూరేళ్ళు నిబ్బరంగా కలిసి నడవాలని ఎంత సాహసం చేసి దాంపత్య జీవితంలో అడుగుపెట్టినాగాని ఇప్పుడు జరిగిన సంఘటనతో సర్కస్‌లో బంతిపై నడకగా మారిపోయింది.

ఏంచేయాలో తెలీదు.

ఎవరికీ చెప్పుకోలేని తన స్థితి గురించి ఆమె ఆలోచిస్తుండగానే శ్యామ్ ఆమె చేతులు విడిచిపెట్టాడు.

అప్పుడు చూసింది అతడి కళ్ళలోకి.

ఇంకోసారి అవకాశం తీసుకోవాలన్న ఆలోచన కనిపించలేదు.

నిజాయితీగా చూస్తున్నాడో లేక అలా అనిపించిందో ఆమెకే తెలీదు.

"నిర్లమా....ఒక్క విషయం గుర్తుపెట్టుకో—నాకు ఈ సంఘంతో పనిలేదు. సాంప్రదాయాలంటే అంతకన్నా గౌరవం లేదు. కాని నువ్వంటే

మాటల్లో చెప్పలేనంత యిష్టం వుంది. ఆ ఇష్టం మరెప్పటికైనా ఇలాగే వుంటుంది. జరిగింది నువ్వు జీర్ణించుకోలేని విషయమే అయితే దానికి నేను చెప్పేది ఒక్కటే....నువ్వు కావాలీ అనుకుంటే నిన్ను నేను భార్యగా స్వీకరిస్తాను."

అవాక్కయినట్టుగా చూసింది.

"అదెలా సాధ్యమో నాకు తెలీదు నిర్మలా....కాని నువ్వు సరేనంటే దానికీ నేను సిద్ధమే."

పెదవులపై పులుముకున్న హాలాహలాన్ని తెలివిగా ఆమె గుండె పొరల్లోకి నెడుతూ తలవంచుకుని నిలబడ్డాడు.

నిర్మలని పూర్తిగా ఓడించిన క్షణమది.

* * * *

ఉదయం తొమ్మిది గంటల వేళ—

ఆఫీసుకి బయలుదేరబోతున్న శ్రీహర్ష ద్వారం దగ్గర ఎదురైన శంకర్‌ని చూస్తూ ఆశ్చర్యపోయాడు.

నిన్న చూసిన సంఘటన శ్రీహర్ష నింకా కలవరపెడుతున్నా మొహంలో అలాంటి భావం కనిపించనివ్వలేదతడు. "రా...."

సాదరంగా లోపలికిఆహ్వానించబోయిన అతనితో అన్నాడు శంకర్. "నీతో మాట్లాడాలి—అలా బయటికి వెళ్దాంరా."

అర్థంకానట్టుగా చూశాడు శ్రీహర్ష "ఇంట్లో నిర్మల లేదు. ఇక్కడే మాట్లాడుకుందాం."

ఆమె ఏమైందీ ఎక్కడికి వెళ్ళిందీ అడగలేదు శంకర్.

అసలు అదంతా అడిగే మూడ్‌లో లేదు.

నిన్న సాయంకాలం శ్రీహర్ష గెస్టుహవుస్‌కి వచ్చి వెళ్ళిన విష యాన్ని వాచ్ మెన్ ఆలస్యంగా చెప్పాడు శంకర్‌కి.

అప్పటినుండీ గిల్టీగా వుంది.

అసలు రాత్రే ఇంటికివచ్చి మాట్లాడాలనుకున్నాడు.

గెస్టుహవుస్‌దాకా వచ్చినవాడు మాట్లాడకుండా వెళ్ళిపోయాడూ అంటే తనను గురించి చాలా తెలుసుకున్నాడని అర్థమైపోయింది.

వ్యాపారంలో చాలా అబద్దాలు చెప్పడం ఓ అర్హతైనా అలాంటి అర్హత శంకర్‌కి పుష్కలంగా వున్నా శ్రీహర్ష దగ్గర అలా ఉండలేదు. కారణం ఈ శతాబ్దంలో ఉండకూడనివాడు శ్రీహర్ష అన్న భావం, అంతకు మించి అతడితో స్నేహం.

దేవుడ్ని తరచూ ధ్యానించకపోయినా కనీసం దేవుడ్ని నమ్ముతున్నా నన్న భావం ఆస్తికుడైన మనిషికి చాలా ధైర్యాన్నిస్తుంది.

శ్రీహర్ష విషయంలో అలానే ఫీలవుతుంటాడు శంకర్.

తనకో కేరెక్టరు లేకపోయినా కేరెక్టర్‌కి నిర్వచనంలాంటి శ్రీహర్ష తనకు ప్రాణస్నేహితుడన్న ఆలోచన శంకర్‌కి తరచుగా తృప్తినిచ్చే విషయం.

"నిన్న గెస్టుహవుస్‌కి వచ్చావట" ముందు శంకరే కదిపాడు. "వాచ్ మెన్ నిన్ను చూశాడట...."

అంతే తప్ప 'నువ్వేం చూశావ్' అని అడగలేదు. కాదు....అడిగే సాహసం చేయలేకపోయాడు శంకర్.

శ్రీహర్ష నేలచూపులు చూస్తున్నాడు.

అదే శంకర్‌ని మరింత బాధ పెట్టింది.

అక్కడికి తనే ఏదో తప్పు చేసినట్టు శ్రీహర్ష తల వంచుకున్నాడు. ఒకవేళ తనలాంటివాడికి స్నేహితుడైనందుకు విడియంగా వుందా?

"నన్నెందుకు కలవలేదు?" అడిగాడు శంకర్.

శ్రీహర్ష జవాబు చెప్పలేదు. ఆ మౌనం మరింత రెచ్చగొట్టిందేమో ఉడుకుమోత్తనంలా రెట్టించాడు శంకర్. "ఏరా....ఆ విషయం చర్చించడం నీచంగా అనిపిస్తూందా?"

అప్పుడు తల పైకెత్తి చూశాడు శ్రీహర్ష.

అదీ అరక్షణంపాటే—

"శంకర్!" శ్రీహర్ష గొంతు ఆర్ద్రమైపోయింది. "నేనో మామూలు మనిషిని—ఒక్క మాటలో చెప్పాలి అంటే నీమీద ఆధారపడి బ్రతుకు తున్నవాడ్ని. ఒకవేళ నువ్వు నీ ప్రవర్తనతో నన్ను బాధపెట్టినా జీర్ణించు కుంటానే తప్ప నిన్ను నిలదీసే హక్కెక్కడిదని?"

కంపించిపోయాడు శంకర్.

చాలా సున్నితంగానైనా దారుణంగా గాయపరిచాడు శ్రీహర్ష.

"నిజమే....నేను గెస్టుహవుస్‌కి వచ్చాను నీతో అర్జెంటుగా మాట్లాడా లని చూడకూడనిది చూశాను. రాకూడని వేళ వచ్చాననుకుంటూ వెనక్కి మరలాను."

"అంతే తప్ప...." రోషంగా అడిగాడు శంకర్ "నీకు నామీద కోపం రాలేదంటావ్?"

"చెప్పానుగా శంకర్—వచ్చినా నిలదీసే హక్కు నాకు లేదని"

"ఒరేయ్" శంకర్ ఉద్వేగ్నంగా చూశాడు. "నువ్వలా మాట్లాడకు. అలా మాట్లాడితే నేను తట్టుకోలేను."

"అలా బాధ పడాల్సింది నా గురించి కాదు శంకర్....ఇది తెలిస్తే తట్టుకోలేని నీ భార్య గురించి...." మృదువుగా అన్నాడు శ్రీహర్ష. "నిజం శంకర్....ఈ విషయంలో నిన్ను కన్విన్స్ చేసే అందమైన భాషని నేను వాడలేకపోవచ్చు....కాని యీ నిజం తెలిస్తే అందరికన్నా ఎక్కువగా కుమిలిపోయేది నీభార్య మాత్రమే....ఎందుకిలా చెబుతున్నానూ అంటే ఆవిడ నిన్నెంతగా నమ్మేదీ నాకు తెలుసు కాబట్టి....దాంపత్య జీవితం నిలబడేది నమ్మకాల ప్రాతిపదికపైనే అన్న విషయం కరెక్టో కాదో నాకు తెలియదు కాని కలిసి బ్రతుకుతున్న భార్యాభర్తలు ఖచ్చితంగా పాటించాల్సిన నైతిక విలువల గురించి బలంగా నమ్మతాను శంకర్....బహుశా యింతకు మించి ఆలోచించగలిగే శక్తి నాకు లేకపోవచ్చు. అందుకు నువ్వు నన్ను క్షమించాలి."

శంకర్ మాట్లాడలేదు....

అది అద్భుతమైన విశ్లేషణ కాకపోయినా శ్రీహర్ష మాటలు చాలా బలంగా పనిచేశాయి.

ఇలా సుతి మెత్తగా కాక తను చేసింది తప్పని బలంగా ఆర్గ్యూ చేస్తే సంతోష పడేవాడేమో.

"వెళదామా?" అడిగాడు శ్రీహర్ష.

"నా పరంగా ఏదీ వినాలని నీకు అనిపించడం లేదా"

నవ్వేశాడు శ్రీహర్ష. కాని ఆ నవ్వులో జీవం లేదు బాధ తప్ప....

"నేనూ పెళ్ళయిన తర్వాత చాలా రోజులు నిజాయితీగానే వున్నాను"

శ్రీహర్షకి సంజాయిషీ నచ్చలేదు "ఆ మాత్రం చాలంటావా?"

"దాంపత్యమంటే కేవలం భర్త మాత్రమే కాదు భార్య సైతం విధిగా పాటించాల్సిన విషయాలు కొన్ని వుంటాయి శ్రీహర్షా.... వాటిలో ఘోరంగా విఫలమైంది సీత.... అసలు భార్యంటే అణకువగా అన్నీ చేసుకుపోయే పనిమనిషి కాకూడదు.... స్నేహితురాలు కూడా కావాలి.... నా ఆలోచనల్లో, అభిరుచుల్లో తనూ పాలు పంచుకోవాలి...."

ఏం ఆశించి శంకర్ యిదంతా చెప్పుకుపోతున్నాడో అర్థం కాలేదు శ్రీహర్షకి "ఆ మేధస్సు అందరి అమ్మాయిలకీ వుండదు శంకర్."

"ఉండనప్పుడు చెబితే అర్థం చేసుకోవచ్చుగా"

"అర్థమయ్యేట్టు చెప్పాలిగా"

"చెప్పలేదని నువ్వెందు కనుకుంటున్నావు?"

ప్రశ్నార్థకంగా చూశాడు శ్రీహర్ష "నిజం చెప్పాలీ అంటే మీ ఆవిడ నా భార్య నిర్మలకన్నా సాత్వికురాలు అవునా?"

"అయితే?!"

"నువ్వు చెప్పింది అర్థం చేసుకోకుండా ఎలా వుంటుంది."

అసహనంగా చూశాడు శంకర్ "నేను మరీ కథల్లో, నావెల్స్‌లోని భర్తల్లా అపురూపమైన కోరికలేం వ్యక్తం చేయలేదు శ్రీహర్షా...."

అరక్షణం మౌనం తర్వాత చెప్పుకుపోయాడు శంకర్ "సీతని కట్టుకున్నాక వ్యాపారంలో చాలా ఎదిగాను. కాబట్టే సీతని అమితంగా ప్రేమించే వాడ్ని. సీతని మాత్రమే కాదు ఆమె బంధువుల్ని కూడా. అదే బహుశా నేను చేసిన పొరపాటు కూడా."

నిర్లిప్తంగా చూశాడు శ్రీహర్ష.

"మా యిద్దరు బావమరుదుల్ని చూశావుగా.... ప్రస్తుతం మా యింటి లోనే వుంటున్నారు."

"అవును. అయితే"

"ఆ యిద్దరికీ పెళ్ళయింది. పెద్దవాడికైతే పిల్లలూ వున్నారు. అనా యిద్దరికీ బాధ్యతలు తెలీదు.... దేవార్సుగా యింట్లో సెటిలై పోయారు. పనీ పాటా లేకుండా యింట్లో నెలల తరబడి వుండటం ధ్యేయంగా పెట్టు కున్నారు.... ఎందుకంటే నేను సంపాదిస్తున్నాను కాబట్టి. తిండికి ఏ లోటూ లేదు కాబట్టి."

"వాళ్ళుండటానికి నువ్విలా తిరగటానికి సంబంధ మేమిటి?"

"నీకు అర్థం కాదు శ్రీహర్షా...." నిట్టూర్పులా ఆగేడు క్షణం పాటు....

దాంపత్యమంటే నాకు కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయాలున్నాయి. నన్ను అమితంగా ప్రేమించే భార్య నాకు మాత్రమే సేవలు చేయాలని, సేవలు కాకపోయినా కనీసం నా మీదనే ఎక్కువ శ్రద్ధ చూపించాలని అను కోవటం నేరం కాదుగా. ఇలా మాట్లాడుతున్నందుకు నవ్వకోకు శ్రీహర్షా. ఆరు లక్షలు పెట్టి నేను కట్టించిన యింటిలో నేను అద్దెకుంటున్నట్టుగా బ్రతకాల్సి వస్తూంది. నేను కోరుకునే ప్రైవసీ లేదు. ఏకాంతంగా వున్న నా భార్య దగ్గర నేను చిలిపిగా చేసే అల్లరికి అవకాశం లేదు. ఎందుకంటే మా బావమర్దులు ఎప్పుడూ యింట్లోనే వుంటారు. పోనీ ఏదన్నా చిన్న ఉద్యో గం చూపించి వేరే యింటిలో వుంచుదామా అంటే ఆ సంపాదనతో మేం ఎలా నెగ్గుకురాగలమూ అంటూ నిలదీయడాలు.... ఇలాంటి స్థితిలో నా కుటుంబాన్ని నేనెలా చక్కదిద్దగలను శ్రీహర్షా. ఆడదానిగా నా మనసుని తాను అర్థం చేసుకోవాలి. నన్ను పరోక్షంగా సాధిస్తున్నది తన తమ్ముళ్ళు కాబట్టి తనే ఎక్కువ ఇన్‌ఫియేటివ్ తీసుకోవాలి. అప్పటికీ అదే మాట నేను

పాలాపోర్లు అన్నాను కూడా. దానికి సీత ఏమంటుందో తెలుసా? మా తమ్ముళ్ళు బాధపడతారండీ అని.... అలాంటప్పుడు నేను కోరుకున్న జీవితాన్ని నేను వెదుక్కుంటేనేం?"

శ్రీహర్ష ఏకాగ్రతగా విన్నాడు శంకర్ చెప్పిందంతా.

కొంత స్పష్టంగా మరికొంత అస్పష్టంగా అనిపించినా మొత్తానికి శంకర్ కూడా అనోలాంటి అశాంతికి గురయ్యే యిలా చేస్తున్నట్టు తెలిసిపోయింది.

సరిగ్గా యిలాంటి ఓ ఆర్గ్యుమెంట్‌తోనే నిన్న రాత్రి కూడా ప్రమీల అతడ్ని కన్విన్స్ చేయబోయింది.

అప్పుడు కాకపోయినా కనీసం యిప్పుడన్నా అంగీకరించాలి.

కాని శ్రీహర్ష అంగీకరించలేకపోయాడు.

మొత్తం అంతా మననం చేసుకుంటే బోధ పడింది ఒక్కటే....

ఈ ప్రపంచంలో ప్రతి మనిషి తన చర్యల్ని సమర్థించుకోవటానికి కొన్ని కారణాలని వెదుక్కుంటాడు....

వాటినుంచి అతడ్ని వెనక్కి మరల్చడం ఆ కారణాలని అకారణంగా అవమానించి మనసు పాడుచేసుకోవడమే.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్" అడిగాడు శంకర్.

"బహుశా నిగ్రహం లేని నేను నా తప్పుని యిలా సమర్థించుకుంటున్నాననుకుంటున్నావ్. కదూ."

నవ్వాడు శ్రీహర్ష.

"ఎందుకు నవ్వుతున్నావ్?"

"ఏదో కథ గుర్తొచ్చింది శంకర్" చెప్పాడు అతను.

శంకర్ అడక్కుండానే "పూర్వం ఎప్పుడో ఓ రాజుగారు బ్రాహ్మణోత్తముల్ని పిలిచి ఓ చిన్న పరీక్ష పెట్టారట.... ఎవరైనాగాని తమ

యిచ్చిన మేకపిల్లకి కడుపునిండా తినిపించగలగాలి. తినిపించాక తన దగ్గరకు తీసుకు రావాలి. ఒకవేళ తన పరీక్షలో మేకపిల్ల కడుపు నిండిందని తను గ్రహిస్తే లక్ష వరహాల బహుమతి. మరో విషయం.... ఆ మేక పిల్లకి తినిపించే గడ్డికి ఆ రాజుగారే పెట్టుబడి పెడతానన్నాడు....అంతే... అక్కడందరికీ ఉత్సాహం కలిగింది.... మేమంటే మేం అంటూ అంతా పరీక్షకి సిద్ధపడ్డారు."

ఈ కథ చెప్పడంలో శ్రీహర్ష వుద్దేశ్యమేమిటో అర్థం కాలేదు శంకర్‌కి "ఆ తర్వాతేమైంది?"

"ముందో పేద బ్రాహ్మణుడు మేకపిల్లని, రాజుగారిచ్చిన గడ్డినీ తీసుకుపోయి సాయంకాలం దాకా గడ్డిని తినిపించాడు అవసరానికి మించి నంతగా....సాయంకాలం రాజుగారి కొలువుకి తీసుకువచ్చి యిక పరీక్షించు కోవచ్చు అన్నాడు. రాజుగారు నిజమా అన్నారు... వెంటనే ఓ గడ్డి పరకని మేకపిల్ల నోటి దగ్గరుంచారు. ఉత్సాహంగా తినేసింది.... ఆకలి తీరిపోతే యీ గడ్డిపరకనెలా తిందంటూ రాజుగారు ఎద్దేవా చేశారు.... అంతే.... లక్ష వరహాల బహుమతి పోయినందుకు ఆ బ్రాహ్మణుడు చాలా కుమిలి పోయాడు.... ఇలా మొత్తం బ్రాహ్మణులంతా ప్రయత్నించి ఓడి పోయారు."

"సహజమే.... ఎందుకంటే ఎంత తిన్నా మేక యింకా తినాలనే అనుకుంటుంది. అది దాని నైజం."

"కాని...." టక్కున అన్నాడు శ్రీహర్ష "ఓ నిరుద్యోగ యువకుడు తను పందేనికి సిద్ధపడతానంటూ ముందుకొచ్చాడు.... ఆ మేకపిల్లని తీసుకువెళ్ళాడు...."

"అందరిలాగే తనూ గడ్డి పెట్టాడా."

"లేదు....మేక ముందు గడ్డిపుంచి అది తినటానికి ముందుకు రాగానే చావగొట్టడం ప్రారంభించాడు. అలా సాయంకాలందాకా చేసి రాజుగారి కొలువుకి వచ్చాడు. రాజుగార్ని పరీక్షించుకోమన్నాడు. లొత్తపడిన మేక పిల్ల పొట్టని చూస్తూ రాజుగారు గడ్డిపరక అందించబోయారు ఎప్పటిలాగే. కాని మేక ముందుకు రాలేదు. ఎందుకంటే అక్కడే నిలబడ్డ నిరుద్యోగి మళ్ళీ బాదుతాడేమో అని. అంతే.... లక్ష వరహాల బహుమతి అతడి సొత్తయింది."

"ఇదంతా నువ్వెందుకు చెప్పినట్టు?" అడిగాడు శంకర్.

"నిగ్రహం అన్నది మేకపిల్ల లాంటిదని చెప్పటానికి"

ఉద్విగ్నంగా చూశాడు శంకర్.

"అంతే శంకర్! ఆ నిగ్రహమే వుంటే ఏ స్థితిలోనూ ఏ వ్యక్తీ తప్పు చేయడు చేసిన తప్పుని సమర్థించుకోడు."

అవాక్కయిపోయాడు శంకర్.

శ్రీహర్షపై కోపం రావేదు. నైతిక విలువలపై అతడికున్న నిర్దిష్ట మైన అభిప్రాయాలకి ఆనందమనిపించింది.

"నిన్ను బాధపెట్టివుంటే క్షమించు శంకర్....జీవితం గురించి నీకు ఉన్నంత అవగాహన నాకు లేకపోవచ్చు. కాని గాయానికి సర్జరీ అవకాశ మున్నప్పుడు అవయవాన్ని నరికేయటం నాకు సమంజసమనిపించదు."

శంకర్‌పై ఆ మాటలు ఎంతగా పనిచేసిందీ తెలియకాని జరిగిందానికి శ్రీహర్ష యిప్పుడు ముందంతగా బాధపడటంలేదని బోధపడింది.

ఒక అలవాటుకి లోనైన వాళ్ళకి ఆ మాత్రం రిలీఫ్ చాలు.

* * * *

ఉదయం పదీ గంటల సమయం....

స్టేషన్‌లో ఆగిన బండిలోనుంచి దిగింది నిర్ణయ శ్యాంతో సహా.

ఆమెలో మునుపటి ఉత్సాహం లేదు. యుద్ధంలో ఓడిన తర్వాత సొంత వూరికి వచ్చిన క్షతగాత్ర అయిన సైనికురాలిలా వుంది.

రద్దీగా వున్న ప్లాట్‌ఫారంపై విజయగర్వంతో నడుస్తూ నిర్ణయతో ఏదో అనబోయిన శ్యాం ఆగిపోయాడు ఎవరో వారించినట్టుగా.

నిర్ణయ అవాక్కయి చూస్తూంది ఎదురుగా నిలబడివున్న శ్రీహర్షని.

"ఫ్యాక్టరీకి ఫోన్ చేస్తే నువ్వీ రైల్లోనే వస్తున్నట్టు తెలిసింది" చెప్పాడు శ్రీహర్ష.

ఆమె గుండె కలుక్కుమంది. అంతకుమించి కంగారుగానూ వుంది. ఇంత జరిగాక యిప్పుడు శ్రీహర్ష ఇలాంటి అలవాటులేని ఫార్మాలిటీస్‌ని పాటిస్తున్నాడేం.

"మీవారనుకుంటాను" తనకు తానుగా జోక్యం చేసుకున్న శ్యాం ఆమె జోక్యంతో పనిలేనట్టు పరిచయం చేసుకున్నాడు. "అయామ్ శ్యాం... మీ శ్రీమతి కొలీగ్‌ని."

మృదువుగా కరచాలనం చేసిన శ్రీహర్ష "నైస్ టు సీ యూ" అన్నాడు. తనకన్నా కొంత అందగాడిలా అనిపించడంతో శ్యాం అతడ్ని చూసి కొంత అసూయపడ్డాడు కూడా.

"ఓకె నిర్ణయా" శ్రీహర్ష సమక్షంలో కూడా ఏకవచనంలోనే సంబోధించాడు శ్యామ్. "నువ్వు ఓ అరగంట యింటిదగ్గర రెస్ట్ తీసుకుని వస్తే ఇద్దరం కలిసి మన టూర్ రిపోర్ట్ సబ్మిట్ చేయొచ్చు."

నిర్ణయ జవాబుని ఆశించకుండా ఓ ఆదేశంలా అనాల్సింది అనేసి వెళ్ళిపోయాడు శ్యాం.

మరో పదిహేను నిమిషాలలో శ్రీహర్షతోబాటు ఇంటికి వచ్చింది నిర్ణయ.

ఆశ్చర్యంగా చూసింది ఇంట్లో అడుగుపెడుతూనే

చాలా మార్పు కనిపించింది.

తొలిసారి కాపరానికి తనను యింటికి తీసుకువచ్చిన భర్తలా ఇంటిని చాలా అలంకరించాడు శ్రీహర్ష. మధ్యగదిలో ఓ సోఫా సెట్టు చిన్న టీపాయ్ దాని మీద ఓ ఫ్లవర్ వాజ్....కిటికీలకి కొత్త కర్టెన్లు....ఏమిటింత మార్పు?

"పరిసరాలు కూడా మనసుపై ప్రభావం చూపిస్తాయని చాలా ఆలస్యంగా అర్థమైంది నిర్ణయా....అందుకే మన సేవింగ్‌లో కొంత డబ్బు యిన్వెస్ట్ చేశాను. నిన్నడక్కుండా చేశానని నీకోపం రాదుగా?"

ఆమె విస్మయంగా చూస్తూంది.

ఇంత వినాశనం తర్వాత ఇలాంటి కన్సర్న్ ప్రదర్శిస్తున్నాడేం.

తనేమిటీ అన్నది తెలిస్తే ఈయనెలా రియాక్టవుతాడు ?

"బాగా టైర్డైనట్టున్నావు....వెళ్ళి స్నానం చేయ్"

అతడికి అభిముఖంగా నిలబడే ధైర్యంలేనట్టు ఆమె నడవబోతుంటే "వన్ మినిట్" అంటూ తనే స్నానానికి బకెట్‌లో నీళ్ళుంచాడు. టవల్‌ని అందించాడు.

"ఈ చీరెలా వుంది" అంటూ కొత్తగా కొన్న చీరని తీసుకొచ్చి ఆమెకు చూపించాడు.

పింక్ కలర్ షిఫాన్ శారీ....చాలా ఖర్చుచేసి కొన్నాడు. నిజానికి ఆమె ఎప్పుడో కొనాలనుకుంటే సేవింగ్స్ పేరిట శ్రీహర్షే ఒకనాడు నచ్చచెప్పి ఆమెను చాలా బాధపెట్టాడు.

ఈ రెండు రోజుల వ్యవధిలో ఇంత హఠాత్తుగా పుట్టిన ఏమిటి....ఈ ఆసక్తి తపన ముందే వుండి వుంటే!

ఆమె కళ్ళు నీటికుండలవుతున్నాయి.

"నీకు ఇష్టమని తెచ్చాను"

ఒకప్పటి మూడ్‌లో అయితే "మీకు నా ఇష్టాలు కూడా తెలుసా?" అంటూ ఉక్రోషంతో అతడ్ని అవమానించేదే.

కాని ఇప్పుడలా అనలేదు....అనటానికి నోరు రాకపోవటమే కాదు. అనటానికి తనకున్న గొప్ప అర్హతని కోల్పోయిన గిల్టినెస్.

ఆమె మౌనంగా టాయిలెట్‌లో అడుగుపెట్టింది.

గోడకి జారగిలబడి పోయింది చాలాసేపటిదాకా....కళ్ళనుంచి ధార కడుతున్న నీళ్ళు....ఇంకా మరపుకిరాని మొన్నటి రాత్రి సంఘటన....తన మీద తనకే జుగుప్సగా వుంది.

అలా ఎంత సేపు మథనపడిందో ఆమెకే గుర్తులేదు.

మరో అయిదు నిమిషాల తర్వాత స్నానంచేసి బయటికి వచ్చింది.

"చీర నచ్చలేదన్నమాట" అన్నాడు శ్రీహర్ష.

"అదేమిటి?" అడిగింది.

"నచ్చితే నేనిచ్చిన చీరనే కట్టుకునేదానివిగా?"

అప్పుడు గుర్తొచ్చింది తను చేసిన తప్పేమిటో. ఏదో ఆలోచిస్తూ శ్రీహర్ష ఇచ్చిన 'శారీ' ని కట్టుకోవడం మరిచి సూట్‌కేసులోని పాతచీరనే ఒంటికి చుట్టుకుంది.

శ్రీహర్ష చూపుల్లోని దైన్యం ఆమెకు భరించశక్యం కాలేదేమో "సారీ" అంది జరిగిందానికి పశ్చాత్తాప పడుతున్నట్టుగా.

"పర్వాలేదు" మృదువుగా నవ్వటమేకాదు చాలా పరవశించిపోయాడు ఆమె అంతగా రియాక్ట్ కావడంతో.

అనుభవంలేని మరో కొత్త ప్రపంచంలో యిప్పుడిప్పుడే అడుగు పెట్టినట్టుగా వుంది శ్రీహర్షకి.

అతడిలోని యీ మార్పుకిగాని మనసునిలా వ్యక్తంచేసి ఆమెను గెలుచుకోవాలనుకోవటానికిగాని కారణం ప్రమీలో, లేక తను చదివిన పుస్తకంలోని సారాంశమో తెలీదుగాని అతడి ఊహలమేరకి నిర్ణయ తనపై చాలా యిష్టాన్ని ప్రదర్శిస్తూంది.

ఇలాంటి క్షణాలు రుచి చూసి ఎంతకాలమైందని....

అసలు ఆమెలోని ఈ మార్పుకి గిల్టీనెస్ అన్న విషయం అతడికి తెలిసే అవకాశం లేదు. తెలిస్తే ఏమైపోయేవాడో.

"నిర్ణయా!"

మనసులో పేరుకున్న చాలా భావాలకి మాటల రూపం ఇవ్వాలని తపించిపోతూ చూశాడు.

అసలు తన మనసుని ఖచ్చితంగా ఆమెకు తెలియచెప్పగలడో లేదో అతనికీ తెలీదుకాని నిజాయితీగా చాలా చాలా చెప్పాలనుకున్నాడు. అది చెప్పటానికి ఇంతకుమించి తరుణం రాదేమో కూడా.

"నిన్ను నేను చాలా మిస్సయిపోయానని ఇప్పుడిప్పుడే అర్థమవుతూంది."

ఏమిటి....ఇన్ని కబుర్లనీ యీ రోజే చెబుతున్నాడేం....తనలో ఏం గమనించాడు....ఈ ఆలోచన ఆమెకు చాలా ఆందోళన కలిగించింది. పరాయి మగాడితో నిజానికి వెళ్ళింది టూర్కైనా అది జుగుప్సాకరమైన మలుపుకి కారణమైంది.

దాన్ని లేచిపోవడమూ అనొచ్చు, లేదా హనీమూన్‌లా గడిపి రావడమూ అనొచ్చు.

ఎంత నమ్మకం తనపై....

"నీ దగ్గర నాకు అరమరికలు వుండాల్సిన అగత్యం లేదు నిర్ణయా. నిజానికి నాకు ప్రేమంటే సరైన అవగాహన లేదు. అందుకే నువ్వంటే చాలా ప్రేమవున్నా అది వ్యక్తం చేయడం చేతకానివాడిలా ప్రవర్తించాను ఇంతకాలమూ. నాలాంటి ఓ సామాన్యుడికోసం నువ్వెలాంటి జీవితాన్ని కాలదన్ని ఇలా వచ్చావో, ఏ స్థాయికి దిగజారి బ్రతకటానికి సంసిద్ధురాలివయ్యావో తెలుసుకున్నాక నీ ఊహలమేరకి ఎదగలేకపోయినా కనీసం కుంచించుకు పోకూడదని ఆలస్యంగా నిర్ణయించుకున్నాను. ఇది మరింత ఆలస్యమైతే ఇంకా ఏం నష్టపోయేవాడ్నో నాకు తెలీదు నిర్ణయా. ఇప్పటికైనా నాకు జ్ఞానోదయమైనందుకు ఆనందపడుతున్నాను."

అతడి గొంతు దుర్ధమైందనుకుందికాని శ్రీహర్ష కళ్ళు కూడా చెమర్చడాన్ని గమనించింది.

అంతే....

ఇక నిభాయించుకోలేనట్టు ఒక్క ఉదుటున అతడ్ని సమీపించింది.
"ఏయ్....ఏమిటిది చిన్నపిల్లాడిలా ?"

ఎందుకో ఆమె గొంతూ పూడుకుపోయింది.

"నా పరంగా నీకు అన్యాయం జరిగిందని నేను అంగీకరిస్తున్నాను నిర్ణయా. ఇకముందు జాగ్రత్తగా వుంటాను."

"ఏమిటా మాటలు ?"

గుండె గొంతుక్కి అడ్డం పడుతుంటే ఆమె కళ్ళు నీటికుండలైనాయి.

"ఇప్పుడేం జరిగిందని ?"

ఏం జరిగిందో ఆమెకే తెలుసు. జరగకూడనిది జరిగింది కాబట్టే ఆమె కూడా ఇంతగా కలత చెందుతూంది.

"భయంగా వుంది నిర్జయా!"

దేనికో ఆమె అడగలేదు.

"నువ్వు లేకుండా నేను బ్రతకలేనని నాకు అర్థమైపోయింది. ఈ రెండు రోజులకే నువ్వు లేని వెలితి నాకు స్పష్టంగా బోధపడిపోయింది."

ఎందుకు దేవుడా....

ఇంత ఆలస్యంగా ఇన్ని మాటలు యితడికి ఎందుకు నేర్పావ్ ?

నేను చేసిన పొరపాటు నాకు మరింత స్పష్టంగా గుర్తుండేట్టు ఎందుకింత కలవరపెడుతున్నావ్....

ఏం కావాలని ఇంతకాలం ఇతడ్ని ఆరడిపెట్టాను.

ఇప్పుడు ఏం దక్కిందని యిలా పశ్చాత్తాప పడుతున్నాను.

అసలు ఈ మనిషెందుకింతలా మారేడు ?

అగ్నిపునీతనైతే తప్ప దరిచేరనివ్వని రాముడిలానూ ప్రవర్తించడం లేదు....అహంకారపు చీకటిలో సుషుప్తికి జారిన అన్మికని మలిచిన లక్ష్మణుడిలానూ అనిపించటంలేదు.

ఏ శాప విమోచనంతోనో జాగ్రదావస్థకి చేరినట్టు ఇంత ఊరటనందిస్తున్నాడేం....?

తెగని ఆమె ఆలోచనలు నేను నీకు తగనయ్యా అని చెప్పాలని తొందరచేస్తున్నాయి.

ఇంటికొచ్చిన తను ఇప్పుడు చేసింది 'మైలస్నానం' అయినా మలిన పడిన తన రక్తాన్ని అతడి హృదయ స్పందన సైతం శుభ్రం చేయలేదనే నిజాన్ని తెలియచేయాలనుంది.

ఇప్పుడెలా....

మామూలు మధ్యతరగతి అమ్మాయిలా మథనపడుతూంది.

ఎంత చదువుకున్నా ఆలోచనల్లో ఎన్ని అభ్యుదయ భావాలు చోటు చేసుకున్నా నైతిక విలువల వరుసల్ని విడిచి పెట్టిననాడు ఓ మధ్యతరగతి ప్రాణి ఎంత కుమిలిపోయేదీ యిప్పుడిప్పుడే తనకి అనుభవమౌతున్నట్టుగా వుంది.

ఆ రోజు యిక ఆఫీసుకు వెళ్ళలేదు శ్రీహర్ష. ఆమెని వెళ్ళనివ్వ లేదు.

దాంపత్య జీవిత గ్రంథంలో కొత్త పుటల్ని తెరిచినట్టు ఎంత చిన్న దైనాగాని యీ సాంగత్యంలోనే చాలా ప్రశాంతత వున్నట్టు కొన్నిగంటల పాటు ఆమెతో మాట్లాడుతూ ఇంకో అధ్యాయాన్ని ప్రారంభించాడు....

ఆమె వూహించలేదు అతడిలో అంతటి భావుకుడు వున్నాడని.

అతడిలోనూ నిద్రాణమైన కోర్కెలకి కొత్త ఊపిరి అందిస్తే సుఖాల నావని ఎంత ఒడుపుగా నడిపేదీ అర్థమైనట్టు ఊపిరి అందని సంతోషంలో ఉక్కిరిబిక్కిరై పోయింది.

రెండోరోజు మూడోనాడూ శ్రీహర్ష ఆఫీసుకు వెళ్ళలేదు.

ఒకప్పటిలా 'ఎక్స్టసీ' పరాకాష్టకి రూపంలా గడిపేసారిద్దరూ.

జీవితం ఇంత మధురమైతే ఇంతకాలం ఇదెందుకు మిస్ చేసుకుంది తను....

మూడురోజుల్లో మొన్నెప్పుడో అయిన గాయం మానిపోయినట్టు యిక బ్రతుకంతా పాడుకునే గేయమే అనిపించేట్టు గడిచిపోతుంటే అంది.

"నేను ఉద్యోగం మానేస్తాను."

ఎందుకూ అనలేదు శ్రీహర్ష.

ఆమెను సంతృప్తిపరచడమే తన జీవిత ధ్యేయమైనట్టు "అలాగే" అన్నాడు.

నిజానికి ఆమె మనస్ఫూర్తిగానే అంది....

సుఖం డబ్బులో లేదని తెలిసిన క్షణాలను రుచిచూసి ఆ నిర్ణయానికి వచ్చిందో లేక ఫేక్టరీ వాతావరణంలో అడుగుపెట్టి ఆత్మన్యూనతా భావముతో అందరిముందూ తిరగడం తనవల్ల కాదని భావించిందో సిన్సియర్ గానే నిర్ణయించుకుంది.

"నేను యిక ఆఫీసుకు వెళ్తాను" అన్నాడు నాలుగో రోజున.

క్షణాల్లా గడిచిన గంటల్ని, రోజుల్ని మననంచేసుకుంటూ "అలాగే" అంది.

శ్రీహర్షలో అలాంటి చైతన్యం ఆమె పూర్వం చూడలేదు.

ప్రేమనే పదానికి ఎంత శక్తినందించే గుణం వుందో అర్థంకాగా ఆఫీసుకు వెళుతున్న శ్రీహర్షతో "సాయంకాలం తొందరగా వచ్చేస్తారుగా. మీకోసం ఎదురు చూస్తుంటాను" అంది.

శ్రీహర్ష వెళ్ళాడు.

అప్పుడు మొదలయింది మళ్ళీ వెలితిలాంటి ఆందోళన.

గట్టుకున్న పారిజాతపు చెట్టులాంటి బ్రతుకు మొన్నె జారిపడింది చెరువులో....పీడలాంటి నీడతో సహగమనం చేసిన శీలం అశ్రుత సంకీర్ణ అపస్వరంలా మారింది.

ఏం చేసింది తను....

మోసగించబడిందా లేక కోరి పతనమైందా....

మొన్నటి సంఘటన నిన్న మరపుకి రాగా ఇప్పుడెందుకు యింతగా కలవరపడుతూంది....

ఎలా మరిచిపోగలదని....

గుండెలోయల్లో నివసించిన ప్రేమ ఏకతారశ్రుతిలామారి పెళ్ళిదాకా పయనం కడితే ఏ పలాయనవాదం తనను పతనంవేపు పురిగొల్పింది....

తను కావాలని పతనమైందా....

కానినాడు పతనాన్ని మోస్తూ జీవనగాలలో జీర్ణించుకుపోయిన వాస్తవాన్ని యీ మూడురోజులయినా ఎలా మరిచిపోగలిగింది....

జరిగింది శారీరకమైన వినాశనమే అన్న భావమా.

అది శారీరకమే అయినా మనసు దాకా విస్తరించలేదా....

కాలింది చితిమంటే అయితే అందులో మైలపడిన శరీరాన్ని కాల్చుకుని ఆహుతైపోక ఇంకా జీవితంపై యింత ఆసక్తిని పెంచుకుంటుందేం?

శ్యాంని తాను కోరుకుంటూందా....

కోరుకోనినాడు అతని గురించి అప్పుడప్పుడైనా ఎందుకు ఆలోచిస్తూంది....

జరిగింది ఘోరమే అయితే అతడు తాకిన శరీరాన్ని కసిగా కోసేయక పెంచుకున్న ఏ పగనో అలా చల్లార్చుకున్నట్టు ఆ రోజు ఎలా ఊరట చెందగలిగింది....

పగ ఎవరిపైన....తనమీదా లేక తనకు సుఖాన్ని అందించని ప్రేమ పట్లనా....

ప్రేమంటే ఎవరు....శ్రీహర్షా....లేక తనా....అదీ కానినాడు యిద్దరూనా....

ఆమె ఆలోచనలనుంచి యింకా తేరుకోలేదు.

తలుపు తట్టిన చప్పుడయింది.

ద్వారం తెరిచిన నిర్ణయ షాక్ తిన్నట్టుగా చూసింది.

శ్యాం స్నేహితుడు నివాస్ నిలబడి వున్నాడు.

"మీరా...."

"ఆఫీసుకి రావడం మానేశారేం" సూటిగా కాదు ఓ అభ్యర్థనలా అడిగాడు నివాస్.

చాలా సేపు జవాబు చెప్పలేదామె.

"ఏం జరిగింది?"

నిజానికి అతడికి జవాబు చెప్పాల్సిన అగత్యంలేదు.

"ఉద్యోగం మానేయాలనుకుంటున్నాను."

"వ్వాట్?" ఆశ్చర్యంగా అడిగాడు.

"యస్....ఇక ఫేక్టరీ మొహం చూడకూడదనుకుంటున్నాను"

"కాని మీరు రెండేళ్ళపాటు ఉద్యోగం మానలేరు. ఎందుకంటే అగ్రిమెంటు రాసేరు కాబట్టి........మానాలీ అంటే కనీసం ఏభై వేలు ఫైన్ కట్టాలి."

నిశ్చేష్టతగా చూసింది. నిజమే "తను ఓ బాండ్ ఎగ్జిక్యూట్ చేసింది. అదీ యిప్పటిదాకా గుర్తులేదు."

"నిర్ణయగారూ....మీరెందుకు యిలాంటి నిర్ణయం తీసుకున్నా నిలదీసే హక్కు నాకు లేదు. కాని మీతోపాటు శ్యాంకూడా మీలాంటి డెసిషన్ తీసుకున్నాడు."

"వ్వాట్?" ఇప్పుడు ఆశ్చర్యపోవడం నిర్ణయ వంతయింది. "శ్యాం కూడా ఉద్యోగం మానేస్తున్నాడా?"

"మానతానని ఖచ్చితంగా చెప్పడంలేదు. కాని మూడురోజులుగా శ్యాం కూడా ఫేక్టరీకి రావడంలేదు. స్నేహితుడిగా అడిగితే ఉద్యోగంపై

ఆసక్తి లేదంటున్నాడు తను కూడా. అదిమాత్రమే కాదు....అలవాటులేని తాగుడికి బానిసైపోయాడు."

ఆమె నమ్మలేకపోతూంది.

"కారణం లోతుగా నేను ఆలోచించలేదు. కాని ఎందుకో మీ విషయంలో చాలా మథన పడుతున్నాడని అర్థమౌతూంది."

ఆమె మొహం వివర్ణమైపోయింది.

"నా విషయంలో అంటే?"

తొట్రుపడిపోయాడు నివాస్.

ఒక పెళ్ళయిన యువతి అందులోనూ చాలా తెగింపుగల నిర్ణయ లాంటి అమ్మాయి యీ స్టేట్ మెంటుతో ఎలా రియాక్ట్ అవుతుందీ తెలియక కాదు.

అసలు జరిగింది శ్యాం మొదటిరోజు ఉత్సాహంగా నివాస్‌కి చెప్పి తన పంతం నెగ్గించుకున్నందుకు చాలా గర్వపడ్డాడు కూడా.

కాని తర్వాత నిర్ణయ ఫేక్టరీకి రాకపోయేసరికి కొస్త ఇబ్బందిగా ఫీలయ్యాడు.

ఒక అమ్మాయిపై గెలుపు కోసం చాలా రకాలుగా ప్రయత్నించి సఫలీకృతుడైన శ్యాం ఆ తర్వాత ఎందుకు ఆమె వ్యామోహంలో కూరుకున్నాగాని నిజంగా నిర్ణయ కోసం పిచ్చివాడైపోయాడు.

ఒకోక్క అనుభవం ఏ మగాడినైనా ఎందుకు ఊబిగా మార్చేదీ ఆ స్థానంలో నిలబడితే తప్ప అర్థంకాని విషయం.

గెలిచాననుకున్న శ్యాం యిప్పుడు ఓడినవాడిలా చిత్రమైన అంతర్మథనానికి గురవుతుంటే నిజంగా ఆశ్చర్యపోయిన నివాస్ ఓ చిన్న ప్రయత్నం చేయాలని యిలా వచ్చాడు.

శ్యాం, నిర్ణయల మధ్య ఏర్పడిన బంధం గురించి మాట్లాడే ధైర్యం లేకపోవడంతో కేవలం శ్యాం పరంగా రెండు మాటలు చెప్పాలని ఒకవేళ ఆమె ప్రయత్నంతో సాధ్యమైతే అతడిలో మార్పుని సాధించాలని యిలా వచ్చాడు....

"మీరు జవాబు చెప్పలేదు" రెట్టించింది నిర్ణయ.

"చెప్పటానికి నా దగ్గర ఏముందని నిర్ణయగారూ....మీకు శ్యాం నిజంగా స్నేహితుడే అయితే అతని గురించి కాస్త ఆలోచించండి. ఇద్దరూ ఒకేసారి ఉద్యోగాలు మాని మీ యిద్దరి గురించీ నలుగురూ నాలుగు రకాలుగా మాట్లాడుకునే అవకాశం కల్పించకుండా కనీసం మీరు ప్రయత్నించండి."

నివాస్ వెళ్ళిపోయాడు అనాల్చింది ఆనేసి.

స్థాణువులా నిలబడిపోయింది చాలా సేపటిదాకా.

ఇది నిజమేనా....

ఓడింది, నాశనమైంది తనయితే శ్యాం ఎందుకంతలా రియాక్టవుతున్నాడు....

అంటే....

తను అతడిపై అంతటి ప్రభావాన్ని చూపగలిగిందా....

మధ్యతరగతి 'మోడెస్టి' ఆమె వివక్షణపై ఇలా 'రూల్' చేయడం దారుణమైనా ఎందుకో ఇలాగే ఆలోచించిందామె....

ఫేక్టరీలో నలుగురూ అనుకోకూడదనుకుందో లేక తన వ్యామోహములో శ్యాం అలా అన్యాయం కావటం సహించని పనిగా భావించిందో అతడ్ని కలుసుకోవాలనుకుంది.

శ్యాం ఆమె వ్యామోహంలో కూరుకున్న మాట నిజమే అయినా ఇలా ఆలోచించిన నిర్ణయ మరో మెట్టు దిగజారింది బాధాకరంగా.

ఒక మగాడి పతనం గెలుపవుతూంది ఒక్కోమారు....కాని పతన మైన ఓ స్త్రీ ఆలోచనలు కోరి జారుడుబల్ల నెక్కే పసికందులా ఆమెను ప్రేరేపిస్తూంటాయి.

ముఖ్యంగా అభ్యుదయ భావాలుగల మధ్యతరగతి ఆడపిల్లలకిది నూరుపాళ్ళ వర్తించే సత్యం.

*  *  *  *

"శ్యాం...."

ద్వారం తెరిచిన శ్యాం అబ్బురంగా చూశాడు.

ఫాలభాగంపై పేరుకున్న స్వేదాన్ని చీర చెరగుతో తుడుచుకుంటూ లోపల అడుగుపెట్టింది నిర్ణయ.

అప్పటికే బాగా తాగినట్టున్నాడు శ్యాం కళ్ళు ఎర్రగా రక్తం ఓడు తున్నట్టుగా వున్నాయి.

నిజానికి నిర్ణయ నివాస్ చెప్పిన రోజే అతడి దగ్గరికి రాలేదు.

రెండు రోజులపాటు ఫేక్టరీకి వెళ్ళింది.

శ్యాం రావడం లేదని గ్రహించి మూడో రోజు మధ్యాహ్నం శలవు పెట్టి యిలా వచ్చింది.

ఫ్లేటంతా కలియచూస్తూ సోఫాలో కూచుంది.

అధునాతనంగా అలంకరించబడి వున్న ఫ్లేట్లో శ్యాం ఒంటరిగా వుండటమే కాదు ఖాళీ లిక్కర్ బాటిల్స్‌తో సగం కాల్చిన సిగరెట్స్‌తో అక్కడి వాతావరణాన్ని అస్తవ్యస్తంగా మార్చేశాడు....

"ఎందుకిలా వచ్చారు" ఉక్రోషంగా అడిగాడు.

బోధపడిపోయింది విర్జయకి.

తను రావడం యిష్టం లేనట్టుగా కాదు యింత కాలం ఎందుకు రాలే దని నిలదీస్తున్నట్టుగా వుంది.

అందంగా అల్లరిగా ప్రవర్తించే ఓ యువకుడు యిక్కడ తనకోసం కృంగిపోవడం ముచ్చటగా వుందో లేక బాధగా వుందో ఆమెకి తెలీదు.

కాని ఆసక్తిగా అతడ్నే చూస్తూంది.

"వయసులో వున్న మీరిలా రావడం మంచిది కాదు."

"బహువచనంలో సంబోధిస్తున్నావ్"

"కాక...." ఉక్రోషంగా చూశాడు "మీమీద నాకున్న అధికారం ఏమిటి?"

"ఏ అధికారంతో ఆ రోజు నాపై అఘాయిత్యం చేశావ్"

"ప్లీజ్" శ్యాం నిజంగానే కలవర పడిపోతున్నాడు "అలా అఘా యిత్యం అన్న పదం వాడొద్దు"

"అఘాయిత్యం కాక దాన్నేమంటారు?"

"అనుభవం"

"నీకు.... కాని అది నాకు మాత్రం నాపై జరిగిన అఘాయిత్యం"

"అదే నిజమైతే ఆ రోజే నన్ను పోలీసులకి ఎందుకు అప్పచెప్ప లేదు."

"ఆడదాన్ని కాబట్టి. ఇంకా బ్రతుకు మీద ఆసక్తి చావలేదు కాబట్టి"

"అంతే తప్ప నా మీద ప్రేమ కాదు"

నిర్వేదంగా నవ్వింది ఆకతాయిగా అనిపిస్తున్న అతడి మాటలు వింటూ.

"నిజం చెప్పు నిర్ణయా.... నేనంటే నీకు ప్రేమలేదు కదూ"

ఉక్రోషంగా చూసింది "పతనానికి, ప్రేమకి తేడా తెలిసినట్టు మాట్లాడకు."

"సో....లెట్ మి డై లైక్ దిస్...." ఖండితంగా అన్నాడు.

"నన్నిలాగే కడతేరిపోనియ్...."

ఏమిటిలా మాట్లాడుతున్నాడు.

జీవితం గురించి చాలా నిబ్బరంగా నిర్వచనాలందించే యీ వ్యక్తి ఒక్క అనుభవంతో యింత కృంగిపోతున్నాడేం?

ఏకాగ్రతగా అతడ్ని చూస్తూ వుండిపోయింది చాలాసేపటిదాకా.

అది నటనలా లేదు.... మరోసారి తనను అనుభవించాలని చేసే ప్రయత్నంలా అనిపించలేదు.

తన కోసం ఒక మగవాడు పడే ఆరాటాన్ని యింత సంతృప్తిగా చూసి ఆనందించటమే ఆడదానికి నిజమైన పతనం అని తెలిసిన స్థితిలో ఆమె ఆలోచిస్తుండగానే పైకి లేచాడు శ్యాం.

తాగి తూలుతున్న శ్యాంని చూస్తుంటే కొద్దిగా భయమనిపించింది.

"నిర్ణయా" అమాంతం ఆమెను సమీపించి చేతులు పట్టుకున్నాడు. పట్టుదప్పి ఆమె పాదాల దగ్గర చతికిలబడిపోతూ "నన్ను అర్థం చేసుకో" అన్నాడు ప్రాధేయపడుతున్నట్టుగా.

ఆమె చేతులు విదుల్చుకోలేదు.... నిర్లిప్తంగా అంది.

"నువ్వు పెళ్ళి చేసుకో"

"నువ్వు సిద్ధమేనా...."

"నేననేది నీ అనూహ్య గురించి"

"నేను అడుగుతున్నది నీ గురించి"

"నేను పెళ్ళయినదాన్ని."

"కాని నాకు నువ్వే కావాలి."

ఆమె పైకి లేవబోయింది.... అవకాశమివ్వలేదు శ్యాం.... ఆమెను ఒడిసిపట్టుకున్నాడు....

అది బలవంతంలా లేదు.... ఓ తపస్సులా అనిపిస్తుంది ఆ భావం ఆమె ప్రతిఘటించే శక్తిని హరిస్తూంది.

"విడిచిపెట్టు"

"లేదు.... నువ్వు కావాలి. ఏ అనుభవం శాశ్వతంగా నాకు మాత్రమే చెందాలి.... ఐ లవ్ యూ నిర్జయా.... నా మాట కాదనకు...."

"ప్లీజ్" ఆమె విసుగ్గా లేవబోయింది.

చేతికి చిక్కిన పైట జారిపోతూ ఆమెను క్రమంగా వివస్త్రను చేస్తుంటే పెనుగులాడుతూ అలసిపోయింది.

అతడి ఆర్తికి కరిగిపోతున్నట్టు అలాగే నేలపైకి జారిపోయింది.

ఆమె రొప్పుతూంది నిస్సత్తువగా....

భగ్నమైపోతున్న స్వప్న ఖండాలు.... విరిగిపోతున్న విఘాతాలు.. ఉప్పెనతో ఉక్కిరి బిక్కిరవుతున్న అఘాతాలు.... మొగలి పొదలపై పడగనీడల బుసల హోరు....

ఆమె నలిగిపోతూంది.

కాదంటూనే అతడ్ని చుట్టింది.

కంఠపు లోయ నిండుగా పేరుకున్న ఊర్పుల నిట్టూర్పుల్లో మిగిలిన పవిత్రతకి సమాధి కడుతూ సంచేసాన్ని దేహంనుంచి వేరుచేసి అలసటగా సొమ్మసిల్లి పోయింది.

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం.

తుఫాను వెలిసింది.... చప్పుడు చేసిన స్వగతం గతమైంది.

ఐదు నిమిషాలు గడిచేక తేరుకున్న నిర్ణయ యిక అక్కడ వుండ లేనట్టుగా పైకి లేచి వేగంగా బయటకి నడవబోతుంటే ఉద్వేగ్నంగా ఆమె చేతిని పట్టుకున్నాడు శ్యాం.

"థేంక్స్" అన్నాడు బిడలికగా చూస్తూ.

అతడి కళ్ళలో అదోలాంటి విజయగర్వం.

ఆమె జవాబు చెప్పలేదు.

చేతిని విదిలించుకోవాలనుకుంటూనే ఓడిపోతూంది.

ఎందుకిలా జరుగుతుంది....

తనూ అతడ్ని కోరుకుంటూంది కదూ.

లేనినాడు ఎందుకో వచ్చి మరి దేనికో వచ్చినట్టు యింత సులభంగా అంగీకరించిందేం....

"నా మీద కరుణించి యిలా వచ్చినందుకు కృతజ్ఞుడ్ని నిర్ణయా"

"అసలు నేను వచ్చింది...." అతడి కళ్ళలోకి సూటిగా చూడలేక పోతూంది "ఇందుక్కాదు నీకు నచ్చచెప్పాలని"

"ఏ విషయంలో...."

"నిన్ను నువ్విలా నాశనం చేసుకుంటూ నలుగురూ మనల్ని అను మానించే పరిస్థితి తీసుకురావద్దని చెప్పటానికి."

"ఐ కేరేపిన్ ఫర్ ది పీపుల్...." రోషంగా అన్నాడు శ్యాం....

నిర్ణయ విషయంలో అతడెంత ఉన్మాదిగా మారిందీ తెలుసుకో టానికి యిప్పటి అతడి మాటలు చాలు.

"ఎస్ నిర్ణయా.... నిన్ను నేను ప్రేమిస్తున్నాను.... ప్రేమ కాదు... పిచ్చిగా కోరుకుంటున్నాను....ఎవరడ్డమొచ్చినా నరికి పోగులేస్తాను. ఆఖరికి మీ ఆయనైనా సరే...."

భయంగా చూసింది ఆమె.

తను యింతటి అధికారాన్నిచ్చేసిందా?

ఇలా మాట్లాడుతున్నాడేం?

ఫేక్టరీలో తన పరిచయం కోసం ఆదినుంచీ ఎలాంటి ప్రయత్నం చేసిందీ, ఆ పరిచయం చనువుగా మార్చుకోటానికి ఏయే చర్చల్ని ఎలా మళ్ళించిందీ ఆమెకు స్పష్టంగా గుర్తుంది.

ఎవర్నీ కేర్ చేయని నిబ్బరంతో మాట్లాడుతూ ఎదుటి వ్యక్తిలో ధైర్యాన్ని సూరిపోయటానికి ఎంతగా దూకుడుని ప్రదర్శించింది జ్ఞప్తి కొచ్చిందిగాని యిలా అధైర్యంతో నలిగిపోతూ దాన్ని ధైర్యంలా వ్యక్తీకరించాలనుకోవడం యిప్పుడే చూస్తోంది.

"అసలు నానుంచి నువ్వేం కోరుకుంటున్నావ్" మనసులో ఉవ్వెత్తున లేచే తరంగాల్లాంటి చాలా ప్రశ్నల్ని క్రోడీకరిస్తూ అడిగింది నిర్ణయ "అనుభవాన్ని కదూ?"

"అనుభవం ఒక్కటే కాదు నిర్ణయా, నీ ప్రేమని కూడా.... అసలు...." ఖచ్చితంగా ఏమిటో అతడికి తెలీదు. "నిన్నూ— నీ మీద నాకున్న ప్రేమని విడదీసి ఆలోచించలేను."

"నేను పెళ్ళయిన ఆడదాన్ని"

"అది నాకు అభ్యంతరం కాదని నీ కెప్పుడో చెప్పాను" టక్కున అన్నాడు.

"కాని సంఘానికి అది అభ్యంతరం...."

"నీకు కాదుగా."

ఉలికిపడినట్టుగా చూసింది.

"నీకు అభ్యంతరం కానపుడు నాకు సంఘంతో పనిలేదు"

"నాకూ అభ్యంతరమే...."

"అదే నిజమైతే నాతో యిలాంటి సంబంధానికి ఎందుకు అంగీకరించావు?"

"నేను అంగీకరించలేదు. నన్ను ట్రాప్‌చేశావ్."

"అది తొలిసారి....మరి ఈ రోజు...."

జవాబు చెప్పలేకపోయింది.

"నిన్ను నేను రేప్ చేయలేదే .... నువ్వు కావాలి నిర్మలా అన్న ఆసక్తిని మాత్రం ప్రదర్శించాను. అంతేగా. మరి ఎలా ఒప్పుకున్నావ్.." మృదువుగా నవ్వుతూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు "నీకూ నేనంటే యిష్టమే నిర్మలా...బహుశా ఆ నిజాన్ని నువ్వు అంగీకరించలేకపోతున్నావ్. దానికి కారణం నువ్వో వ్యక్తికి భార్యవన్న తలంపు, ఇలా చేయటం నేరమని తరతరాలుగా సాంప్రదాయాలు, కట్టుబాట్లు నిర్దేశించిన నిజాలు నీకు గుర్తుకు రావడం...." ఆ స్థితిలో సైతం చెక్కు చెదరని ధీమాతో తర్కంలా చెప్పుకుపోతున్నాడు. "అదే నిజం కాకపోతే ఇది తప్పన్న భావాన్ని పక్కకునెట్టి నాతో విచ్చలవిడిగా తిరగటాన్ని నువ్వు యిష్టపడేదానివి.... నన్నిలా ఉన్మాదిగా మార్చడం దారుణమన్న ఆలోచనతో హైద్రాబాద్ తిరిగి వచ్చిన నేను ఫేక్టరీకి రావడంలేదని తెలిసి తొలిరోజే నా దగ్గరకు వచ్చి లాలనగా నన్ను దగ్గరకు తీసుకునే దానివి...."

"స్టాపిట్" నిర్ణయ కంపించిపోతూంది "చాలు....ఇక ఈ విషయం మాట్లాడకు. జరిగింది పీడకలలా నన్ను మర్చిపోనీయ్...."

"అసంభవం నిర్ణయా....నిన్ను నేనుగాని, నన్ను నువ్వుగాని మరిచి పోవడం జరగని పని"

"ఎందుకలా అనుకుంటున్నావ్"

"చెప్పనా...." మళ్ళీ అతడి కళ్ళలో కాంక్ష బుస కొడుతూంది. "నాతో అనుభవాన్ని నువ్వూ మనసారా కోరుకుంటున్నావ్ కాబట్టి. ఇది నీ కెలా తెలుసని నువ్వడిగితే నా జవాబు ఒక్కటే....ఇందాక నాతో అనుభవాన్ని నేనే కాదు నిర్ణయా నువ్వూ అద్భుతంగా ఎంజాయ్ చేశావు. బహుశా నీ భర్త దగ్గర యింతకాలం దొరకనిదేదో నా దగ్గర దక్కినంత సంతృప్తితో నన్ను చుట్టేసి...."

ఆమె బాధగా తల పట్టుకుంది.

మరుక్షణం ఆవేశంగా బయటకు నడవాలనుకుంది. అనుకోవడమే కాదు, ద్వారం దాకా నడిచింది కూడా.

"మళ్ళీ ఎప్పుడొస్తావ్?"

టక్కున ఆగింది.

"ఇక రావడం వుండదు."

"వచ్చి తీరాలి...." ఓ ఆదేశంలా అన్నాడు. "అవును నిర్ణయా.... ప్రతిరోజూ కాకపోయినా కనీసం వారానికి రెండు రోజులు నువ్వు నాతో గడపాలి."

"ఎలా సాధ్యమది"

"ఇప్పటిలాగే" నవ్వేడు యథాలాపంగా "ఫేక్టరీ నుంచి సరాసరి నా ఫ్లాట్‌కి వస్తావ్....ఓ గంటసేపు నాతో స్పెండ్ చేసి అప్పుడు ఇంటికి వెళ్తావ్."

క్రమం కాని ఓ సంబంధం ఏ మగాడ్నయినా యింత బలవంతుడ్ని చేస్తుందని తెలిసిన తొలి క్షణం అదీ....ఉక్రోషంగా అంది నిర్జయ "ఏ దురదృష్టకరమైన క్షణమో నన్ను యిలా పతనంవేపు నెట్టిన మాట నిజమే. అయినా యింకా ఈ వూబిలోనే బ్రతకాలని నేను కోరుకోవటంలేదు శ్యాం. కాబట్టే యిక ముందు నీకూ, నాకూ ఎలాంటి సంబంధం వుండదని, వుండ కూడదని చెబుతున్నాను."

భావరహితంగా చూశాడు శ్యాం "ఎల్లుండి సాయంకాలం ఆరు గంటలకి నువ్విక్కడికి వస్తున్నావ్....వచ్చితీరాలి."

"లేకపోతే...."

"నన్ను నేను నాశనం చేసుకోటానికీ నేను సెనుకాడను" మొండిగా అన్నాడు ఉన్మాదిలా నవ్వుతూ.

అది బెదిరింపుకాదు....దేనికైనా సిద్ధపడే వివశత్వం....పాలిపోయిన అతడి మొహంలో ప్రేతకళ ఆమెను మరెంత భయపెడుతూంటే రెండడు గులు ముందుకేసి అన్నాడు.

"చదువూ సంస్కారం వున్న వాడిలా కనిపించిన నువ్వు యిలా ఎందుకు మాట్లాడుతున్నావ్ శ్యాం అని ఆశ్చర్యపోకు నిర్జయా....నీ కోసం నేను ఎంత పిచ్చి వాడ్నయ్యానో చెబుతున్నానంతే.... ఎల్లుండి సాయం కాలం ఆరు గంటలకి నువ్విక్కడికి రావాలి..వస్తే.."టేబిల్‌పై ఉన్న రెండు బాటిల్స్‌ని చూపించాడు. "కుడిపక్క ఉన్న బాటిల్‌లోని విస్కీతాగి సెల బ్రేట్ చేసుకుంటాను. లేదూ అంటే ఎడమవేపు బాటిల్‌లోని ఎండ్రిన్ తాగి చస్తాను. అదీ వూరికనే కాదు నా చావుకి నువ్వే కారణమని ఉత్తరం రాసి"

నిర్జయ ప్రాణ్నడి చూస్తూంది....

అదీ చాలు తన దాంపత్య జీవితం నాశనం కావటానికి. ప్రపంచం చట్టం కాదు, తన భర్తకి తను యిక మొహం చూపించలేదు.

"ఎందుకు...ఎందుకు నన్నిలా హింసిస్తున్నావ్" దుఃఖోద్వేగంగా అడిగింది.

"ఒక ఆడదానితో అనుభవం నాకు కొత్తకాదు నిర్ణయా...." తన గురించి తాను యింకా వివరంగా తెలియ చెప్పాడు. "కాని నీలాంటి స్త్రీమీద గెలుపు కొత్త....అసలు నీ అందం, ఆకర్షణ అందించిన మత్తు ఎంత అసాధారణమైనదో నా స్థానంలో నిలబడ్డవాడికి తప్ప తెలీని విషయం నిర్ణయా. అందుకే నిన్ను పొందటానికి నేను దేనికైనా సిద్ధపడతానని చెబుతున్నది. సో...." క్షణం ఆగి అన్నాడు "నువ్వు ఎల్లుండి సాయంకాలం ఆరు గంటలకి నా దగ్గరకు వస్తున్నావ్."

ఎప్పుడో ఒకనాడు ముగ్ధ మోహనంగా జీవితం గురించి ఆలోచించటం ప్రారంభించేక ఓ మగాడికి మనసిచ్చిన ఓ ఆడపిల్ల .... ప్రేమించిన వ్యక్తిని పొందలేని నాడు అసలు జీవితానికే అర్థం లేదని అందర్నీ కాదని యిల్లు విడిచి వచ్చిన ఓ అమ్మాయి....ఇప్పుడు గడపదాటిన స్త్రీగా ఏ స్థితిలో కూరుకుపోయిందీ ఆలోచిస్తూ గది బయటికి వచ్చింది.

అటదేమైనా కానీ....

తను తప్పు చేయదు యికపుందు.

శ్యాం ఎంత బెదిరించినా కానీ మళ్ళీ యీ యింటి ఛాయలకే తను రాదు.

తనే అతడి మరణానికి కారణమని అతడు రాసినా కానీ తనను తాను రక్షించుకుంటుందే తప్ప యింకా యీ వూబిలో బ్రతుకును కొనసాగించదు.

చాలా స్థిరంగా నిర్ణయించుకుని మెట్లు దిగుతున్న నిర్ణయకి తెలీదు జరగాల్సిన అనర్థం అప్పటికే జరిగిపోయిందని.

శ్రీహర్ష ఆఫీసులో పనిచేసే శర్మ ఎదురు ఫ్లాట్‌లోని తన మిత్రుడు దగ్గరికి వచ్చి కాకతాళీయంగా ఈ దృశ్యాన్ని చూసేడు.

లోపల జరిగిందేమిటా అన్నది శర్మలాంటి వాళ్ళకి అనవసరం. ఏమీ జరక్కపోయినా ఏదో జరిగిందని ప్రచారం చేయాలనుకుంటున్న శర్మ ఇది చాలు శ్రీహర్షపై ఉన్న కక్ష తీర్చుకోవానికి అనుకున్నాడు.

అసలు శర్మది మాత్రం తప్పెలా అవుతుంది.

జరిగింది జరగకూడనిదేగా

* * * *

"ఏమిటి చాలా ఉత్సాహంగా వున్నావ్" అడిగింది ప్రమీల శ్రీహర్షని చూస్తూ....

నిజమే....

టూర్ నుంచి తిరిగి వచ్చాక నిర్ణయలోని మార్పు అతన్ని చాలా ప్రభావితం చేసింది.

నిర్ణయ కలుపుగోలుతనం మాటలు చాలా రోజులుగా వున్న ఏ అపార్థాలో తొలగిపోయినట్టుగా అనిపిస్తుంటే నిజంగా ఆనందంగా వుంది.

"ఆడపిల్లలా జవాబు చెప్పకుండా తలవంచుకున్నావుంటావేం" అడిగిందామె మళ్ళీ.

"నీ పరిచయం నన్ను చాలా మార్చేసిందనుకుంటాను ప్రమీలా."

"అవును" నవ్వేసి నిగూఢంగా అంది ప్రమీల. "కాబట్టే నాకు దగ్గరవుతావనుకుంటూండగా చెప్పాచెయ్యకుండా టూట్ నార్చి నిర్ణయ పక్కకి వెళ్ళిపోయావ్."

చిన్నబుచ్చుకున్నాడు శ్రీహర్ష. "నేనంటున్నది అప్పటి మన పరిచయం గురించి కాదు. ఈ మధ్య నువ్వు మళ్ళీ కలిశాక ని...."

రెప్పలార్చకుండా చూస్తూంది ప్రమీల....

ఇప్పుడిప్పుడు శ్రీహర్ష మనసువిప్పి మాట్లాడగలుగుతున్నాడు. బాధని మాత్రమేగాక ఆనందాన్ని సైతం వ్యక్తం చేయడం చేతకానివాడిలా కనిపించే శ్రీహర్ష యిప్పుడు ప్రతి విషయమూ చర్చించగలుగుతున్నాడు.

ఆమె ఆలోచనలనుంచి యింకా తేరుకోలేదు.

"నిజం ప్రమీలా....ప్రతిక్షణమూ సమస్యని ఒకే కోణంలో ఆలోచించే నేను నువ్వు కలిశాక నువ్వు కనుపుగోలుగా మాట్లాడ్డం ప్రారంభించేక నిర్ణయని మరో కోణంలో సైతం చూడ్డం మొదలుపెట్టాను. బహుశా నా మార్పే నిర్ణయకి ఆనందంగా అనిపించిందేమో. ఇప్పుడు మామూలుగా వుండగలుగుతూంది."

"సంతోషం" అతడి మాటలకి నిజంగానే గర్వమనిపించింది. "అంటే నువ్వు మంచి భర్తవైపోతున్నావన్నమాట."

"దానికి ప్రేరణ నువ్వే ప్రమీలా....అందుకే నీ దగ్గర యింకా చాలా తెలుసుకోవాలనుకుంటున్నాను" బుద్ధిమంతుడైన విద్యార్థిలా మాట్లాడుతున్నాడు శ్రీహర్ష "కొన్ని వెలకట్టలేని అనుభవాలు అయాచితంగా దక్కుతుంటాయి. నీ స్నేహమూ అలాంటిదే."

తనలోని ఉద్వేగ్నతని అతడు వ్యక్తం చేసే విధానం ముఖస్తుతిలా అనిపించింది.

"ఇఫ్ వియ్ కుడ్ సెల్ అవర్ ఎక్స్‌పీరియన్సెస్ ఫర్ వాట్ దే కాస్టజ్ వియ్ వుడ్ ఆల్ బి మిలియనీర్స్" సాలోచనగా అంది ప్రమీల ఎటో చూస్తూ.

సాయంకాలపు నీరెండ కిటికీలోనుంచి వాలుగా లోపలికి చొచ్చు కొస్తుంటే బయటి ప్రపంచాన్ని గమనిస్తూ వుండిపోయింది ప్రమీల చాలా సేపటిదాకా....

ఏ ఆలోచనల రాపిడి ఆమెను కలవరపరుస్తుందో నెమ్మదిగా అంది. "ప్రపంచంలోని చాలా సమస్యల్ని అధిగమించేది పరిష్కారాలు వెదు క్కొని కాదు శ్రీహర్షా....అధిగమించాలనే విల్ పవర్‌తో...."

"కాని ఆ విల్ పవర్ అందరికీ సాధ్యమైనది కాదు."

ఆమె వెనక్కి తిరగలేదు. "ఏం....ఎందుకని...."

"అది స్వతహాగా మనిషి రక్తంలో వుండేది కాబట్టి."

"నీ ఆలోచన సరైనది కాదు శ్రీహర్షా....విల్ పవర్ పుట్టుకతో వచ్చేది కాదు. అంతర్గతంగా మనం వృద్ధి పరుచుకునే శక్తి అది. చాలా మంది తమలో వుందని తెలుసుకోలేని అన్ రియలైజ్డ్ పొటెన్సీ ...కాబట్టే ఎందరో సమస్యల వాగుల్లో పూచికపుల్లల్లా కొట్టుకుపోతుంటారు. విల్ పవర్ అంటే కోరికల్ని నిగ్రహించుకోవడం మాత్రమే కాదు శ్రీహర్షా.... ఆ నిగ్రహానికి అవసరమైన మనో నిబ్బరాన్ని మనసులోనుంచి పుట్టించు కుంటూ నిరంతరం సాగిపోవడం...." నిట్టూర్చుతూ వెనక్కి తిరిగింది.

"టాపిక్ డైవర్టయినట్టుంది కదూ...."

నిర్లిప్తంగా చూస్తూ సైతం గ్రహించాడు. ప్రమీలలో ఉన్నట్టుండి చాలా మార్పు కనిపించింది. ఎందుకో అర్థంకాలేదు.

మరపురాని ఏ జ్ఞాపకాల తెరలో ఆమె కళ్ళముందు కదలాడి ఆమెను కలవరపెట్టాయేమో అనుకున్నాడు తప్ప అంతకుమించి ఆలోచించ లేకపోయాడు.

నిజానికి ఆఫీసులో ఓ గంట పర్మిషన్ తీసుకుని ప్రమీల దగ్గరకు వచ్చింది ఆమెనుంచి వినాలనే తప్ప ఆమెకేదో చెప్పాలని కాదు.

చెప్పగలిగే స్థాయిలో తను వున్నాడన్న నమ్మకమూ అతడికి లేదు.

అయినా అడిగాడు. "ఏమిటి అలా అయిపోయావు."

ఆమెలో అస్పష్టంగా కనిపించిన కలవరంకన్నా ఈ ప్రశ్న ఎక్కువగా ఆందోళన పరిచిందేమో వెంటనే పెదవులపై నవ్వు పులిమేసుకుంది. "నాకేం....నేనైతే బ్రహ్మాండంగా వున్నాను. చెప్పు....ఈ రెండు మూడు రోజుల హైలైట్స్...."

"మా ఆవిడ ఉద్యోగం మానేయాలనుకుంటూంది."

"గూడ్"

"అసలు ఉద్యోగం చేయమని నేనేం ప్రోత్సహించలేదు. తనే ఆదిలో ఉత్సాహపడింది."

"ఇప్పుడు ఉద్యోగం మానేస్తాననూ అంటుందంటే యింట్లో నీ మూలంగా అంత కాలక్షేపం దొరుకుతుందన్న మాట... కంగ్రాట్స్...."

ఈ స్టేట్ మెంటుతో చాలా సిగ్గుపడిపోయాడు.

"మరి నువ్వేమన్నావ్" అడిగింది.

"మానేయమన్నాను."

"రైట్ డెసిషన్...." తల పంకించింది ప్రమీల. "నిజమే శ్రీహర్షా ....స్త్రీ ఆర్థికంగా ఎదగాలీ లేదా ఆర్థికంగా కుటుంబానికి ఆమె ఆసరా కావాలీ అన్న పరిస్థితుల్లో తప్ప ఆడది ఉద్యోగం చేయకూడదు....దాని వలన జీవితంలో భార్యా భర్తల నడుమ వుండే సున్నితమైన చాలా థ్రిల్స్

మిస్సయి పోతుంటాయి అంటాడు అమెరికా స్ట్రెస్ మేనేజ్‌మెంట్ కౌన్సిలింగ్ సెంటర్ డైరెక్టర్ అలాన్ ఎల్కిన్....దీనికి ముఖ్య కారణం డ్యూయల్ కమిట్‌మెంట్స్....భార్యా భర్తలిద్దరికీ కొన్ని కమిట్‌మెంట్స్ వుంటాయి. అవి యింటికి సంబంధించినవి కావచ్చు లేదా వాళ్ళ పని చేసే ఆఫీసుకి సంబంధించినవి కావచ్చు కాని యీ 'టు కెర్రీర్ కపుల్స్' స్ట్రెస్ మూలంగా ఎక్కువపాళ్లు యిబ్బందులకే గురవుతుంటారు....బడలిక, మూడీగా వుండటం, అసహనం, మొహాలు మాడ్చుకోవటం, నవ్వే మరిచి పోవటం యివన్నీ మామూలు విషయాలైతే...." క్షణం ఆగి అంది. "ఆశ్చర్యపోకు.... సైకో అనలిస్టులు చెప్పిందాని ప్రకారం ఫిజికల్ సొలేస్‌నీ పోగొట్టుకుంటారు....అంటే దాంపత్యంలో యిద్దరి మధ్య దూరాన్ని తగ్గించటానికి వుపయోగపడే సెక్స్ జీవితాన్ని సవ్యంగా అనుభవించలేరు."

ఏదో అడగబోయిన శ్రీహర్ష మళ్ళీ అంతలోనే ఆగిపోయాడు.

"బహుశా మొన్నెప్పుడో నేను అన్న ఫైవ్ సెక్స్ సీక్రెట్స్ గురించి అడగాలని మొహమాటంతో ఆగిపోయినట్టున్నావు కదూ."

నిజమే....కాని అవునూ అనలేకపోయాడు.

ఓ స్నేహితురాలిగా ఆ విషయం చర్చించటానికి మొహమాటపడలేదు. "సహజమైన శృంగారానికి దూరంగా బ్రతకడమే దాంపత్య జీవితం వినాశనానికి తొలి సంకేతమౌతూంది శ్రీహర్షా....ముఖ్యంగా ఇది వర్తింపేది 'టు కేరీర్ కపుల్స్'కి. ఇందాక నేను అన్న ఐదు శృంగార సూత్రాలూ ప్రపంచంలోని ప్రముఖ సెక్స్ థెరపిస్టులు సైంటిఫిక్‌గా రీసెర్చ్ చేసి చెప్పినవే. అసలు సెక్స్ అన్నది ఆ క్షణంలో అప్పటికప్పుడు మూడ్ నిబట్టి నిర్ణయించుకోవాల్సింది తప్ప ముందే ప్లాన్ చేసుకోవాల్సింది కాదన్నది ఓ

మూఢ నమ్మకం....ఈ స్పేస్ ఏజ్‌లో ప్రతీదీ ప్లాన్ చేసుకోవాల్సిందే.... అదే ఉద్యోగస్థులైన భార్యాభర్తల విషయంలో అయితే మరీను....

అసలు స్త్రీ శృంగారాన్ని కోరుకునేది బెడ్‌మీదే కాదు....అది ప్రక్రియగా బెడ్‌పై జరిగినా ఆలోచనలు ప్రారంభం కావాల్సింది బెడ్‌రూమ్‌కి బయట....అలసటగా యింటికి వచ్చిన భర్త మూడ్ బాగోక మందు కొడుతూనో లేక అర్ధరాత్రిదాకా టి.వి చూస్తూనో గడిపి హఠాత్తుగా గదిలోకొచ్చి భార్యని ఆక్రమించుకోవడం ఆ పదానికి బాధాకరమైన విషయం అవుతూంది....అసలు సెక్స్ అన్నది శరీరంనుంచి పుట్టేది కాదు. మనసునుంచి ఆత్మీయతనుంచి పుట్టాల్సింది అంటుంది ప్రపంచంలో ప్రముఖ సెక్స్ రీసెర్చర్ వర్జీనియా జాన్సన్....

అంటే భర్త ప్రతి చర్యనీ ఇంటర్ కనెక్ట్ చేసుకుంటూ భార్య పేషనేట్ లవర్‌గా బెడ్‌పై తనను తాను అర్పించుకుంటూంది కాబట్టి శృంగారాన్ని బెడ్‌కి పరిమితంచేసే భర్త బెడ్ లవర్ అన్నది ఆడది కోరుకునే అయిదు శృంగార సూత్రాల్లో యిదీ మొదటిదీ."

ప్రమీలవేపు చూడటంలేదు శ్రీహర్ష. ఆమె మాటల్ని తన జీవితానికి సమన్వయ పరుచుకుంటూ ఆలోచిస్తున్నాడు.

"భార్యస్థానంలో వున్న ఆడది ముందుగా భర్తనుంచి కోరుకునేది సెక్స్ కాదు....టెండర్ టాక్....నేను నీవాడ్ని అనిపించే సెన్సాఫ్ బిలాంగింగ్‌నెస్....ఇది శృంగార జీవితంలో రెండవ సూత్రం....భర్త శారీరకంగా అసమర్థుడైనా యింకా అతడికే పరిమితం కావాలని ఎందరో భార్యలు ఆలోచించటానికి కారణం ఇలాంటి స్టిమ్యులేటివ్ కన్‌వర్సేషన్ అండ్ కమ్యూనికేషనే....చాలామంది భర్తలు శృంగారాన్ని ఓ సీరియస్ ఏక్టివిటీగా భావించి ముభావంగా మొత్తం పూర్తి చేయాలనుకుంటారు....ఇదీ స్త్రీ ఓ పెద్ద అవ

రోధంగా భావిస్తుంది. సెక్స్ అంటే శరీరాలకేకాదు మనసులకి ఆహ్లాదం కలిగించే ఓ స్పోర్ట్....

కాబట్టే నవ్వులూ, కేరింతలు కలగలపుగా ప్రారంభమయ్యే సెక్స్ ఏక్టివిటీలోనే ఆడది ఎక్కువ సంతృప్తిని పొందుతుంది....ఇది మూడవ సూత్రం...ఇక నాలుగు, ఐదు సూత్రాలు గురించి క్లుప్తంగా చెప్పాలీ అంటే శృంగార ప్రక్రియ పూర్తికాగానే ముసుగుదన్ని పడుకునే భర్త దగ్గర స్త్రీ ఎక్కువ ఆనందాన్ని పొందదు....మరింత ఇంటిమసీని కోరుకుంటుంది.... ఇదో శృంగార రహస్యం....

ఆఖరిదీ అతి ముఖ్యమైనదీ అంటే స్త్రీ అప్రయత్నంగా భర్తనుంచి కోరుకునేది ప్రతి రాత్రి వసంతరాత్రి అనిపించేట్టు పగటిపూటైనా ఆఫీసుకు వెళుతూ అయినా లేక వచ్చిన తరవాతైనా ఆమెను హగ్ చేసుకోవడం, అల్లరిచేయటం, నవ్వించడం, నవ్వడంలాంటి చర్యలు. నిజమైన ఫోర్ ప్లే యిదే....బెడ్‌పై శృంగారానికి ముందు కొనసాగించేది కాదు."

నవ్వేసింది ప్రమీల శ్రీహర్షని చూస్తూ.

"ఏ ఆడదీ ఓ పరాయి మగాడితో ఇలాంటివి చర్చించదు శ్రీహర్షా. కానీ నీతో యివన్నీ నేను మాట్లాడటానికి కారణం నువ్వు అందరి మగాళ్ళ లాంటివాడివి కాదన్న భావం ఒకటైతే ఇవన్నీ నీకు తెలిసిన విషయాలైనా స్నేహితుడివి పైగా కాస్త అమాయకుడివి కాబట్టి ప్రిపూరిటీపైజ్ నీకు యివి అన్నీ చెప్పాలనిపించే ఆలోచన మరొకటి. అంతే తప్ప అక్కడికి నేనేదో శృంగార కళలో అపారంగా ఆరితేరిన ఆడదాన్ననుకోకు."

శ్రీహర్ష పైకి లేచాడు.

సరిగ్గా అదే సమయంలో ఆమె తల తిప్పుకోవటం యాదృచ్ఛికమే అయినా ఆమె మొహంలోని భావాల్ని అతడు చూడలేకపోవటానికి అదే కారణమైంది.

కొన్ని వాస్తవాల్ని ఇప్పుడు ఆమె చెప్పగలిగింది పొందిన జీవితం నుంచి తెలుసుకున్న సత్యాల ప్రేరణతోనా లేక దాంపత్య జీవితం యిలా వుండాలనిపించే ఆలోచనల స్ఫూర్తితోనా అన్నది కాలం తెలియచెప్పాల్సిన విషయం.

అయినా ఈ క్షణంలో ఆమెకు తెలిసింది ఒక్కటే....

ఎప్పుడూ అస్పష్టంగా మనసులో పేరుకున్న ఓ రూపం యిప్పుడు క్రమంగా కూడని కొన్ని సరిహద్దుల్ని దాటి విస్తరిస్తున్నట్టు ఆమెకే బోధ పడిపోతూంది.

కాబట్టే బిడియం విడిచి అతడితో యింత లోతుగా చర్చించగలిగిందేమో కూడా.

ఇప్పటికీ ఆమెను శ్రీహర్షలో ఆకర్షించేది అతడి అమాయకత్వం. ఈ ఆకర్షణకి పర్యవసానం ఏమిటో ఆమెకే తెలీదు. అందుకే వెళుతున్న శ్రీహర్షను వారించలేకపోయింది ఇంకా అతడు వుంటే బాగుణ్ణని మనసులో అనిపిస్తున్నా.

* * * *

"ఏమైంది?"

గదిలో పడుకున్న నిర్జయ భుజంపైన చేయివేస్తూ అడిగాడు శ్రీహర్ష.

జవాబు చెప్పలేదు నిర్జయ. కాని అతడి స్పర్శకి ఉలికిపాటుగా పైకి లేచింది.

తనో పతనమైన ఆడది. కొన్ని క్షణాలక్రితమే మైలపడి యింటికి వచ్చింది.

"ఏమిటి అలా వున్నావ్?" నిజాయితీగా అడిగాడు. నిజానికి నిజాయితీ మాత్రమే కాదు. ఆమె ముఖకవళికలు నిజంగా అతడ్ని కలవరపరుస్తుంటే ఆర్ద్రతగా అడిగాడు.

"ఏమైంది నిర్ణయా?"

ఆమెకు కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూంది.

ఇంకా యింత ఆత్మీయతను వర్షిస్తున్నాడేం....

ఏది కోల్పోయానన్న బాధతో యీ స్థితికి దిగజారిందో అది ఇప్పుడింత స్పష్టంగా అచరించి తను తప్పు చేశానన్న గిల్టినెస్‌ని మరింతగా పెంచుతున్నాడెందుకని....

ముడుచుకున్న నాటి ప్రేమ కావ్యపు కాగితాలు కాలి వల్లని మంటల్లా మనసును అరడిపెడుతుంటే సరిగ్గా ఈ సమయంలో తనను తాకి యింత బాధకి గురిచేస్తున్నాడేం. ..

"మాట్లాడు నిర్ణయా"

"నన్ను ప్రశాంతంగా బ్రతకనివ్వండి" ఉక్రోషంగా అంది.

"ఇప్పుడేమైంది?"

గిల్టీగా అనిపించిందేమో ఓ నీటి బొట్టు ఆమె కను కొలకుల్లోకి జారింది.

"ఇంటికి రాగానే యీ పరామర్శలేమిటి?"

"అది కాదు నిర్ణయా"

"ప్లీజ్!" అసహనంగా బెడ్ దిగి కిటికీ దగ్గరకు నడిచింది.

"నన్ను ఒంటరిగా ఉండనివ్వండి. దయుంచి కొంతసేపు నన్ను డిస్టర్బ్ చేయకండి"

"అసలేం జరిగింది?" దగ్గరగా నడిచాడు.

"చెబుతుంటే మీక్కాదూ?" నిర్జయ కసురుకునేసరికి నిశ్శబ్దంగా వుండిపోయాడు చాలా సేపటిదాకా.

ఎన్ని ఆలోచనలతో యింట అడుగు పెట్టాడని.... ఇంతకాలం కోల్పోయిందేమిటో అర్థమైనట్టు ఎన్ని కబుర్లు చెప్పాలని ఉత్సాహ పడ్డాడని.

మళ్ళీ యింతలోనే ఏమైంది.

ఆమెను డిస్టర్బ్ చేయడం ఇష్టం లేనట్టు బెడ్‌రూం దాటి బయటికి వచ్చేశాడు.

అరగంట గడిచింది.

గంటయింది.

బయటి చీకటిలోకి చూస్తూ ఇంకా నిలబడే వుంది నిర్జయ.

ఏం జరిగిందో చెబుతుందని ఎదురు చూసిన శ్రీహర్ష ఇక నిభాయించుకోలేకపోయాడు.

పట్టించుకోకుండా వుండటానికి ఆమెకు తను తప్ప ఎవరున్నారని.

"నిర్జయా...."

శ్రీహర్ష గొంతు వినిపించగానే తేరుకున్న నిర్జయ వెళ్ళి బెడ్‌పై పడుకుంది మోచేతితో కళ్ళను కప్పేసుకుంటూ.

"భోంచేద్దువుగాని రా."

అప్పటికిగాని నిర్ణయకి గుర్తుకు రాలేదు తను వంటచేయలేదని.... అంతే కాదు....శ్రీహర్ష వంటచేసేశాడని తెలిసిపోయింది.

"రా నిర్ణయా."

"ఏం.... ఒక్కరాత్రికి నేను భోంచేయకపోతే చచ్చిపోతాననుకున్నారా?"

"మరేం" మృదువుగా నవ్వాడు. "సుకుమారంగా పెరిగిన దానివిగా ...రా" చేయి పట్టుకున్నాడు.

"నన్నిలా విడిచిపెట్టండి."

"ఫేక్టరీలో ఏదన్నా గొడవైందా?"

"అలా అని నేను చెప్పానా?"

"చెప్పకపోయినా అర్థమైపోతూంది నిర్ణయా" లాలనగా ఆమెను స్పృశిస్తూ అన్నాడు. "నాకు తెలుసు. ఈ కోపం నామీద కాదని."

పంటి బిగువున దుఃఖాన్ని అపుకుంటూ అంది. "ఇప్పుడు మీరెందుకింత ఆత్మీయత ప్రదర్శిస్తున్నారో నాకు అర్థమై పోతూంది."

"నిజమా!" నవ్వేశాడు చిలిపిగా.

"ఆ మాత్రం అర్థంచేసుకోలేని మూర్ఖురాల్ని కాదు శ్రీహర్షగారూ.. మీకు నా కన్నా నాతో అనుభవం యిష్టం. అలా నా మీద గెలుపుతో మీ అహాన్ని, ఆవేశాన్ని చల్లార్చుకోవడం మీకు ఇష్టం. అందుకే....కేవలం అందుకే పనిగట్టుకుని యింత బుజ్జగిస్తున్నారు." ఒక అనుభవం కోసం శ్యాం తన పై ఎలాంటి వల పన్నిందీ గుర్తుకొస్తుంటే ఆ దుగ్ధని యిలా ప్రదర్శించి అతడ్ని అవమానించాలనుకుంది. "అంతే కదూ!"

"ఆప్ సెయ్" ఈ అభియోగం అతడ్ని ఎంత బాధించిందీ అంటే ఆమె భుజంపై వున్న చేతిని వెనక్కి తీసుకున్నాడు "నువ్వు నన్ను అర్థం చేసుకోలేవు."

"ఏం....నిజం గ్రహించేశానని కంగారుగా వుందా?"

"నువ్వనుకున్నవన్నీ నిజాలు కావు."

"కావని యిప్పుడిప్పుడే అర్థమౌతూంది."

"ఈ రోజు ఎందుకిలా మాట్లాడుతున్నావ్?"

"చావకుండా యింకా బ్రతికే వున్నాను కాబట్టి."

మనసు చివుక్కుమందేమో బాధగా అడిగాడు. "నువ్వు నాతో సుఖపడటం లేదని నాకు తెలుసు నిర్ణయా."

"బట్....ఇట్స్ టూ లేట్!" అసహనంగా అంది కళ్ళు తుడుచుకుంటూ "అవును శ్రీహర్షా....ఈ సత్యం మీరు గాని నేను గాని తెలుసుకోటానికి చాలా ఆలస్యమైపోయింది. ఇంత వినాశనం తర్వాత గాని మనం అర్థం చేసుకోలేకపోయాం."

ఈ ప్రసక్తిని శ్రీహర్ష యింకా కొనసాగించి వుంటే ఎమోషనల్‌గా నిర్ణయ జరిగింది కక్కేసేదేమో.

కాని శ్రీహర్ష యిక చర్చించే ఓపికలేనట్టు పైకి లేచాడు.

తన ఉనికే ఆమెకు యిబ్బందిగా వున్నప్పుడు దూరంగా వుండటం నయం.

'ఇంత వినాశనం తర్వాత' అన్న నిర్ణయ వాక్యం కన్నా "నాకన్నా నాతో అనుభవం మీకు యిష్టం" అన్న నిర్ణయ మాటలు పదేపదే అలజడి పెడుతుంటే బయట గదిలోకి వెళ్ళి ఓ మూల నిలబడిపోయాడు.

ఆ రాత్రి యిద్దరూ భోంచేయలేదు.

ఉదయం సైతం బ్రేక్‌ఫాస్ట్ చేయకుండా నిర్ణయ ఫేక్టరీకి వెళ్ళిపోయింది.

ఇప్పుడిప్పుడే తనలోని లోపాల్ని సరిదిద్దుకుంటూ ఆమెకి మరింత దగ్గర కావాలనుకున్న శ్రీహర్ష యిప్పటి నిర్ణయ ప్రవర్తనకి అణువంత బాధపడినా ఏ కలవరపాటుతో ఆమె యిలా ప్రవర్తిస్తున్నదీ వూహించలేక పోయాడు.

అయినా ఇది యింకా ఆరంభమేగా....

ఊబిలో అడుగుపెట్టిన ఓ పెళ్ళయిన ఆడది ముందు పరిసరాల్ని ద్వేషిస్తుంది. తర్వాత తన దాంపత్య జీవితాన్ని అయిష్ట పడుతుంది. ఆనక తనను తాను అసహ్యించుకుంటుంది.

ఇదో ప్రోసెస్.

ఏ స్థాయి ఆడపిల్లయినా తప్పనిసరిగా ఇలాగే ప్రవర్తిస్తుంది. ఆదంతే....

*    *    *    *

ఉదయం పదీ గంటలు కావస్తోంది.

నిర్ణయ అసహనంగా టెక్నికల్ డేటా షీట్స్ చూస్తూ ఆలోచిస్తోంది.

శ్యాం ఈ రోజు కూడా ఫేక్టరీకి రాలేదు.

అదికాదు.... ప్రతి వ్యక్తి తనను అనుమానంగా చూస్తున్నట్టనిపిస్తోంది. అది నిజమో, అలా ఆమె అనుకుంటూందో ఆమెకే తెలీదు.

జరిగిందాంట్లో తానెంతవరకూ బాధ్యురాలైనాకానీ చాలా గిల్టీగా వుంది. అసలు శ్యాం తనకోసం ఎందుకంతగా నలిగిపోతున్నాడు.

నిజంగా తనను ప్రేమిస్తున్నాడా లేక కేవలం అనుభవంకోసం అంగలార్చుకుపోతున్నాడా ?

అనుభవమే కావాలి అనుకుంటే సాధించాడుగా. అంతా అయిపోయినా యింకా మిగిలే వున్నట్టు తపించిపోతున్నాడూ అంటే అది ప్రేమ అనిపించు కుంటుందా....

హఠాత్తుగా గుర్తు కొచ్చిందామెకు....

శ్యాం గడువు పెట్టినరోజిది....

సాయంకాలం ఆరు గంటలకి తను అతడి ఫ్లాట్ కి వెళ్ళాలి.

వెళ్ళకపోతే....

సన్నని ప్రకంపన మొదలైంది.

ఒకవేళ నిజంగా అతడు విషం తీసుకుంటే .... అతడికేమన్నా అయితే....

ఉత్తరంలో శ్యాం తన గురించి రాసేది ఏమైనాకానీ తను మాత్రం ఆతడి మరణాన్ని భరించగలదా....

ఇలా ఆలోచిస్తూందేం....

ఏది ఏమైనా తను వెళ్ళదు....వెళ్ళకూడదు.

ఒక వివాహిత అయ్యుండీ అంతకుమించి ప్రేమించిన వ్యక్తికి భార్య అయిన తను ఇలా ఆలోచించడం దారుణం....

"మేడమ్"

వచ్చి ఎంతసేపైందో శ్యామ్ స్నేహితుడు నివాస్ ఆమెకు అభిముఖ ముగా కూర్చుని వున్నాడు.

సమీపంలో మరెవరూ లేరు.

"చెప్పండి" తేరుకుంటూ అడిగింది.

వెంటనే జవాబు చెప్పలేదు నివాస్.

మాట్లాడటానికి సంశయిస్తున్నట్టు రెండు క్షణాలపాటు మరెటో చూస్తూ వుండిపోయాడు.

"నాకు పనుంది"

అతడ్ని వదిలించుకోవటానికన్నట్టుగా లేవబోయింది.

"మీతో మాట్లాడాలి"

"దేని విషయంలో ?" ఈ ప్రశ్న అడిగిన నిర్ణయకే ఎబ్బెట్టుగానే వుంది. అతడు ఎవరి గురించి చర్చించేదీ ఆమెకీ తెలీని విషయం కాదు.

"నిన్న రాత్రి శ్యాంని పోలీసులు అరెస్ట్ చేశారు"

విభ్రాంతురాలైనట్టుగా చూసింది.

"అర్ధరాత్రిదాకా ఓ బార్‌లో బాగా తాగిన శ్యామ్ బార్ మేనేజర్‌తో గొడవపడి అతడ్ని కొట్టాడట."

"ఇవన్నీ నాకెందుకు చెబుతున్నారు ?"

"శ్యాం ఇలా మారింది మీ మూలకంగానే కాబట్టి"

హర్టయిపోయింది "వాడ్డూయూ మీన్?"

"అలా ఆవేశపడకండి నిర్ణయా...." క్షణం ఆగి అన్నాడు "శ్యామ్ నాకు ప్రాణస్నేహితుడని మీకూ తెలుసు. నా దగ్గర ఏ విషయం దాచడనీ మీకు తెలిసే వుండాలి."

నిర్ణయ మొహంలో రంగులు మారేయి "సోవాట్"

"జరిగింది నాకు చెప్పాడు"

తప్పు చేసినందుకు కాదుగాని ఆ తప్పు గురించి మూడో వ్యక్తితో చర్చించాల్సి వస్తున్నందుకు లజ్జగా వుంది.

"ఇలా మాట్లాడ్డం మీరు సహించలేరని నాకు తెలుసు. కాని నేను చెబుతున్నదొక్కటే....శ్యాంని కాపాడుకోవటంలో నాతోబాటు మీకూ బాధ్యత వుంది. ఎంత కాతందాకా మీరు బాధ్యత తీసుకోవాలీ అన్నది నేనూ చెప్పలేను కాని నాకన్నా మీరే ఎక్కువ శ్రద్ధ తీసుకోవాల్సిన అగత్యం వుందంటున్నాను."

నిర్ణయ కంపించిపోతూంది. "మీరు చాలా రబ్బిష్‌గా మాట్లాడు తున్నారు. అసలు శ్యామ్‌కి నాకూ సంబంధమేమిటి ? అతని గురించి నేనెం దుకు బాధపడాలి?"

"ఎందుకూ అన్నదానికి జవాబు నేను మరోసారి చెప్పాల్సిన అవస రము లేదనుకుంటాను నిర్ణయగారూ....నిజమే....చాలామంది అమ్మాయిల గురించి అలాగే ఆలోచించాడు శ్యామ్....మీ కన్నా ముందు చాలామందితో సంబంధాన్ని పెట్టుకున్నాడు. కాని ఎవరికోసమూ యింతలా ఉన్మాదాన్ని ప్రకటించలేదు. మీలో ఏం చూశాడో ఏం చూశాక ఇలా తయారయ్యాడో నాకు తెలీదుగాని మీ మూలంగా తన జీవితాన్నే ఇప్పుడు కోల్పోయేట్టు న్నాడు."

అతడి మాటలు జుగుప్సగా అనిపిస్తున్నా ఖండించలేకపోతూంది.

"ఇప్పుడు నన్నేం చేయమంటారు ?"

"పోలీసు కస్టడీనుంచి ఉదయమే బయటికి వచ్చాడు శ్యామ్. మరో సారి అలాంటి పరిస్థితికి దిగజారకుండా కాపాడండి."

"నేనెలా కాపాడను?"

"అతడికి మరింత దగ్గరై"

నిన్న మొన్నటిదాకా నిర్మయ దగ్గిర మాట్లాడటానికి సైతం జంకే నివాస్ ఇప్పుడు ఓ దిగజారిన ఆడదీమె అని తెలిసినట్టు నిర్భీతిగా తన అభిప్రాయాల్ని వ్యక్తం చేస్తున్నాడు.

"అవును నిర్మయగారూ.... జరగకూడదనిదైనా జరగాల్సింది జరిగి పోయింది. కాబట్టే తల్లిదండ్రులకి ఒక్కగానొక్క బిడ్డగా చాలా ఆస్తిపాస్తు లుండీ, ఈ ఫేక్టరీ ఎమ్.డి.కి కాబోయే అల్లుడిగా సుఖంగా బ్రతకటానికి చాలా అవకాశాలుండీ ఇప్పుడిలా తయారయ్యాడు. ఇందులో ఖచ్చితంగా మీ భాగ స్వామ్యం ఎంతన్నా కాని ఇప్పుడు మీరు చేయాల్సింది శ్యామ్‌కి మరింత దగ్గరై అతడ్ని మార్చాలి. అలా చేయకపోతే మీకు నష్టం ఏమిటీ అని మీరు అడగవచ్చు. చాలా వుంది. ఇప్పటికి అనుమానంగానేవున్న మీ సంబంధం రేపు నలుగురి దృష్టిలో నిజమవుతుంది. కాదు....అలా నిజమని పించేట్టుగా చేస్తాడు శ్యాం....ఉద్దేశ్యపూర్వకంగా అలా చేస్తాడనీ నేనడం లేదు నిర్మయగారూ....పరిస్థితులలా మారతాయీ అంటున్నాను....సో...." సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు. "ఈ సాయంకాలం ఆరు గంట లకి శ్యామ్ ఫ్లాట్‌కి మీరు వెళ్తున్నారు. నిజం చెప్పాలీ అంటే మీరు మాట నిలబెట్టుకోరన్న అనుమానంతోనే నిన్న రాత్రి శ్యామ్ బాగా తాగి అల్లరి చేసింది కూడా. అందుకని వస్తున్నట్టు వాడికి ఫోన్‌చేసి చెప్పండి. ఎప్పుడో కాదు····ఇప్పుడే...."

ఆమె నిస్సత్తువుగా కుర్చీలో చతికిలబడింది.

ఒక చిన్న తప్పుతో ఎందరు ఎన్ని అవకాశాలు తీసుకో గలుగు తున్నారు.

అసలు ఇది చిన్న తప్పేనా?

చిన్నదే అయితే తను సులభంగా కొనసాగించొచ్చుగా....

అది బాధో నిస్సహాయత అందించే ఉక్రోషమో ఆమె నేత్రాలు అరుణిమని పుంజుకున్నాయి.

"ఫోన్ చేయండి నిర్జయా...."

"సారీ" అసహనంగా చూసింది. "నేను చేయను....చేయలేను.... అసలు మీరు నా గురించి ఏమనుకుంటున్నారు మిస్టర్ నివాస్. ఓ పెళ్ళయిన ఆడదానితో ఇంత నిర్భయంగా ఇలాంటి మాటలు ఎలా మాట్లాడగలుగుతున్నారు ?"

"ఐ అండర్‌స్టేండిట్ మిసెస్ నిర్జయా...." ఓ రహస్యంలా అన్నాడు నివాస్. "మీరు జరిగిన సంఘటనకన్నా అది నాకు తెలిసినందుకు ఎక్కువ కలవరపడుతున్నారు. నన్ను నమ్మండి....మీ యిద్దరి విషయం నాలుగో కంటికి తెలీకుండా చూసే పూచీ నాది. మీకు తెలీదు....మీ మధ్య కమ్యూనికేషన్ సౌలభ్యంకోసం నాలాంటి ఓ మంచి స్నేహితుడి అవసరం చాలా వుంది."

అస్థిమితంగా కదులుతూ ఆమె తల పట్టుకుంది.

జరిగింది ఓ అనర్థమే అని యిప్పుడు స్పష్టంగా అర్థమైపోతూంటే అదీ యింకా జరగాలని ఆశిస్తూ ఇక్కడో వ్యక్తి బ్రోకర్‌లా మాట్లాడుతున్నాడు.

చదివిన చదువు చేస్తున్న ఉద్యోగ స్థాయి మరిచి ఏ స్వార్థంకోసమో చాలా నీచంగా మాట్లాడి నివాస్ ఇంకా దిగజారిపోతున్నాడు.

"ఆలోచించకండి నిర్జయా....ఫోన్ చేయండి....వాడక్కడ మీ కోసం వెయిట్ చేస్తుంటాడు."

"సారీ"

"ప్లీజ్"

"ఐ డోంట్" ఖండితంగా అంది. "ఐ డోంట్ వాంట్ టు స్పేర్ టు హిమ్. ఎందుకంటే జరిగింది ఇకముందు జరగకూడని విషయంగా నేను నమ్ముతున్నాను కాబట్టి."

"నేను చెప్పింది మీరు సరిగా అర్థం చేసుకోలేదని బోధపడింది"

"అర్థమైంది నివాస్....ఈ ఫేక్టరీలో మీరింకా ఎదగాలనుకుంటు న్నారు. కాబట్టి శ్యామ్‌కి సహకరించే ప్రయత్నం చేస్తున్నారు. నా దాంపత్య జీవితం ఏమౌతుందీ అన్న ధ్యాస మీకు లేదు....పైగా తప్పు చేయటం కన్నా చేయకపోతే వచ్చే చిక్కుల గురించి చిన్నపిల్లకి చెబుతున్నట్టు నన్ను చెబుతున్నారు. ఐ హేటిట్ నివాస్. ఈ అనుభవం, ఈ జీవితం అన్నీ అసహ్యమనిపిస్తుంటే ఇంకా శ్యాంతో మాట్లాడగలనని ఎలా అనుకుంటు న్నారు ?"

ఆమె వాక్యాలు ఇంకా పూర్తికానేలేదు. ఆమె టేబుల్‌పై వున్న ఫోన్ రింగయింది.

ఈ చర్చని త్రుంచేయటానికి అదో అవకాశంగా భావించిన నిర్ణయ వెంటనే రిసీవర్ అందుకుంది. "హల్లో...."

"నిర్ణయా....నేను శ్యాంని...."

అప్రతిభురాలైంది.

శ్యామ్ తన ఫోన్ కోసం ఇంతసేపూ వెయిట్‌చేసి యిప్పుడు సరా సరి తనే ఫ్లాట్ నుంచి ఫోన్ చేశాడు.

"మాట్లాడు నిర్ణయా...." శ్యామ్ గొంతులో ఆరాటం స్పష్టంగా తెలిసిపోతూంది. "నిన్నే...."

ఆమె చెప్పలేదు.

రిసీవర్ హుక్‌పై వుంచింది.

వచ్చిన ఫోన్ ఎక్కడనుంచో అర్థమైన నివాస్ రెప్పలార్చకుండా నిర్ణయని చూశాడు. "పరిస్థితిని అర్థంచేసుకోండి నిర్ణయగారూ...."

ఏమిటిది....

ఏ అధికారంతో యితనిలా మాట్లాడగలుగుతున్నాడు.

అసలు నివాస్‌ని కనురుకుని సాగనంపలేకపోయిందేం....

పవిత్రత అందించే నిబ్బరానికి పతనం తెచ్చే అధైర్యానికి లేడా అర్థమౌతుంటే ఆమె ఛాంబర్‌లోనుంచి బయటకు వెళ్ళబోయింది.

మళ్ళీ ఫోన్ రింగయింది.

శ్యామ్ నుంచే....

ఫోన్ క్రెడిల్ చేసింది మళ్ళీ.

ఇక అక్కడ వుండలేనట్టు వేగంగా షాప్ ఫ్లోర్‌కి నడిచింది.

పది నిమిషాలపాటు అసెంబ్లీ సెక్షన్‌లో నిలబడి ఏకాగ్రతని పాటించబోయింది. కాని సాధ్యపడటంలేదు.

మనసు ఏదోలా అయిపోతూంది.

అక్కడ పనిచేసే వ్యక్తుల మొహంలో ప్రశాంతతని చూస్తూ కేవలము తను మాత్రమే కూడని అశాంతితో నలిగిపోతున్నట్టు అర్థం చేసుకుంది.

అక్కడా వుండలేకపోయింది.

సీటు దగ్గరికి వెళ్ళాలని లేదు.

అసలు చుట్టూ చాలామంది వున్నా ఆమెను ఒంటరితనం ఆవహించి భయపెడుతూంది.

"మేడమ్"

ఎవరో పిలిచినట్లయి వెనక్కి తిరిగింది.

ఫ్యాక్టరీ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్ ఆపరేటర్ రాజు నిలబడివున్నాడు. "శ్యాంగారు లైనులో వున్నారు. మీరు మీ సీటు దగ్గిరకొచ్చి అవుట్ సైడ్ కాల్ని మాట్లాడితే బెటర్."

ఆశ్చర్యంగా చూసింది.

సామాన్యంగా ఎక్స్ఛేంజ్ బోర్డు వదిలి బయటకురాని ఆపరేటర్ అవతల ఆదేశం అంది ఫ్యాక్టరీ ఎమ్. డి. బంధువుకాబట్టి యిలా పరుగెత్తు కొచ్చాడు

నిర్ణయ వెంటనే వెళ్ళివుంటే మరోలా వుండేది.

కాని మొండిగా అంది. "ఇప్పుడు ఖాళీలేదని చెప్పు"

అసెంబ్లీ సెక్షన్లోని కార్మికులొకరిద్దరు ఆసక్తిగా విన్నారామె మాటల్ని.

"ఇప్పటికి పదిసార్లయినా శ్యాంగారు ట్రై చేశారు మేడమ్" నచ్చ చెప్పబోయాడు రాజు.

"ఇష్టంలేదని చెప్పానా"

వెంటనే ఎక్స్ఛేంజ్ రూమ్కి వెళ్ళాలనుకున్న రాజు చివరగా అన్నాడు. "మీ యిష్టం మేడమ్. కాని ఆయన చెప్పినట్టు మీరు చేయకపోతే సాయంకాలానికల్లా ఆయనన్నది నిజం చేస్తానన్నారు."

చెప్పకూడదనుకుంటూనే అంతా చెప్పిన రాజు వెళ్ళిపోవడంగాని ఆ మాటలు అక్కడ చాలామందికి వినిపించాయన్న విషయంగాని నిర్ణయ పట్టించుకోలేదు.

అసలు తాగిన మైకంలో శ్యామ్ ఆపరేటర్తో ఏ స్థాయిదాకా మాట్లాడిందీ, ఏమేం కక్కేసిందీ నిర్ణయకి తెలీదు.

తెలిసివుంటే ఏంచేసేదోగాని ఒకరిద్దరి చూపులు కొ స్త యిబ్బందిగా అనిపించడంతో సాలోచనగా ముందుకు నడిచింది.

చాలా సంబంధాల గురించి ప్రపంచానికి అంతగా అసక్తి ఉండదు. కాని అక్రమ సంబంధాల విషయంలో మాత్రం ప్రాణంలేని గోడలకీ చెవు లొస్తూంటాయి. కుర్చీలు, బెంచీలు సైతం చర్చించుకోవటం ప్రారంభిస్తాయి.

ప్రపంచం మాట ప్రస్తుతానికి అటుంచితే చాలా పరిమితమైన వ్యక్తుల సంఖ్యగల ఫేక్టరీలో మాత్రం రాజుద్వారా యీ విషయం మధ్యాహ్నానికల్లా పొక్కిపోయింది.

స్థాయీ భేదం లేకుండా ఎగ్జిక్యూటివ్స్ మొదలుకుని మామూలు కార్మి కులూ ఈ విషయం చర్చించుకోవటం ప్రారంభించారు.

ఎందుకంటే నిర్ణయ అందగత్తె అయినందుకే కాదు చాలా అభ్యు దయ భావాలున్నట్టుగా కనిపించే వివాహిత స్త్రీ కాబట్టి.

దురదృష్టం ఏమిటంటే ఈ చర్చల సారాంశం ఆమెదాకా వెళ్ళలేదు.

* * * *

"వెర్రిబాగుల శ్రీహర్షకి....

ప్రేమ వివాహాలన్నీ యిలా ఏడుస్తాయో లేక యిలా తగలడే దాంప త్యాలు ప్రేమికుల కులంలో సహజమో తెలీదు. కాని మీ ఆవిడమాత్రం ప్రస్తు తము అక్రమ సంబంధంతో చాలా హాయిగా బ్రతికేస్తోంది....ఆశ్చర్యపోకు- ఆ విషయం చాలామందికి తెలిసిపోయింది కూడా. ఎక్కడ? ఎలా? అని తెలుసుకోవాలీ అంటే ప్రశాంత్ టవర్స్ ఫ్లాట్ నెంబరు మూడువందల రెండు లోకి తొంగిచూడు....

అకాశరామన్న"

ఉత్తరం చదువుతున్న శ్రీహర్ష నుదుట స్వేదం పేరుకుంది.

ఒకసారి కాదు రెండుసార్లు చదివాడు. పైనున్న ఎనవలప్‌నీ, ఉత్తరాన్నీ పదే పదే చూస్తూ సన్నగా కంపిస్తున్నాడు.

అది మిట్టమధ్యాహ్నం వేళ అయినా మంచు ముద్దలపై నిలబడినట్టు ఇబ్బందిగా కదిలి డ్రాయింగ్ టేబుల్‌పై మోచేతుల్ని ఆనించాడు.

ఆఫీసులోని జనం ఎవరి పనుల్లో వాళ్ళు బిజీగా కదుల్తున్నారు.

అపరిచిత గాయంలా ఈ ఉత్తరం యింత అలజడిని కలిగిస్తూందేం? మనసు మండుతున్న లాక్షాగృహంలా కలవరపడిపోతూంది.

ఛ! ఛ....

ఇది నిజం కాదు....

నిజమెలా అవుతుంది ?

స్వప్నానికి స్వప్నానికి మధ్య దొరికే చిన్న విరామం అణువంత అపార్థంగా మారుతున్నా యిప్పుడిప్పుడూ ఆ వ్యవధినీ స్మృతుల పూలను మాలలుగా పేర్చుకుంటున్నాడుగా....

మరిదేమిటీ ?

ఎవరు రాసిందిది ?

నిజమో కాదో తెలీకుండానే మనసెందుకింత మూగబాధతో నలిగిపోతూంది ?

ఒకటి రెండు కాదు దాంపత్య జీవితంలోని చాలా సంఘటనలు వరుసగా గుర్తుకొచ్చి అతడ్ని వివశుడ్ని చేస్తుంటే యిక ఆఫీసులో వుండలేనని పించింది.

"ఏంటలా వున్నావ్?"

ఎప్పుడొచ్చావోదో శంకర్ అడిగాడు సమీపంలో నిలబడి....

ఉద్వేగ్నంగా లెటరు తీసి జేబులో దాచేశాడు శ్రీహర్ష....

శంకర్ మరింత నివ్వెరపోయాడు "ఏమిట్రా.... ఏదో ప్రేమలేఖని దాస్తున్నట్టు యీ హడావుడి దేనికి?"

"ఏం లేదు"

"ఏమీ లేకపోతే మొఖమేం అలా వుంది."

శంకర్ అప్పుడప్పుడూ యిలా పనిగట్టుకుని మాట్లాడటం మామూలే.

కాని శ్రీహర్ష రోజూలా నవ్వేయలేకపోయాడు.

తడిసిపోయిన యిసుకలాంటి దాంపత్య జీవితం.... మున్నెప్పుడో పాదాల చుట్టూ పిచ్చుక గూళ్ళను కట్టుకున్న జ్ఞాపకాల తారాతోరణం.... ప్రేమించిన వ్యక్తి చిటికెన వేలు పట్టుకుని మేఘాల రహదారుల ప్రయాణము....

ఏమిటీ.... ఇవన్నీ వరుసగా యిలా గుర్తొస్తున్నాయేం....

ఇది వ్యధా కాదు....శత్రువెవరో తెలీని స్థితిలో గుండె కాన్వాసుపై బాధగా చిత్రించుకునే బాధాకరమైన స్వరూపం....

శాశ్వత మౌన ప్రవాహంలోకి నడుస్తున్నట్టు వెళ్ళిపోతున్నాడు అతను.

శంకర్ స్థాణువులా నిలబడిపోయాడు.

కాని దూరంనుంచి ఇదంతా గమనిస్తున్న శర్మ యింత కాలానికి శ్రీహర్షనిలా చూస్తున్నందుకు తను రాసిన ఉత్తరం యింత బలంగా పని చేసినందుకు ఉత్సాహపడిపోతున్నాడు.

శ్రీహర్ష యిప్పుడు ఎక్కడికి వెళ్తాడు?

తన ఇంటికా, ఫ్లైట్‌లో శత్రువుని కలుసుకోటానికా!?

జవాబు శర్మకి తెలీదు.....

అసలు అతనికైనా తెలిస్తేగా?

బాధాకరమైన అతడి జీవితాన్ని మరో మలుపు తిప్పిన సంఘటనకిది తొలిక్షణమైపోయింది.

సరిగ్గా ఇదే సమయంలో....

శ్యాం ఫ్లైట్‌లో అడుగు పెట్టింది నిర్జయ....

ముందు నమ్మలేనట్టుగా చూసేడు.

మరుక్షణం తాగుతున్న విస్కీ బాటిల్‌ని టీపాయ్‌పై వుంచి "వెల్‌కమ్" అన్నాడు.

నిర్జయ కూర్చోలేదు.... సీరియస్‌గా చూస్తూంది.

అదేమీ పట్టించుకోలేదు శ్యాం...."నాకు తెలుసు నిర్జయా....నువ్వు తప్పకుండా వస్తావని తెలుసు.... తెలీనిది నువ్వు రెండు గంటల ముందే వస్తావన్న విషయం...."

సాయంకాలం నాలుగు గంటలకే అక్కడికి వచ్చిన ఆమె నిజానికి వచ్చింది అతడ్ని నిలదీసి వెళ్ళాలని....

అది నిజమో కాదో కాని అలా అనుకునే ఆమె వచ్చిందక్కడికి.

"ఎందుకు నన్నిలా సాధిస్తున్నావ్" సూటిగా అడిగింది.

ముందు అర్థం కాలేదు....

"నిన్ను నేను...." బడలికగా నవ్వేశాడు శ్యాం "సాధిస్తున్నానా?"

"మరి దీన్నేమంటారు....?" ఆమె కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరుగుతుంటే ఉక్రోషంగా అంది....

"ఏ దురదృష్టకరమైన క్షణమో నిన్ను నాకు పరిచయం చేసింది.... మరో దురదృష్టం శారీరకంగా మనల్ని కలిపింది.... దానికే నేను కుమిలిపోతుంటే యిప్పుడు మన పరిచయం గురించి నివాస్‌కి చెప్పడంలో నీ వుద్దేశ్యం ఏమిటి? మన సంబంధమే అక్రమమైనదైతే యిలా మరో మనిషికి తెలియ చెప్పాలని ఎందుకనుకున్నావ్?"

"నివాస్ నా స్నేహితుడు...."

"కావచ్చు. కాని రేపు నివాస్ మరో మనిషికి చెబుతాడు."

"చెప్పనియ్...."

"చెబితే నీకేం కాదు శ్యాం. కాని నా దాంపత్యం కూలిపోతుంది"

"కూలిపోనీయ్" మృదువుగా నవ్వాడు శ్యాం, "నీకు నేనున్నాను."

"అసలు నా గురించి నువ్వేం అనుకుంటున్నావ్" ఇది ప్రశ్న కాదు. తప్పు చేసిన తన గురించి నలుగురూ ఏమనుకుంటున్నారనే సందిగ్ధతతో ఆ స్థితిలో వున్న ప్రతి అమ్మాయీ ఆత్మ విమర్శలా ప్రకటించే ఆందోళన "ఒక వ్యక్తిని ప్రేమించి ఆ ప్రేమ కోసం అందర్నీ కాదని వచ్చి భార్యగా స్థిరపడ్డ నేను...."

"బుల్‌షిట్...." ఆవేశంగా అరిచాడు "భార్యవయ్యావేమో కాని భార్యగా ఎక్కడ స్థిరపడ్డావ్.... స్థిరపడటమే నిజమైతే ప్రతిరోజూ ఫ్రస్ట్రేషన్‌తో ఎందుకు నలిగిపోయేదానివి. కాదని బుకాయించకు నిర్మలా! నువ్వు శ్రీహర్షను పెళ్ళి చేసుకున్నావేమోగాని భార్యవి కాలేకపోయావు.... భార్యవి అయ్యుంటే మన మధ్య తొలిసారి జరిగిన అనుభవం తర్వాత నా

మీద ద్వేషంతో పూర్తిగా దూరం జరిగేదానివి. కాని నువ్వలా చెయ్యలేక పోయావూ అంటే కారణం నీకు నీ భర్తతో సుఖం లేదు.... నువ్వు కోరు కున్న సుఖం ఖచ్చితంగా నా దగ్గర పొందావు.... అందుకే...."

"యూ డేమ్ రిచ్చెడ్ ఫెల్లో...." ఆవేశంగా అతడి కాలరు పట్టు కుంది.... పిచ్చిదానిలా వూగిపోతూ అరిచింది "నా భర్త దగ్గర నాకు సుఖం లేదని నేను నీ వెంట పడ్డానా.... మతిభ్రమించినవాడిలా వూబిలో కూరుకు పోయి ఛస్తున్నావని జాలిపడి నీ దగ్గరకు వస్తే అది నీతో సుఖం కోసం రావడమంటావా.... అసలు ఫేక్టరీకి కట్టుకున్న భర్తలా ఫోన్ చేసి ఆప రేటర్ తో కబురు చేయించటానికి నీకెన్ని గుండెలు."

"ఉన్నదొకటే గుండె నిర్జయా" ఒక తిరుగులేని గెలుపుతో సాధిం చిన నిబ్బరం శ్యాంలో "ఆ గుండెనిండా నీ రూపమే నిండివుంది. అందుకే ప్రతి క్షణమూ నిన్ను నాదాన్ని చేసుకోవాలని తపించిపోతున్నాను."

"జరిగింది చాలు.... ఇక వెళ్తాను"

"మొన్న వచ్చినప్పుడూ యిలానే అన్నావ్.... ఈ రోజూ అదే అంటున్నావ్."

అమాంతం పట్టు సడలించి దూరం జరగబోతుంటే యిప్పుడు శ్యాం ఆమెను ఒడిసి పట్టుకున్నాడు. "నువ్వు నన్ను పిచ్చిగా కోరుకుంటున్నావ్ నిర్జయా. కాకపోతే యిది తప్పు అన్న ఆలోచన నిన్ను డామినేట్ చేస్తుంటే వుత్సాహంగా సెక్స్‌ని కోరుకోలేకపోతున్నావ్.... తప్పులేదు నిర్జయా. ఎంత చదువుకున్నా యిది చాలా సహజమైన రియాక్షనే.... కాదనను.... కమాన్.... రా!"

ఆమెను పైకెత్తుకుని బెడ్‌రూంలోకి లాక్కుపోవాలనుకున్నాడు.

ఆమె మొన్నటిలా సహకరించలేకపోయింది.

ఈ జీవితంనుంచి జుగుప్సాకరమైన యీ బంధంనుంచి దూరంగా పారిపోవాలనుకుంటూనే అతడ్ని విదుల్చుకుంది.

అవశేషంగా మిగిలిన దాంపత్య జీవితమే యింతకన్నా నయమను కుందో లేక అతడిపై తనకు కాంక్షలేదని నిరూపించాలనే భావించిందో బ్లౌజ్ హుక్స్ తెగిపోయినా పట్టించుకోకుండా దూకుడుగా ద్వారాన్ని చేరు కుంది.

"నిర్మలా! ప్లీజ్"

ఒక్క అంగలో ఆమెను చేరుకున్న శ్యాం ఆమె పీరచెరగును పిడి కిలి మధ్య బిగించి దగ్గరకు లాక్కోబోయాడు.

అప్పటికే ఆమె ద్వారం తెరిచింది.

అంతే....

షాక్ తిన్నట్టుగా నిలబడిపోయింది.

దట్టమైన నిగూఢ రహస్యాన్ని దాచుకున్న అరణ్యపుటలా స్వర్గ నరకాల మధ్య సరిహద్దు రేఖలా శ్రీహర్ష నిలబడి వున్నాడు అభిముఖంగా.

హఠాత్తుగా అక్కడి వాతావరణం గడ్డకట్టుకుపోయింది.

అదీ కొంతసేపే....

పతనమైన ఏ సంసార స్త్రీ అయినా ఎన్నటికీ జరగకూడదని కోరు కునే సన్నివేశమది.

పాత ఇటుకల గుట్టలో మెలితిరిగి పడుకున్న సర్పాల్లా ఆమెను ఏ జ్ఞాపకాలో కాటువేస్తుంటే మనసు రోదసిలో ఉవ్వెత్తున లేచిన ఓ తుఫాను కెరటం ఆమె కళ్ళనుంచి రెండు నీటి బొట్లుగా చిమ్మింది.

అయిపోయింది....

సీరవసుందర హృదయపాత్ర పగిలింది.

పరతెంచే ప్రేమ పుష్ప పరాగం దుర్గంధమైపోయింది.

స్వప్నాల రహదారిలో నిలబడ్డ గూఢచారిలా కాదు.

నడవాలనుకున్న పాదాలు రక్తసిక్తమౌతుంటే లేని శక్తిని కూడగట్టుకున్నట్టు తల వంచుకున్నాడు....

ఆమె అనుమతిని కోరుతున్నట్టు అడిగాడు "వెళ్తానూ"

*　　*　　*　　*　　*

అర్ధరాత్రి...

ఆకాశమంతా ఏకాంతం లాంటి నిశ్శబ్దం.

స్మశాన స్తబ్ధత పేరుకున్న గదిలో నిస్త్రాణగా నిలబడ్డ శ్రీహర్ష అంతసేపూ ఏం ఆలోచించినాగాని చాలాసేపటి తర్వాత చూశాడు ఓ మూల మోకాళ్ళపై తలుంచి కూర్చున్న నిర్ణయని.

ఓదార్పులకీ, ఉపశమనం అందించటానికీ అతీతమైన స్థితి అది....

కన్నీళ్ళ ఉరికొయ్యలు ఏ కలల కంఠాలనో నులిమి ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే అతదేం మాట్లాడగలడని....

ముగింపులాంటి దశలో ఎవరు ఎవరిని ఓదార్చాలి.

పట్టుబడగానే ప్రాణం తీయాల్సినంత ఉన్మాదాన్ని ప్రకటించాల్సిన మగాడు యిక్కడ సమాధిలోకి జారిన రుషిలా ఉండిపోయాడు చాలా సేపటి దాకా.

"జరిగింది తప్పో, ఒప్పో యిప్పుడు మాట్లాడుకోవటం అనవసరమని నాకు తెలుసు నిర్ణయా....కాని...." అరుణిమ నిండిన అతని నేత్రాల నుంచి రెండు నీటిబొట్లు ఉబికి నేలపైకి జారేయి. "నా మూలంగా నువ్వు

సుఖపడటం లేదని బోధపడిపోయింది. నిజమే....నీకేం యివ్వగలిగానని.. యివ్వటానికి నా దగ్గర ఏముందని ఎక్కడ పుట్టానో, ఎలా శరణాలయంలో జీవితం ప్రారంభించానో తెలీని అనామకుడ్ని. నా జీవితంలో నువ్వు అడుగు పెట్టడం అదృష్టమనుకున్నానుగాని, అలాంటి అదృష్టాన్ని శాశ్వతంగా నిలుపుకోటానికి శక్తిలేనివాడ్ని....అందుకే యీ రోజు జరిగిందానికి నిన్ను నేను ప్రశ్నించడంలేదు .... ఎప్పుడూ ఏమీ లేనివాడిగానే బ్రతికిన నేను యిప్పుడూ లేనివాడిగానే బ్రతకటానికి సిద్ధపడుతున్నాను....అయితే ఒక్క మాట...."

గుండె గొంతుక్కి అడ్డం పడినట్టు ఆగేడు క్షణంపాటు "ఇప్పటికీ నీ నిర్ణయానికే నేను కట్టుబడే వుండాలనుకుంటున్నాను. ఒకనాడు నాకోసం అందర్నీ కాదని వస్తానని నువ్వు ఉత్సాహపడినప్పుడు వారించలేకపోయిన శ్రీహర్షగా యిప్పుడూ నీ మాట ప్రకారం నడుచుకోవాలనుకుంటున్నాను... ఆ రోజు నీ మాట నీ తల్లిదండ్రులు అంగీకరించలేదు. కాని నేను ఒప్పుకుంటాను...."

అతడి సాత్వికత ఆమె గుండెల్ని రంపంలా కోస్తూంది.

"గతాన్ని మరిచి నాతో రాజీపడాలనుకుంటున్నావా లేక...." జుగుప్సగా, బాధగా మనసు మెలితిరిగిపోతున్నా అడిగాడు "వర్తమానాన్ని జీవితంగా మార్చుకోవాలనుకుంటున్నావా."

ఆమె జవాబు చెప్పలేదు.

"అదికాదు. తప్పుచేసింది తానైతే తప్పంతా తనదే అన్నట్టు శ్రీహర్ష ప్రవర్తించడాన్ని భరించలేకపోతూంది."

"నిర్ణయా...." అది వేదనో వేదనకి అంతంలాంటి స్థితో రెట్టించాడు మళ్ళీ "నీ అభిరుచులకి దగ్గరైన జీవితం శ్యాం నుంచి దక్కితే నీ గమ్యం

అతడిగానే మార్చుకో .... లేదా ఇది క్షణికంగా జరిగిన పొరపాటే అని పిస్తే...."

అప్పుడు చూశాడు నిర్ణయ అశ్రుసిక్త నయనాల్ని.

"ఏ భర్తా యిలా మాట్లాడడని నాకుతెలుసు నిర్ణయా. ఇలా మాట్లాడే మగాడు సంఘం దృష్టిలో ఓ నపుంసకుడన్న విషయమూ నాకు తెలియనిది కాదు. కాని నా కోసం చాలా జీవితాన్ని కాలదన్ని వచ్చేవుగా. వచ్చేక సుఖంలేకనే మరో మార్గంలో అడుగు పెట్టావుగా. అందుకే నిర్ణయం నీకు వదిలి పెడుతున్నాను...."

అప్పటికీ నిర్ణయ మాట్లాడలేదు.

ఒక అసమర్థుడైన మగాడిగా సంఘం ఎత్తి చూపే వ్యక్తిత్వంలో సమర్థతకి పరాకాష్టని తన ముందు తెలియ చెబుతున్నాడు.

ఆమె నిశ్శబ్దంగా చూస్తూంది.

అనంతందాకా విస్తరించిన చీకటి....ఆకాశంలోకి ఎగిసిన నీరవత పగిలిన స్వప్న శకలాల్లాంటి నక్షత్రాలు........

ముగ్ధ మోహనంగా అల్లనల్లన కదిలి సౌందర్య సౌధాల మణి కవాటాల్ని తెరుచుకుని ఆలనాడు అతడి జీవితంలో అడుగు పెట్టిన ఓ ముగ్ధ....

కోరిన దాంపత్య జీవిత ఇంద్రధనుస్సుపై నడుస్తూ బ్రతుకు గాంధర్వాన్ని గ్రోలుతూ సుదూర తీరాలదాకా సాగిపోవాలనుకుంటూనే కోరని మార్గంలో అడుగు పెట్టిన ఓ మగనాలి.....

వింటున్నది నిజమూ లేక చూస్తున్న ఆ వ్యక్తి స్వప్నమా అనుకుంటుండగా శ్రీహర్ష బయటికి నడిచాడు నిశ్శబ్దంగా....

* * * * *

"మవ్వా!"

ద్వారం తెరిచిన శ్యాం ఎదురుగా నిలబడ్డ శ్రీహర్షని చూసి అదిరి పడ్డాడు.

నిన్న సాయంకాలం శ్రీహర్షతో పాటు విర్జయ పెళ్ళాళ చాలా కంగారుకి లోనయ్యాడు శ్యాం. ఏ భర్తా కూడా భరించలేని అలాంటి సమయంలో మగాడన్న వాడెవడూ అంత నిశ్చలంగా నిలబడడు... ఇద్దర్నీ నరికి పోగు లేసేవాడు. శ్రీహర్ష అలా చేయకపోవడం కనీసం పల్లెత్తు మాట అనకుండా వెళ్ళిపోవటం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

శ్యాం అనుమతి కోసం ఎదురు చూడకుండా లోపలికివచ్చిన శ్రీహర్ష ఓ సోఫాలో కూర్చున్నాడు.

రాత్రి యింటి నుంచి బయలుదేరిన శ్రీహర్ష మళ్ళీ యింటికి వెళ్ళ లేదు రాత్రంతా....

ఓ పార్కులో బెంచీపై కూర్చుని జాగారణలా గడిపేశాడు.

అలా గడపడమూ అతడికి పెద్ద సమస్య కాలేదు.... ఇప్పుడిప్పుడు ఆశావాదంగా జీవితం గురించి ఆలోచించటం అలవాటు చేసుకున్నాడేమో. కాని అసలు యిలాంటి ఒంటరితనం బాల్యం నుంచీ ఉన్నదే...

పాతికేళ్ళ జీవితంలో తనకు దేవుడిచ్చింది సంఘర్షణేగా.

ప్రేమా, పెళ్ళి తప్ప ఏనాడూ బ్రతుకు ఉత్సాహపూరితంగా లేదని అతడికి తెలుసు.

రెప్పల చూరునుంచిరాలిన దారలాంటి స్వప్నాలసుషుప్తిలో ఎన్నెన్ని జ్ఞప్తికి వచ్చాయని.

చాలా ఆలోచించాక యిటు వచ్చాడు.

ఇప్పటికీ నిర్మయపై అతడికి కోపంలేదు. ఆమె జరిగించానికి పశ్చాత్తాపపడి వుంటే ఈ రోజు నుంచీ మళ్ళీ దాంపత్య జీవితాన్ని ప్రారంభించే వాడే....

కాని నిర్ణయ మౌనంతో అర్థమైపోయింది.

శివను మించిన ఆనందం శ్యాం నుంచి ఆమె పొందగలుగుతూంది. కానినాడు నిర్ణయ యింత సాహసం చేసేది కాదుగా.

"ఏమిటిలా వచ్చారు?"

ముందు ఏక వచనంతో పలకరించిన శ్యాం ఇప్పుడు శ్రీహర్ష ఇంత ప్రశాంతంగా కూర్చోవడంతో గౌరవంగా అడిగాడు మనసులో కాస్త అల జడిగా వున్నా.

"టీ, కాఫీ..."

వద్దన్నట్టు వారిస్తూ చేతిని పైకి ఎత్తిన శ్రీహర్ష సాలోచనగా చర్చ ప్రారంభించాడు.

"నిర్ణయ మీకు ఫేక్టరీలో చేరాకనే పరిచయం అనుకుంటాను."

జవాబు చెప్పలేదు శ్యాం. చెప్పటానికి సాహసం చేయలేకపోయాడు.

తోడబుట్టిన చెల్లెలు మనసు తెలుసుకుని ఆమె ప్రేమించిన వ్యక్తి దగ్గరికి వచ్చి విషయం అడిగేపే అన్నయ్యల్ని చూశాడు....

కన్న కూతురు కాలుజారి కడుపుచేసుకుంటే కారణం అయిన మగ వాడ్ని నిలదీయటానికి వచ్చే తండ్రుల్ని చూశాడు.

కానీ....

కట్టుకున్న భార్య మరోడితో అక్రమసంబంధం పెట్టుకుంటే తీరు బాటుగా ఆ విషయం మాట్లాడగలిగే భర్తను చూడటం యిదే తొలిసారి....

"ఈ ప్రశ్నలతో నేను మిమ్మల్ని నిలదీయాలనుకోవటంలేదు శ్యాం గారూ....కొన్ని వాస్తవాల్ని తెలుసుకోవాలనుకుంటున్నాను... ఎందుకంటే నేనూ ఓ నిర్ణయం తీసుకోవాలిగా...."

"నిర్ణయను అడగాల్సింది."

"నిన్న నిర్ణయతోపాటు మీరు నా ఇంటిలో అలాంటి స్థితిలో కనిపించి వుండే విషయం ఆమెనుంచి తెలుసుకునేవాడిని. నిర్ణయను చూసింది మీతో."

చాలా ప్రశ్నల్ని సమాధానాల్ని మూడు వాక్యాల్లో ఇమిడ్చి అడిగాడు శ్రీహర్ష.

"నిర్ణయ ఇక్కడికి వచ్చింది ఆమె యిష్టంపైనే అన్నది నిన్ననే అర్థమైపోయింది. కాని ఆమె అంటే మీకెంత ఇష్టమో నాకు తెలుసుకోవాలనుంది. అంతే."

ఆవేశాన్ని ప్రదర్శిస్తే ఘాటుగా జవాబు చెప్పగలిగేవాడే.

కానీ చాలా సున్నితమైన ప్రశ్నతో ఇబ్బందికి గురిచేస్తున్నాడు శ్రీహర్ష. ధైర్యం చాలడంలేదు.

టీపాయ్‌పై వున్న లిక్కర్ బాటిల్ అందుకుని పరగడుపునే రెండు గుక్కలు తాగేశాడు శ్యాం.

ఖరీదయిన ఫర్నిచర్ డబ్బున్న వాడనిపించే ఇంటిలో అలంకరణ చాలా ఆధునికంగా బ్రతకగలనని నిరూపించటానికి ఉదయాన్నే తాగడం అన్నీ సమన్వయ పరుచుకుంటూ అన్నాడతను.

"నిజానికి నిర్ణయ కోరుకున్న జీవితం మీ స్థాయికి చెందింది. కానీ దురదృష్టవశాత్తూ నాకు భార్యయిపోయింది. బహుశా అందుకే అడ్జస్టు కాలేకపోయింది."

"అఫ్‌కోర్స్...." లిక్కర్ అందించి మత్తు ఇప్పుడు శ్యాంలో పని చేయడం ప్రారంభమైంది.

"ఆ విషయం నాకూ అర్థమైంది."

"నాకు ముందే అర్థమై వుంటే...." నిర్వేదాన్ని ఉద్వేగ్నత డామి నేట్ చేస్తూంది.

"నేను నిర్ణయని నా జీవితంలోకి రానిచ్చేవాడ్ని కాదు....బట్.... ఆమె ఏమిటో తెలుసుకునేసరికి ఆలస్యమైపోయింది."

"బెటర్ లేట్ దేన్ నెవ్వర్."

"యూ ఆల్‌రైట్ మిస్టర్ శ్యాం....అందుకే అడుగుతున్నాను. ఒక వేళ నిర్ణయ నుంచి దూరంగా జరిగితే...."

ఎందుకో గుండె కలుక్కుమంది. అయినా శ్రీహర్ష నిభాయించు కున్నాడు.

"మీరు ఆమెకు భర్త కాగలరా...."

"అభ్యంతరం లేదు. కానీ నిర్ణయ అంగీకరించాలిగా?"

జివ్వున పైకెగిసిన రక్తం క్షణంలో శ్రీహర్ష కళ్ళలో నిలిచింది.

అనుభవానికి ఓ ఆడది కావాలి. కానీ ఆమె మాత్రం మరో వ్యక్తికి భార్యగా వుండాలి.

నిగ్రహాన్ని కోల్పోకుండా అడిగాడు శ్రీహర్ష. "మీరెప్పుడూ అడగ లేదా?"

"అడిగాను. కానీ చాలా అభ్యుదయ భావాలుగల ఆడపిల్లలా కని పిస్తూ ఆ టాపిక్ వచ్చేసరికి మధ్యతరగతి అమ్మాయిలా సంఘం సాంప్ర దాయాలా అంటూ దాటేస్తూంది."

"బుజ్జగించి బెడ్‌దాకా రప్పించుకోగలిగిన మీకు ఆ మాత్రం ఒప్పించడం కష్టం కాదనుకుంటాను?"

"ఒప్పించాల్సిన అగత్యంలేదు. మీరు వదిలేయండి చాలు."

శ్రీహర్ష పిడికిళ్ళు జుగుప్సగా బిగుసుకున్నాయి.

నిర్జయ దగ్గరయిన శ్యాం ఓ అవకాశవాదిలా మాట్లాడుతున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" రెట్టించాడు మళ్ళీ బాటిల్ అందుకుని.

"యస్ మిస్టర్ శ్రీహర్షా....ఇంత జరిగాక ఇంకా ఆమెను భార్యగా అంగీకరించటం మీకు సాధ్యంకాని విషయం కాబట్టి ఆమెను విడిచిపెట్టండి. మిగతావి మేం డిసైడ్ చేసుకుంటాం."

"నేనేం చేయాలో మీరు నాకు చెప్పనవసరం లేదు శ్యాం....మీరేం చేయాలనుకుంటున్నారు....?"

శ్రీహర్ష వాక్యాలింకా పూర్తికాకముందే అర్థోక్తిగా అన్నాడు శ్యాం ఎగతాళిగా.

"చెడిన ఆడదాని విషయంలో ఇలాంటి శ్రద్ధ తీసుకోగలిగే భర్తలూ వుంటారని నిరూపించగలుగుతున్న శ్రీహర్షగారూ....మీకు నా జోహార్లు.... మేమేం చేసేదీ మాకు తెలుసు..... ముందు మీరేం చేసేదీ నిర్ణయించుకోండి...."

నిర్జయ తప్పటడుగు వేసిందని తెలుసు కానీ ఓ వంచకుడి వలలో కోరి అడుగుపెట్టిందని యిప్పుడే బోధపడింది.

నిస్త్రాణగా పైకి లేచాడు శ్రీహర్ష.

"ఏం వెళ్ళిపోతున్నారు?"

"అర్థమైంది."

"ఏమిటి?"

"నువ్వు అవకాశవాదివి....నిర్ణయని ట్రాప్ చేశావు తప్ప నిజంగా నీకు నిర్ణయంటే ఆసక్తి లేదని"

"వండర్ ఫుల్....తెలిసిందిగా" విజయగర్వంతో నవ్వేశాడు శ్యాం.

"ఇప్పుడేం చేయాలనుకుంటున్నారు....ప్రేమించి పెళ్ళిచేసుకున్న నిర్ణయ నింకా ఏలుకుంటారా. లేక మెడపట్టి ఆమెను బయటికి గెంటేస్తారా"

కోపగించుకోలేదు శ్రీహర్ష.

జాఘాకరంగా చూశాడు.

దాంపత్య జీవితపు కూడలిలో నిలబడి కూడని తొందరపాటుతో అర్థంలేని మిథ్యా లిపి రాయబడిన వాక్యం చదివిన నిర్ణయ మనసేమిటో ముందే చెప్పివుంటే బాగుణ్ణన్న ఆలోచన....

ఇంటి సరిహద్దుల్ని దాటి తనదాకా వచ్చిన ఓ యువతి యీ మిథ్యా భ్రాంతికోసం ఎందుకింత పతనమైందీ అన్న బాధ అతడ్ని కలవరపరు స్తుంటే నిర్లిప్తంగా అన్నాడు శ్రీహర్ష.

"తనంతట తానుగా నిన్ను కోరుకుందో లేక తొందరపాటుతో నీ ఊబిలో కూరుకుందో నాకు తెలీదు కాని నిర్ణయ చేసిన తప్పుకన్నా ఆ తప్పు నీలాంటి నికృష్టుడ్ని నమ్మి చేసినందుకు ఆమెను క్షమించలేకపోతు న్నాను."

"చేసిందీ కాదు. అలవాటు పడింది కాబట్టి ఇంకా చేస్తూనే ఉంటుంది, అది గుర్తుంచుకో."

ఒకవేళ నిర్ణయని శ్రీహర్షని మానసికంగా ఇంత బలహీనుడ్ని చేసి వుండకపోతే శ్యాంకి చాలా బలంగా బుద్ధి చెప్పేవాడే.

కానీ తనను అసమర్థుడైన భర్త స్థానంలో నిలబెట్టిందామె.

"మీ మిథ్యా విలువల గురించి నాకు తెలీదు మిస్టర్ శ్యాం. అంత గొప్ప సంస్కృతిలో నేను పెరగలేదు. నిజానికి నేను వచ్చింది నీ మనసే మిటో తెలుసుకోవాలని. నువ్వుకూడా నిర్ణయని కోరుకోవడమే నిజమైతే నా ప్రమేయంతో మీ యిద్దర్నీ దగ్గరకు చేర్చాలనుకున్నాను. కాని తెలిసి పోయింది శ్యాం....నువ్వు మామూలు మగాడివి....అనుభవాల్ని పెంచుకోవ టానికి తప్ప జీవితాన్ని పంచుకోవటానికి ఆసక్తిలేనివాడివి....కాబట్టే చివరి నిర్ణయాన్ని నిర్ణయకే వదిలిపెట్టి వెళ్ళిపోతున్నాను."

శ్యాంని ఇక కలుసుకోవాల్సిన అగత్యం లేదు.

కాని అవసరమైతే అసాధ్యమైన అసహ్యాకరమైన ప్రమేయమైనా నిర్ణయ నివారించాలి.

అలసిన ప్రవాసంలో ఎన్ని తీగలు తెగినా యింకా బ్రతుకు విపంచి కను మీటుకుంటూ సాగిపోవటం తెలిసిన వ్యక్తులకి తప్ప ఎవరికి సాధ్యమైన విషయమిదీ.

కుళ్ళిన సగభాగాన్ని నరికేయక ఇంకా ఇలా ఆలోచించడం దుష్కృత్యమే అయితే యిదిగో యిక్కడో శ్రీహర్ష దుఃఖితుడూ జ్వాలా వలయితుడూ కావాల్సిన క్షణంలో సైతం యింకోలా ఆవేశపడుతున్నాడు. 'బెటర్ హాఫ్' అన్న పదానికి బాధాకరమైన ఉదాహరణలా.

* * * * *

"నీకు పిచ్చి పట్టింది శ్రీహర్షా" ఉద్వేగ్నంగా అంది ప్రమీల. అసలు ఏ మగాడయినా ఇలా ఆలోచించడం ఆమె వూహాకందనిది. "భార్య ఓ అక్రమసంబంధంతో పతనమైతే సాదరంగా యింటికి ఆహ్వానించడం

ఆ తర్వాత తగుదునమ్మా అంటూ అవతలివాడ్ని స్టడీ చేయాలని వెళ్ళడం. ఛ ఛ....నమ్మలేకపోతున్నాను."

అప్పుడు చూసింది మండుతున్న మిన్నేరు కెరటాల్లా నీళ్ళు చిమ్మే శ్రీహర్ష నేత్రాల్ని.

"ఒక మగాడు యిలా కంటతడి పెట్టుకోవడం నేను అసహ్యించు కుంటాను" ఆవేశంగా అంది కాని అంతకంటే అలాంటివాడు ఏం చేయ గలడో ఆలోచించలేక పోయింది.

"అసలు నువ్వేం మగాడివి?"

"నేనో అసమర్థుడ్ని ప్రమీలా....ఆ విషయం అంతకు ముందు స్పష్టంగా తెలీదు. కాని నిర్జయ చేసిన పనితో చాలా వివరంగా బోధపడి పోయింది."

ప్రమీలవేపు చూడలేనట్టు తల వంచుకున్నాడు. "ఒకవేళ నేను నిజంగా అందరి మగాళ్ళలో ఒకడ్ని అయ్యుంటే ఆ దృశ్యం చూడగానే నిర్జయని నరికి పోగులేసేవాడ్ని. అదీ చేతకాని నాడు విషం తాగి చచ్చే వాడ్ని. కాని ఆ రెండూ చేయలేకపోయాను. ఎందుకంటే నేను ఓ సమర్థు డైన మగాడిలా ప్రపంచం ముందు నిలబడటానికి అవెలగూ సహకరించవు కాబట్టి....ప్రేమంటే నాకు ఖచ్చితమైన నిర్వచనం తెలీదు ప్రమీలా. కాని నన్ను నమ్మి నా దగ్గరకు వచ్చిన నిర్జయని నిజాయితీగా ఇష్టపడటం అల వాటు చేసుకున్నాను. ప్రేమంటే ఖరీదైన జీవితాన్నివ్వడమూ విలాసంగా బ్రతకడమూ అని నాకు తెలీదు. కాని వెలకట్టలేని నమ్మకంతో కోరుకున్న మనిషికి దగ్గరవ్వడమే ధ్యేయంగా బ్రతికాను. అసలు నేను చేసిన తప్పే మిటో అన్నది నాకు తెలీదు. నాలో లోపం కూడా నాకు అర్థం కావడంలేదు. అయినా తిరస్కరించబడ్డాను. ఇక్కడ నేను మోసగించబడ్డానూ అనలేక పోతున్నాను ప్రమీలా. ఎందుకంటే నేను ప్రేమించిన నిర్జయ నన్ను మోసగించిందీ అనుకుంటూ నేను బ్రతకలేను కాబట్టి. నిర్జయని ఇప్పటికీ నేను మనస్ఫూర్తిగా ప్రేమించగలుగుతున్నాను కాబట్టి."

బాధగా కణతలు నొక్కుతుంటూ నేలచూపులు చూస్తున్నాడింకా

"ఏం చేయను అంతకన్నా. నన్ను యిష్టపడకపోవడం నిర్ణయ ధ్యేయమైతే నిర్ణయ యిష్టాన్ని గౌరవించే మనిషిగా శ్యాం దగ్గరికి ఆమెను చేర్చడం తప్ప నా ప్రేమని అంతకన్నా స్పష్టంగా ఎలా వ్యక్తం చేయను. నా చిన్న జీవితంలో యింత కాలానికి నేను తెలుసుకున్న నిజం ఒక్కటే ప్రమీలా....కొందరు కొన్నింటికి అర్హులు కారు....అంతే...."

నిజమే.

ఏ గుండె అఘాతపు లోతులలోనో అందని ఆలోచనల అణిముత్యాల కోసం యిప్పటికీ ఎదురు చూసే స్త్రీలా చూస్తూందామె.

జీవితం ఓ అసంపూర్ణ చిత్రం.

అనిబద్ధమాలిక....

ఆలోచనల వసంతంలో అయాచితంగా రగిలే గ్రీష్మం....

మనసే కదిలిందో లేక మొన్నెప్పుడో ఈ మగాడికోసం తానెంత అశ్రులు చాచిందో తలపుకే వచ్చిందో ఓ పసికందును పూరడిస్తున్నట్టుగా అతడి తలపై చేతినుంచింది.

అది కాంక్ష కాదు....ఆత్మీయతకి సైతం అందని లాలింపు.

అహంకారపు జేగంటలను మ్రోగిస్తూ ఆడదాన్ని యింకా గుడిమెట్టు స్థాయిలోనే ఆలోచించి కసిగా మీద పడిచే పురుష ప్రపంచంలో యితడో అరుదైన వ్యక్తి సుమా అనిపించే అపురూపమైన భావం.

తప్పు చేసి చీకటి గదిలో కళ్ళు మూసుకుని రోదించే ఓ యువతి ఎదలో యింకా ఆశా కర్పూర దీపాన్ని వెలిగించగలిగే నవీన రాజర్షి యితడన్న ఆర్తితో కుదిపేసే లాలిసత్వం.

ఎవరైనా కాసీ అతడు చేసింది విని యితనేం మనిషీ అనుకుంటారే తప్ప యితడో మనిషి అనుకోటానికి అలాంటి వ్యక్తుల సంపర్కానికి యీ సంఘం నోచుకుంటేగా.

గోడపై తననే తదేకంగా చూస్తూన్న భర్త ఫోటో.... గుండెల్ని మండించే గతం........దిగ్భ్రాంతి నుండి జాలిగా గంభీరంగా ఆలోచించ మంటున్న మనసు.

"చెప్పు శ్రీహర్ష...." నిర్లిప్తంగా అంది ప్రమీల. "ఇంత జరిగినా నువ్వు నిజంగా నిర్దయని క్షమించగలుగుతున్నావా.... ఆవేశంతో కాదు. కూల్‌గా ఆలోచించి చెప్పు."

మనసులోని ఏ ఉద్వేగ్నపు పొరలు కదిలి ప్రమీల యీ ప్రశ్న అడిగిందో అతడికి తెలీదు.

శ్రీహర్ష జవాబు చెప్పకుండా తల పైకెత్తి చూశాడు.

ఆ చూపులో కల్మషం లేదు కారుణ్యం తప్ప.

లౌకిక జగత్తుకి అతీతమైన వ్యక్తిలా దుమ్ముకొట్టుకు పోయినా యింకా కళ్ళలో వెలుగు ఆరని పసికందులా కనిపించిన అతడి మౌనం లోనే జవాబు వెదుక్కోగలిగింది.

"వెళ్ళిపోయే చీకటిని వదలలేక వదిలే తార....
వదిలిపోయే జీవితాన్ని వీడలేక వీడిపోయే లోకం....
కాలుజారి పడిన కాలపు పాడు నుయ్యిలో కనపడిన శూన్యం....
కాలు కదిపిన చలవరాతి సౌధంలో వినబడిన గానం....
ఏమిటని ప్రశ్నిస్తే ఏమో అని పలికిన నిశ్శబ్దం....
అప్పుడే నీ నవ్వు నా గుండెకింద వినపడింది."

తిలక్ రాసిన 'గుండె కింద నవ్వు'కి రూపంలా అనిపిస్తున్న శ్రీహర్షని చూస్తుంటే నష్టపోయింది నిర్ణయ తప్ప శ్రీహర్ష కాదనిపించింది.

నిర్ణయని ద్వేషించటంలేదు.

పైగా నిర్ణయ నిర్ణయాన్ని తెలుసుకుని ఆమెకు యింకా సహకరించా లనుకుంటున్నాడు.

అదికాదు....ఆమె అడుగు పెట్టిన బాట ఎంత కంటకప్రాయమైనదో శ్యాంని చూశాక తెలుసుకుని యింకా ఆమెపై సానుభూతిని వర్షిస్తున్నాడు.

శ్రీహర్షని పోగొట్టుకోవటంలో బాధ యిప్పుడు ఆమెకే స్పష్టంగా బోధపడుతుంటే....

భర్త ఫోటోకేసి చూసింది మరోమారు.

అతడు మరణించి ఎన్ని రోజులైతేనేం....

అతడి మూలంగా అనుభవించిన నరకం పాడు స్మృతిలా యింకా మనసులో పచ్చిగానే వుంది.

*　　*　　*　　*　　*

"రా నిర్ణయా...."

సాదరంగా యింటిలోకి ఆహ్వానించింది ఈశ్వరి....ఫ్యాక్టరీలో నిర్ణయతో పాటు పనిచేసే ఈశ్వరి ఇంటికి నిర్ణయ ఇలా రావడం తొలిసారి.

డ్యూటీ నుంచి వచ్చి అరగంట కావడంతో ఈశ్వరి యింకా వంట చేయలేదు. ఆఫీసు నుంచి రావాల్సిన భర్తకోసం ఎదురు చూస్తూ కూర్చుంది నిర్ణయ వెళ్ళేసరికి.

"ఈ కవరులో...." సోఫాలో కూర్చోలేదు నిర్ణయ. నిలబడే కవరు అందించింది. "నా రిజిగ్నేషన్ లెటర్ వుంది....రేపు పర్సనల్ మేనేజర్‌కి ఇచ్చెయ్."

ఆశ్చర్యంగా చూసింది ఈశ్వరి. "వ్హాట్....నువ్వు రిజైన్ చేస్తున్నావా....?"

నిర్ణయ జవాబు చెప్పలేదు.

"తొందరపడుతున్నావ్ నిర్ణయా" పైగా ఈ రిజిగ్నేషన్ ఏక్సెప్ట్ కాదు.ఎందుకంటే నువ్వు యింకా బాండ్ పీరియడ్‌లో వున్నావ్...."

"ఏం చేస్తారు....కాంపెన్సేషన్ పే చేయమంటారు....అంతేగా."

"అది మాత్రమే కాదు నిర్ణయా" సాలోచనగా అంది ఈశ్వరి. "ఇప్పటికే ఉన్మాదంలో కూరుకున్నావనుకుంటున్న మన కొలీగ్స్ శ్యాం కోసం యింకా పిచ్చిదానివై యీ పని చేశావనుకుంటారు."

ఉలికిపాటుగా చూసింది నిర్ణయ.

ఈశ్వరికి యిదంతా ఎలా తెలుసు.

అసలు మొన్న జరిగిన సంఘటన ఫేక్టరీదాకా వ్యాపించేసిందా....

ఇద్దరికీ వున్న సంబంధం గురించి ఏ స్థాయి దాకా చెప్పుకుంటున్నారు....

"ఎవరేం అనుమానించినా నేను పట్టించుకునే స్థితిలో లేను ఈశ్వరీ...."

"అది వట్టి అనుమానమేనా...."

నిర్ణయ తల తిప్పుకుంది. ఎందుకో యిప్పుడా విషయం మాట్లాడటం జుగుప్సగా అనిపిస్తూంది.

"నువ్వు చెప్పకపోయినా అందరికీ చాలా విషయాలు తెలిసిపోయాయి నిర్ణయా....నువ్వు ఫ్లేట్‌లో వుండగా పోవాలు రావడం, మీరు రెడ్ హేండెడ్‌గా పట్టుబడటం...."

"ఈశ్వరీ" నిర్జయ కంపించిపోతూంది. "ఇవన్నీ...."

"ఎవరో సృష్టించి చెబుతున్నవికావు నిర్జయా....సాక్షాత్తూ నివాస్ ద్వారా అందరికీ తెలిసిందే...."

"అంటే...." నిర్జయ పెదవులు వణికాయి. "నివాస్ యిదంతా చెప్పేడా...."

స్నేహితుడిగా రహస్యాన్ని కాపాడతానన్నాడే. శ్యాం కోసం మీరు ఏదో చేయాలి అంటూ తనలో వున్న బలహీనతని రెచ్చగొట్టి ప్లేస్ దాకా వెళ్ళేట్టు చేశాడే. ఇప్పుడు చాలా గోప్యంగానే వుందనుకుంటున్న విషయాన్ని ఫేక్టరీదాకా ఎందుకు చేరవేశాడు.

"నీకు అర్థం కాని నిజాలు చాలా వున్నాయి నిర్జయా....అందుకే శ్యాం విషయంలో ఆదినుంచీ నేను హెచ్చరించేదాన్ని. కాని నువ్వు పట్టించుకోలేదు. నివాస్ వుండేది మీ వీధిలోనేగా. అతడే మీ దాంపత్యానికి సంబంధించిన గొడవల్ని నీ డిస్సాటిస్‌ఫేక్షన్ని శ్యాంకి చెబుతుండేవాడట. ఉమనైజర్‌గా ఖ్యాతి గాంచిన శ్యాం నిన్ను లొంగదీసుకుంటానని పందెం కాసి టూర్‌లో వుండగా మొత్తం సాధించాడట...."

నిర్జయ రక్తం సలసలా కాగిపోతూంది.

ఏమిటీ....

పందెం కాసి తనను లొంగదీసుకున్నాడా....

అంత హీనాతిహీనంగా తను జారిపోయిందా....

ఇంత చదువు చదివి చాలా ఆలోచించగలిగే శక్తి వుండీ ఇంత ఘోరంగా పతనమైపోయిందా....

"నివాస్ శ్యాంల స్నేహం గురించి నీకు పూర్తిగా తెలీదు నిర్ణయా. ఇద్దరూ జంటగా అమ్మాయిల్ని ట్రేప్ చేస్తుంటారు. జంటగానే వ్యవహారాన్ని నడుపుతుంటారట. బహుశా నిన్నూ అలాంటి టార్గెట్‌గానే ఆలోచించి వుంటారని నా నమ్మకం. అసలు నివాస్ ఓ ఎడ్యుకేటెడ్ బ్రూట్. పక్కా అవకాశవాది. కాబట్టే ఓ అమ్మాయి ఆత్మహత్యకి కారణమయ్యాడు." గతంలో జరిగిన ఓ సంఘటన గురించి చెప్పింది. "నాలుగేళ్ళ క్రితం నీలాగే ఓ అమ్మాయి ఇంజనీరింగ్ పూర్తి చేశాక ఫేక్టరీలో ట్రయినీగా చేరింది. చాలా అమాయకంగా వుండేది. శ్యామ్‌కి ఫేక్టరీలో వున్న పరపతిని చూసి కొంత, అతడి మాటకారి తనానికి మరికొంత ఆకర్షించబడి కాస్త దగ్గరైంది. పెళ్ళి చేసుకుందామన్నాడు....సరేనంది. కాని పెళ్ళికి ముందే ఆమెను బెడ్ మీదికి రప్పించుకోవాలని ప్రయత్నించేసరికి అతడి నిజరూపం గ్రహించి దూరంగా వుండటం ప్రారంభించింది. ఆ తర్వాత తల్లిదండ్రులు నిర్ణయించిన పెళ్ళికి సిద్ధపడింది కూడా. దానితో చాలా అవమానం ఫీలైన శ్యామ్, నివాస్ సాయంతో ఆమెకీ, తనకీ చాలా చాలా సంబంధం వున్నట్టు చిన్న పుకారు లేవదీశాడు. ఆ విషయం అంతటా ప్రాకి ఆమె పెళ్ళి ఆగిపోవడందాకా వెళ్ళింది. ముందే చెప్పానుగా ఆ అమ్మాయి చాలా అమాయకురాలని.... ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయింది."

అంటే....

ఇప్పుడూ యింత జరిగాక చేసింది పదిమందికీ తెలియ చేయడంలో శ్యామ్, నివాస్‌ల ఉద్దేశ్యం తన కాపరం ఘోరంగా కూలిపోవాలనేగా....

పంటి బిగువున ఆవేశాన్ని అపుకుంటూ అంది నిర్ణయ. "ఈ విషయం నాకు ముందే ఎందుకు చెప్పలేదు ఈశ్వరీ...."

"చెప్పాలని ప్రయత్నించినా నువ్వు వింటేగా. పైగా నీ మీద నీకు నమ్మకమూ జాస్తి అని అర్థమైపోయింది" ఈశ్వరి నిక్కచ్చిగా అంది.

"అయినా ఒక పెళ్ళయిన అమ్మాయి యింత సులభంగా ట్రేప్ చేయబడుతుందని ఎవరైనా ఎలా అనుకోగలరు. నీ శీలం జాగ్రత్తంటూ నీ స్థాయి అమ్మాయికి ఎవరైనా ఎలా చెప్పగలరు."

నిర్దయ లేచింది.

ఆమె శరీరం తూలిపోతూంది నిస్సత్తువగా.

"ఇప్పుడు నీ కాపురం ఏ స్టేజ్‌లో వుందో నాకు తెలీదు నిర్దయా. కాని నువ్వు తొందరపడ్డావని మాత్రం చెప్పగలను." చివరి మాటగా చెప్పాల్సింది చెప్పటానికి ఆమె సంకోచించలేదు. "బహుశా నీ కాపురం కూలిపోయి పూర్తిగా నువ్వు అతడి మీదే ఆధారపడాలన్నది శ్యామ్ ఆలోచన కావచ్చు. అందుకే యీ పబ్లిసిటీ తతంగం అంతా....చాలా పరపతి గల శ్యామ్ యింతటితో వూరుకోడు. తన సుఖంకోసం నిన్నింకా బజార్లోకి యీడ్చగలడు. అది గుర్తుంచుకో...."

బయటికి వచ్చిన నిర్దయ సరాసరి యింటికి వెళ్ళలేదు. ఇందిరా పార్కులోకి వచ్చి సాయంకాలందాకా కూర్చుంది.

తనమీద తనకే అసహ్యం.

జరిగింది గుర్తుకొస్తుంటే గాజు పెంకుల్తో శరీరాన్ని గీరుకోవాల నుంది.

శ్యామ్ మాటలు, వెకిలి నవ్వులూ జ్ఞప్తికొచ్చి చావాలన్నంత సిగ్గుగా వుంది.

సాయంకాలం నీరెండలో యింటికి బయలుదేరుతుంటే పార్కులో ఎదురయ్యాడు శంకర్.

సిగ్గుతో తల తిప్పుకోబోయింది.

"హల్లో" పలకరించాడు. "ఒంటరిగా వచ్చారా."

తన గురించి ఇతడికీ తెలిసిపోయిందా....

తెలిసే యిలా అడుగుతున్నాడా....

బహుశా యింకా తెలీదనుకుంటాను....

శ్రీహర్ష యీ విషయాన్ని అతడితో చర్చించి వుండడు.

"మా ఆవిడతో పార్కుకి వచ్చాను" అదిగో దూరంగా ఎవరో స్నేహితురాలితో మాట్లాడుతూంది."

"వెళ్తాను" నిర్ణయ ముందుకు నడవబోతుంటే వారిస్తున్నట్టుగా అన్నాడు.

"శ్రీహర్ష ఆఫీసుకి రావటంలేదు నాలుగు రోజుల్నుంచి."

ఇదీ నిర్ణయకి న్యూస్....

అసలు నాలుగు రోజులుగా యిద్దరూ ఎదురుపడి మాట్లాడుకుంటేగా.

ఆ రాత్రి తనను పూరడించాలని ప్రయత్నించిన శ్రీహర్ష ఆ తరువాత యిక మాట్లాడలేదు. కనీసం ఎదురుపడలేదు.

"బహుశా వాడింకా తేరుకోలేదనుకుంటాను"

ఈ వాక్యం బాంబ్ షెల్లా దూసుకుపోయింది.

నిజానికి జరిగింది శర్మ ద్వారా తెలిసిన శంకర్ అది రూమర్‌గా భావించి ఇంచుమించు శర్మపై చేయి చేసుకునేదాకా వెళ్ళాడుగాని ఆరాతీస్తే మొత్తం నిజమని తేలిపోయింది.

అయినా శ్రీహర్షని అడగలేకపోయాడు.

కొన్ని చర్చలు స్నేహాన్ని దూరం చేసేటంత ప్రమాదకరమవుతాయి. ఇదీ అలాంటిదే....

ఓదార్చినా మానని ఇలాంటి గాయాన్ని కాలానికే వదిలేయాలి కొంత కాలం పాటైనా.

అందుకే శ్రీహర్ష ఆఫీసుకి రాకపోయినా పనిగట్టుకుని అతడ్ని కలుసుకోలేకపోయాడు.

"మొత్తానికి ఒకనాడు నేనన్న మాటను మీరు నిజం చేయగలిగారు నిర్జయా...." ఆమెపై పేరుకున్న తన జుగుప్సని సూటిగా వ్యక్తం చేయటానికి అతడు సంకోచించలేదు.

"ఈ దేశంలో ప్రేమించి పెళ్ళి చేసుకున్న చాలామంది భార్యభర్తలు బతుకుతున్నది అక్రమ సంబంధంతోనే అని నేను అంటే మీరెంత అసహ్యించుకున్నారో నాకు గుర్తుంది. ఆ తర్వాత నా స్టేట్‌మెంట్‌కి నన్ను నేనూ అసహ్యించుకున్నాను.... కారణం అది జనరలైజ్ చేయడం నేరమనిపించబట్టి. చిత్రమేమిటంటే ఆ రోజు అంత రియాక్టయిన మీరే చాలా కాకతాళీయంగా నిజం చేసేశారు."

అనాల్సింది యింకా పచ్చిగా అనాలనిపిస్తున్నా నిభాయించుకున్నాడు శంకర్.... నిజాయితీకి నిర్వచనమైన శ్రీహర్ష విషయంలో ఆమె కొట్టిన చావుదెబ్బనుంచి ఈ నాలుగు రోజులుగా శంకర్ తేరుకోలేదు. అందుకే పర్యవసానం గురించి ఆలోచించకుండా ఉద్రేకంగా అనేశాడు.

ఏం మాట్లాడగలదని....

చుట్టూ వున్న ప్రపంచమంతా ద్వేషించదగ్గ స్థితిలో నిలబడ్డ తనకు యిదో పెద్ద శిక్ష కాదు.

ఆమె నడుస్తూంది కళ్ళు నీటికుండలవుతుంటే....

దూరంగా నిలబడి అహ్లాదకరంగా మరెవరో స్నేహితురాలితో మాట్లాడుతున్న భార్యను చూస్తుంటే తనెంత అదృష్టవంతుడో తెలిసిపోయింది.

ఈ రోజే కాదు. నిజానికి నాలుగు రోజుల క్రితం నిర్జయ విషయం తెలిసాకనే బోధపడిపోయింది.

కాబట్టే మోసీతో వున్న సంబంధాన్ని పూర్తిగా త్రెంచేసుకున్నాడు.

కొన్ని సంఘటనలు కొందరికి చాలా జ్ఞానోదయం కలిగిస్తుంటాయి. ఇదీ అలాంటిదే.

ఏ తప్పూ చేయని శ్రీహర్షకి నిర్జయ విధించిన శిక్ష తప్పు చేయడం అలవాటుగా మార్చుకున్న శంకర్‌ని ఎంతగా మార్చేసిందీ అంటే యింత కాలం ఓ అందమైన ఆర్గ్యుమెంట్ సృష్టించుకుని తనను తాను మోసగించు కున్నట్టు అర్థమైపోయింది.

*    *    *    *    *

గదిలో చీకటి సేదుకున్నా నిర్జయ పట్టించుకోలేదు.

చెంపలపై పేరుకున్న కన్నీటి చారికలు క్రమంగా ఆవిరైపోతున్నాయి.

శరత్పూర్ణిమలా మొదలైన ప్రేమ ఒదిగి ఒదిగి గుండె లోతుల్లో విశ్వరహస్యమంతగా వ్యాప్తిచెందింది. ఎన్ని ఋతువుల ఆనందాన్ని అందించింది.

నీవు లేనినాడు నేనే లేనన్న వాక్యాల కవితలై ఆనంద భాష్పాల మధు పాత్రతో ఎంత ప్రాణం పోసి యింత దూరం నడిపేయి.

ఇదేమిటమ్మా?

బ్రతుకు పచ్చని గట్లను చుట్టుకున్న మిన్నాగుల ఆలోచనలతో యింతగా ఎలా నాశనం కాగలిగాను....

ప్రేమని ద్వేషంగా మార్చుకొని చేతులు చాచిన వ్యక్తిని దరి చేర నివ్వక బొమ్మని తలుపులు మూసి యింతగా ఎలా పతనమయ్యాను.

ఋతువులన్నీ రగుల్చుకున్న క్రతువులై యింతటి హింసకి గురి చేస్తున్నాయేం?

గదిలో లైటు వెలిగింది.

ఆలోచనలనుంచి తేరుకుందిగాని తలతిప్పి చూడలేకపోయింది.

వచ్చింది శ్రీహర్ష కాదని తెలిసిపోయింది. ప్రమీల ఆమెకు అభిముఖంగా కూర్చోగానే....

విసుగనిపించింది.

ఆ క్షణంలో శ్రీహర్ష వస్తే యిబ్బందిగానైనా కొంత పూరట చిక్కేదేమో....

అర నిమిషం నిశ్శబ్దం....

"ఉద్యోగం మానేశావటగా?" అడిగింది ప్రమీల.

"మా దూరపు బంధువు ఈశ్వరి చెప్పింది."

చెప్పింది ఆ ఒక్క విషయమేనా అనుకుంటూ విస్మయంగా చూసింది.

"నీ నిర్ణయాలకి నువ్వే బాధ్యురాలివవుతావు నిర్జయా.... నిలదీసి అడిగే హక్కు నాకెక్కడిదని...."

ప్రపంచమంతా పరిహసించే స్థితిలో నిలబడ్డ నిర్జయకిది నిజంగా అప్యాయతలా అనిపించింది.

"ఆదికాదు.... ప్రమీల గొంతులోని మార్దవం, లాలిత్యం ఆమెను ఓ ఆత్మీయురాలిగా అంగీకరించేట్టు చేసింది.

ఏడ్చి ఏడ్చి సిందూరంకన్నా ఎరుపెక్కిన నిర్జయ భుజంపై లాలనగా చేతులుంచింది ప్రమీల.

"నేను నీకు శత్రువుని కానమ్మా ....నీ ప్రస్తుత మానసిక స్థితిని అర్థం చేసుకోగలిగే నీ అక్కలాంటిదాన్ని"

క్షణం ఆగి అంది ప్రమీల....

"జరిగింది జరగకూడనిదే అయినా జరిగిపోయిందిగా. బాధపడి ప్రయోజనం ఏమిటి?"

"నేను బాధపడటంలేదు" బాధనీ ఉక్రోషంగా వ్యక్తం చేసింది నిర్జయ.

"అవును....జరిగింది నా స్వయంకృతం కాబట్టి ఇలా జరగాల్సిందే. ఈ శిక్ష నాకు అవసరమే అనిపిస్తూంది"

మృదువుగా నవ్వింది ప్రమీల "తప్పు నీ ఒక్కదానిదే కాదు నిర్జయా శ్రీహర్షది కూడా...మూగవాడుగా...మాటలతో నీ మనసు శూన్యాన్ని నింప లేకపోయి వుంటాడు.

గుంభనంగా ఉండటం అలవాటయిన వాడేమో ఉత్సాహంగా నిన్ను అక్కున చేర్చుకుని నీ ఒంటరితనానికి పూరట అందించలేకపోయి వుంటాడు. పెరిగింది శరణాలయంలో అయితే ఇంతే వుండగలడు తప్ప నువ్వు కోరుకున్న మనిషంతగా ఎలా ఎదగ్గలడు....ఇంకా వ్యవధి కావాలిగా...."

జరిగిన అనర్థానికి మరో రకమైన భాష్యం చెప్పిన ప్రమీల నిర్జయ తప్పటడుక్కి శ్రీహర్ష ప్రవర్తనకూడా ఒక కారణం అని నచ్చచెబుతూంది అది నిజమో కాదో తనకీ అర్థం కాకపోయినా.

"అతడు నీలో సగం మాత్రమే కాదు నిర్జయా, నువ్వు అతడిలో సగభాగానివి కూడా.

"అందుకే ప్రేమలో సగం సగం అయిన మీరు పెళ్ళయి ఒకటయ్యా రేమో కాని పరిపూర్ణం ఎందుకు కాలేకపోయారని నేను బాధపడేది."

నిర్జయ నిశ్శబ్దంగా వింటూంది.

"ఇప్పుడు శ్రీహర్షకి వట్టి స్నేహితురాలిని మాత్రమే గాని, ఒకప్పుడు అతడ్ని ప్రేమించిన ఆడదాన్ని నేను."

విభ్రమంగా చూసింది నిర్జయ.

"అంతగా నీకన్నా ముందు ప్రేమించిన నేను అతడ్నెందుకు వదిలి పెట్టానో తెలుసా.... మనసుని వ్యక్తం చేయడం చేతకాని ఈ మనిషితో నాకు సుఖముండదని"

చెప్పింది అబద్ధమైనా అది నిర్జయకి వూరటనందించే విషయంగా మార్చి చెప్పాలనుకుంది ప్రమీల.

"అలా ఆ రోజు నన్ను దూరం చేసుకున్నాడు. ఈ రోజు నిన్నూ దూరం చేసుకున్నాడు...."

"లేదు" ఉద్వేగ్నంగా అంది నిర్జయ. "ఆయన నన్ను దూరం చేసుకోలేదు....నేనే అహంతో అతడికి దూరమయ్యాను."

"ఎవరు ఎవర్ని దూరం చేసుకున్నా జరిగింది దూరం కావడమేగా నిర్జయా. ఒకవేళ నీ ఆలోచనల్ని ఆకళింపు చేసుకునే శక్తి శ్రీహర్షకి వుంటే నువ్వు యిలాంటి నిర్ణయం ఎందుకు తీసుకుంటావు.

అతడి మీద ప్రేమ నిన్ను చాలా ఆనందాలకి దూరం చేసింది నిర్జయా. ఇది నిజం....అతడు నీకు భర్తయ్యే ప్రోసెస్‌లో ఏదీ పోగొట్టుకోలేదు.... కాని నువ్వు చాలా వదులుకున్నావు. అంటే నీ నష్టాన్ని భర్తీ చేయాల్సింది అతడు....కాని శ్రీహర్షకది చేతకాలేదు. కాబట్టే నువ్వు అసహనంతో నలిగి పోయావు.

నీలోని యీ అశాంతిని అర్థం చేసుకున్న ఓ గెద్ద నీ జీవితంలోని సుఖాన్ని ఎత్తుకుపోయింది. ఇదే సరిగ్గా జరిగిందిదే."

ప్రేతకళతో మకిలి పట్టిన నిర్దయ సౌందర్యాన్ని తదేకంగా చూస్తూ ఆమె తల నిమిరింది.

"జీవితం నిస్సారం కాదు చెల్లీ....క్షమాగుణం గల భర్తే దొరికితే అది ఏడు జన్మల కళ అవుతుంది. లేనినాడు ఒక్క క్షణపు కలగా మిగిలి పోతుంది. ఇదంతా ఎందుకు చెబుతున్నానూ అంటే నేనూ ఓ వ్యక్తికి భార్యనే కాబట్టి. అతడి మరణంతో తప్ప మనశ్శాంతికి నోచుకోలేకపోయాను కాబట్టి..."

ప్రమీల నేత్రాలనుంచి రెండు నీటిబొట్లు రాలేయి.

అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖంలా యింత కాలమూ తన భర్త ఔన్నత్యం గురించి శ్రీహర్షతో మాట్లాడిన ప్రమీల యిక్కడ శ్రీహర్ష గొప్పతనం గురించి మరింత స్పష్టంగా చెప్పటానికి నిజాన్ని వెళ్ళగక్కింది.

"నేను కట్టుకున్నవాడు నీ భర్తలా పేదవాడుకాదు. బాగా డబ్బున్న వాడు. ఏ సుఖాన్నయినా డబ్బుతో కొనగలిగేవాడు."

ఏ జ్ఞాపకాల నీలి నీడలు ఆమె గుండెల్ని కలచివేస్తున్నాయో ఉద్రేకంగా చెప్పుకుపోయింది.

"రోజుకి వేలు ఖర్చుచేసి వేశ్యల్ని యింటికి రప్పించుకుని నా కళ్ళ ముందే వాళ్ళని అనుభవిస్తుంటే ప్రేమించే మనసున్న పేదభర్త దొరికినా బాగుణ్ణని కుమిలిపోయేదాన్ని. నేనెప్పుడో శ్రీహర్ష లాంటి ఓ మగవాణ్ణి ప్రేమించానన్న మిషని ఆధారం చేసుకుని నన్ను వివస్త్రని చేసి కాలుతున్న సిగరెట్టుతో నా అవయవాల్ని మండిస్తుంటే యింతకన్నా వైధవ్యం నయమని దేవుణ్ణి మనసులోనే కోరుకునేదాన్ని. ఇది నువ్వు నమ్మలేవు నిర్దయా.

నిజంగా నేను యిలాగే ఆలోచించేదాన్ని. అది దారుణం అని తెలుసు. కాని ఏం చేయను. ఎన్నోసార్లు సుఖం కోసం కాలుజారాలనీ అను కున్నాను. కాని ఆ పని చేయలేకపోయాను. ఎందుకో తెలుసా....కసిలో తీసుకునే ఆ నిర్ణయాలు నిజమైన సుఖాన్ని అందించలేవని తెలియబట్టి...."

పీర చెరగుతో కళ్ళొత్తుకుంది ప్రమీల.

"చివరికి ఆ యాక్సిడెంటులో నా భర్త చనిపోయాడు. ప్రేమ బద్ధంగా అతడికి భార్యని కాలేకపోయినా చట్టబద్ధంగా ఆస్తికి వారసురాలినై పోయాను. నా పాదం మంచిదీ కాదన్న మా అత్తమామలు నన్ను వెలేసి నట్టు నాకు దూరమయ్యారు. అయినా నేను బాధపడలేదు. ఎందుకంటే యింతకన్నా చిత్రవధ నా భర్తనుంచే పొందేదాన్ని కాబట్టి. చెప్పు నిర్ణయా ....శ్రీహర్ష ఎందరికన్నా గొప్పవాడు....ఎంతటి సహృదయుడు....ఎంతటి క్షమాగుణం లేకపోతే నీ తప్పు తన తప్పుగా భావించగలడు. నిన్ను ఎంతగా ప్రేమించనివాడు నీ సుఖంకోసం ఆలోచించి శ్యామ్‌ని కలుసుకుని నిన్ను ఏలుకొమ్మని అర్థించటానికి వెళ్ళి వుంటాడు...."

అప్రతిభురాలైంది నిర్ణయ.

"నిజం నిర్ణయా....శ్యాంని ఆ మరుసటిరోజే కలుసుకున్నాడు.

అతడు అవమానించినా దిగమింగుకుని ఏ మగాడూ ఆలోచించని రీతిలో నువ్వు మారితే బాగుణ్ణనుకుంటూ నిర్ణయం నీకే వదిలిపెట్టాడు."

ఏ మూల యింత వేపూ దాగున్నాయో యిప్పుడు ధారలా నిర్ణయ నేత్రాలనుంచి నీళ్ళు ఉబికి ఆమె చెంపల్ని తడుపుతున్నాయి.

"పిచ్చితల్లీ....నీ జీవితం నీదేకానీ చేజారితే అది నీది కాకుండా పోతుందమ్మా...."

ఇప్పటికీ ఆలస్యం కాలేదు. నువ్వు చేసుకున్న అదృష్టం శ్రీహర్ష లాంటి భర్తని పొందడం. జరిగింది మరిచిపోగలిగితే సుఖపడతావు."

ప్రమీల ఎప్పుడు వెళ్ళిందో నిర్ణయకి గుర్తులేదు.

ఆ రాత్రి శ్రీహర్ష యింటికిరాని విషయం స్ఫురణకి వచ్చింది.

అదీ ఏ తెల్లవారుజామునో....

కొన్ని శాపాలు అంతతొందరగా విముక్తికి నోచుకోనివ్వవు.

శ్యామ్‌తో నిర్ణయ అక్రమసంబంధమూ అలాంటిదే.

తెలతెలవారుతుండగా తలుపు తట్టిన చప్పుడైతే వెళ్ళి ద్వారం తెరిచింది.

శ్రీహర్షే వచ్చాడనుకుంది.

కాని వచ్చింది శ్రీహర్ష కాదు. శ్యాం....

* * * *

"ఎందుకిలా వచ్చావ్?"

అప్పటికే తాగి ఉన్నాడేమో ఉత్సాహంగా సోఫాలో కూచున్నాడు శ్యాం.

"మర్యాదగా బయటికి నడువ్"

నవ్వాడు అదోలా....

ఆ నవ్వు ఎగతాళిగానూ లేదు. ఓ ఆడదానిపై గెలుపు సాధించాక ఏ మగాడైనా అధికారపూర్వకంగా ప్రదర్శించే దర్పం.

అదికూడా కాదు ఆ క్షణంలో శ్యాంకి ధైర్యాన్ని అందిస్తున్నది. ఇలాంటి సంబంధాలలో ఏ మగాడైనా భయపడేది తనకు సంబంధం వున్న ఆడదాని భర్త గురించి....

ఇప్పుడు తమ సంబంధం భర్తకి కూడా తెలిసిపోయాక అందులోనూ అతడు సాత్వికుడని అర్థమయ్యాక బహుశా శ్యామ్ లాంటి వ్యక్తులు యిలాంటి నిష్ఠురాన్నే ప్రదర్శిస్తారేమో.

"మొన్న మీ ఆయన నా దగ్గరకు వచ్చాడు" చెప్పాడు శాంతంగా నిర్ణయని చూస్తూ.

"తెలుసు."

"ఏమిటి" అతడి గొంతులో మరింత అపహాస్యం ధ్వనించింది.

"ఆ విషయం నీక్కూడా చెప్పేశాడా. మొత్తానికి పిక్యూలియర్ గే"

అసలు నీకింత సహృదయుడైన భర్త వుండడం నువ్వు చేసుకున్న అదృష్టం నిర్ణయా....మన సంబంధాన్ని అంగీకరించడం మనల్ని దగ్గరకు చేర్చాలని ప్రయత్నించడం....విచిత్రంగా వుందీ కదూ...."

"అవుట్" ఆక్రోసుగా అంది నిర్ణయ.

శ్రీహర్ష గురించి అంత చులకనగా మాట్లాడ్డం ఆమె భరించలేక పోతూంది.

"మళ్ళీ ఈ ఛాయలకు రాకు."

"ఎంతైనా నిన్ను తృప్తిపరచిన మగాడ్ని."

"ఛీ....ఛీ.....అలా మాట్లాడకు."

"ఏం నిజం కాదా?"

"మిస్టర్ శ్యాం...." ఈ సన్నివేశం మరింత జుగుప్సగా అనిపిస్తూంది దామెకి.

పైగా శ్యాం గురించి ఇంత వివరంగా తెలిశాక అతడి ఉనికిని అసలు అంగీకరించలేకపోతూంది.

"నేను గట్టిగా కేకలు వేసి నలుగురినీ పిలవక ముందే బయటకు నడు...."

"వెళతాను నిర్ణయా....కానీ నువ్వు ఈ రోజు నా దగ్గర కొస్తానని హామీ ఇవ్వాలి."

"ఎవర్నువ్వు? నాకేమౌతావని??"

"ఏమౌతావని నా దగ్గరకు వచ్చేదానివి?"

"అప్పుడు వచ్చింది ఎందుకయినా యికముందు రాను. మరోసారి తప్పు చేయను."

"ఆడది శీలం గురించి ఆలోచించాల్సింది మొదటిసారి గురించి.... మరోసారి గురించి కాదు."

"నీ ఉపదేశాలతో నాకు పనిలేదు. ముందు కదులు"

"కదలాలీ అంటే చెప్పానుగా........నువ్వు ఎప్పటిలా నా దగ్గరకు రావాలి"

ఏమిటీ వ్యక్తి మొండితనం....

ఏ ధైర్యంతో యిలా మాట్లాడగలుగుతున్నాడు?

ఓ ఆడదాని పతనం ఏ మగాడినైనా ఇంత బలవంతుడ్ని చేస్తుందా?

"చెప్పు నిర్ణయా....ఎప్పటిలానే నా దగ్గరకు వస్తావా?"

"రాకపోతే ఇంకా మన సంబంధం గురించి పబ్లిసిటీ యిస్తావా?" అడిగింది ఈశ్వరి మాటలు గుర్తుకొచ్చి.

"నేను యివ్వాల్సిన అగత్యంలేదు నిర్ణయా"

అసలు ఆమె దేన్ని ఉద్దేశించి అలా మాట్లాడుతున్నదీ అతడు ఆలోచించలేదు.

"ఇలాంటివి ఆటోమేటిక్‌గా అందరికీ తెలిసిపోతుంటాయి."

నిన్న మొన్నటిదాకా నువ్వు లేకపోతే బ్రతకలేనన్న శ్యాం ఇప్పుడు తన అసలు రూపాన్ని ప్రదర్శిస్తున్నట్టుగా మాట్లాడుతున్నాడు.

తనకోసం నిజంగా పిచ్చెక్కి యిలా మాట్లాడుతున్నాడో లేక రాక ఏం చేస్తుందన్న ధీమానే వ్యక్తం చేస్తున్నాడో ఆమెకు అర్థం కాలేదు.

"ఇప్పటికి జరిగింది చాలు శ్యాం....పతితనే అయిన నేను హంతకురాలిని కూడా కాకూడదూ అనుకుంటే నన్ను విడిచిపెట్టు"

"ఏం చంపుతావా?" పైకి లేచాడు శ్యాం.

ఓ ఉన్మాదిలా రక్తం ఓడిన కళ్ళతో ఆమె దగ్గరకు నడుస్తున్నాడు. "నువ్వే....ఫైన్....చంపేయ్ నిర్మలా....నీకోసం పిచ్చివాడిలా బ్రతకడం నాకు సాధ్యంకాదు కాబట్టి నన్ను హత్య చేసెయ్....కమాన్....రా...."

ఆమె పైకి వెళుతున్నాడు.

అది నిజంగా ఉన్మాదమో లేక మరోసారి అవకాశం తీసుకునే ప్రయత్నమో ఆమె గుర్తించేలోగానే ఆమె భుజాలను పట్టుకున్నాడు.

"వదులు" పెనుగులాడింది.

కానీ మరింతగా పిడికిలి బిగించాడు.

"నిన్నే."

"లేదు....నువ్వు నాక్కావాలి. నా దగ్గరకు రాకపోతే ఇక్కడే నీ ఇంటిలోనే...." ఆమె పెదవుల్ని చూస్తూ పైకి ఒరిగిపోతున్నాడు.

"బా....స్ట....ర్డ్....లీవ్‌మి" ఆమె శక్తిని కూడదీసుకుంటూంది.

సాధ్యం కావడంలేదు.

అతడి పశుబలం ముందు ఆమె ఓడిపోతూంది.

అంతే....చాచి రెండు కాళ్ళ మధ్యగా తన్నింది.

కెవ్వుమన్నాడు.

మరుక్షణం తేరుకుని రాక్షసుడిలా ఆమె పైకి లంఘించాడు.

డ్రగ్ అడిక్ట్‌లా కళ్ళు చికిలించి ఆమెను ఒడిసిపట్టుకుని కసిగా ఆమె పెదవులను కొరకబోతుంటే....

సరిగ్గా అప్పుడు పడింది శ్యాం భుజంపై ఓ చేయి.

ముందు గమనించలేదు ఎవరు వచ్చిందీ.

గుర్తించేలోగానే నేలపై పడ్డాడు.

ఎదురుగా నిలబడ్డ శ్రీహర్ష అంత శక్తివంతుడని శ్యాం ఊహించలేకపోయాడు.

ఒక్క ఉదుటున శ్యాంని పైకెత్తుతున్న శ్రీహర్ష ఓ ఆటవస్తువులా ద్వారం బయటికి విసిరేశాడు.

శ్యాం లేవటానికే అవకాశమివ్వనంత కసితో కాళ్ళతో అతడి గుండెలపై తన్నిన శ్రీహర్ష "మరోసారి యిలా వస్తే పోలీస్ కంప్లెయింట్ యిస్తాను" హెచ్చరికలా అన్నాడు.

"ఏమని కంప్లెయింటిస్తావ్" రొప్పుతూ అన్నాడు శ్యాం పైకిలేస్తూ. "నీ భార్య కోరి నా దగ్గర పడుకుంటూందనా....లేక హఠాత్తుగా పతివ్రత అయిన నీ భార్యను నేను రేప్ చేస్తున్నాననా"

శ్రీహర్ష ముందునుంచి గావుకేకలు వేస్తూ కారు దగ్గరికి నడిచిన శ్యాం.

"చాలా జరిమానా చెల్లించబోతున్నావ్ శ్రీహర్షా....ఇప్పుడు జరిగిందానికి పూర్తిగా బాధ్యత వహించబోతున్నావ్." శ్రీహర్ష జవాబుని ఆశించకుండా కారుని ముందుకు పోనిచ్చాడు.

అప్పుడు చూశాడు శ్రీహర్ష.

వీధిలో జనం పోగయి వున్నారు.

ఖర్చులేని వినోదంలా చూస్తున్నారు.

నెమ్మదిగా లోపలికి నడిచాడతను.

ఎంత చదువుకున్నా ఎలాంటి గౌరవనీయమైన కుటుంబంనుంచి వచ్చినా కానీ కొన్ని సంబంధాల మనుషుల విలువల్ని ఏ స్థాయికి దిగ జార్చేదీ అర్థమైన నిర్ణయ గోడకి జారిగిలబడింది అశ్రుసిక్త నయనాలతో....

సూటిగా చూడలేకపోయిన శ్రీహర్ష తలవంచుకుని అన్నాడు.

"శ్యాం నువ్వనుకున్నంత మంచి వ్యక్తి కాదు నిర్ణయా"

శ్రీహర్ష గొంతులో అసూయ ధ్వనించడంలేదు....నిజాయితీగానే అన్నాడు.

ఆ వాక్యం ప్రయోగించటానికి అతడెంత శ్రమపడినాగాని అతడ్ని మించి గాయపడింది నిర్ణయనే.

ఒక భర్త తన భార్య విటుడి గురించి బాధాకరమైన స్టేట్‌మెంటిస్తు న్నాడు.

ఎంత దిగజారింది తను....శ్రీహర్షని ఎంత దిగజార్చింది.

"అందరి దృష్టిలో నువ్వు చులకనవ్వటం నేను భరించలేను నిర్ణయా. నెలాఖరుకల్లా ఈ యిల్లు ఖాళీ చేద్దాం."

రక్తాశ్రువుల్లా రెండు సీటిచొట్లు నిర్ణయ కళ్ళనుంచి నేలరాలేయి.

జరిగిన సంఘటనకన్నా వీధిలో పోగైన జనం దృష్టిలో తను చులక నైనందుకు బాధపడుతున్నాడు శ్రీహర్ష.

మనుధర్మశాస్త్రం ఆమెకి తెలీదు.

పవిత్రులైన స్త్రీలను పూజించేచోట దేవతలుంటారని మనువుచెప్పిన విషయం ఆమె వినలేదు.

కాని....

అపవిత్రురాలైన భార్యని సైతం ఇంతగా మన్నించే మగవాడ్ని ఇదిగో యిక్కడ చూస్తూంది.

సరిగ్గా అదే క్షణంలో ఆమె నిర్ణయించుకుంది ఏంచేయాల్సిందీ....

* * * *

"నిన్ను అమాయకుడనుకోవాలో లేక ఋషివే అనుకోవాలో నాకు అర్థంకావడంలేదు శ్రీహర్షా...." బాధగా అన్నాడు శంకర్ శ్రీహర్షని చూస్తూ.

శ్రీహర్ష ఆఫీసుకి రాలేదు.

ఇంతకాలం మొహం చెల్లనట్టు దూరంగా వుండిపోయిన శంకర్ ఈ రోజే శ్రీహర్ష ఇంటికి వస్తూ అక్కడ జరిగిన సంఘటన గురించి విన్నాడు.

సరాసరి గెస్ట్‌హౌస్‌కి తీసుకువచ్చి ఇన్నాళ్ళూ గోప్యంగా వున్న విషయం గురించి మాట్లాడి తన అక్కసుని వెళ్ళగక్కుతున్నాడు.

"అలాంటి భార్యని ఎలా అంగీకరించగలుగుతున్నావ్ నువ్వు....జరిగినదాని గురించి అసలు నువ్వేమనుకుంటున్నావ్ శ్రీహర్షా?

సంఘం మాట అటుంచు. నీ అంతరాత్మయినా నీ భార్యని ఎలా ఆమోదించగలుగుతోంది ?"

"నన్ను నమ్మి నాతో బ్రతుకుతున్న ఆడపిల్ల నిర్ణయ"

"నిన్ను నమ్మి కాదురా. నీకు నమ్మకద్రోహంచేస్తూ బ్రతుకుతూంది"

"బాధ్యత నాదీ కూడా"

"అసమర్థుడిలా మాట్లాడకు"

"ఇంత జరిగేక నేను సమర్థుడ్నని ఎలా అనుకోను?"

ఉక్రోషంగా అరిచాడు శంకర్.

"ఆ మాటనటానికి నీకు సిగ్గుగా లేదూ. ఛ! ఛ....ఏం మగాడివి నువ్వు. అసలు నా భార్యే అలా చేసుంటే నరికేసేవాడ్నిరా. అలా చూడకు. నా కేరెక్టర్ సవ్యమైనది కాకపోవచ్చు. కాని నేను మగాడిగా అలాంటి భార్యని అంగీకరించలేదు."

"ఆ టాపిక్ వదిలేద్దాం శంకర్" యథాలాపంగా అన్నాడు శ్రీహర్ష.

"వదలాల్సింది టాపిక్‌ని కాదు శ్రీహర్షా....నిర్ణయని"

"అది నిర్ణయ నిర్ణయాన్ని బట్టి వుంటుంది"

"నిర్ణయ నిన్ను వదిలిపెట్టకపోవచ్చు. నీ భార్యగా ఉంటూనే ఆ శ్యాంగాడితో సంబంధం కొనసాగిస్తాననొచ్చు. ఒప్పుకుంటావా?"

జవాబు చెప్పలేదు శ్రీహర్ష.

"అసలు ఇలాంటి రుచులు మరిగిన ఆడది...."

"శంకర్" ఆర్ద్రోక్తిగా వారించాడతను. "నిర్ణయ గురించి అలా చీప్‌గా మాట్లాడకు."

"అదికాదురా...." అతడ్ని ఎలా ఒప్పించాలో అర్థంకావడంలేదు.

"ఇంత జరిగేక నువ్వు ఆమెతో ఉండటం తెలివితక్కువతనం..., సంఘం, అంతరాత్మల మాట అటుంచితే ఆ శ్యామ్‌గాడి మూలంగా నీకు కొన్ని చిక్కులు ఎదురవొచ్చు."

"నేను చేయాలనుకుంటున్నది ఒక్కటే శంకర్....నిర్ణయకిష్టమైన జీవితాన్ని ఆమెకు అందివ్వడం

శ్యామ్ కావాలనుకుంటే ఆమె శ్యామ్ దగ్గరకు వెళుతుంది. కాదు. నేను మాత్రమే కావాలనుకుంటే నా దగ్గర వుంటుంది."

"ఇద్దర్నీ కావాలి అనుకుంటే....అలా కోపంగా చూడకు....సంఘం కోసం భర్త, సుఖం కోసం ప్రియుడు కావాలనుకునే ఆడపిల్లలు చాలామంది వున్నారు"

"స్త్రీల గురించి యింత చులకనగా ఆలోచించగలిగే నిన్ను నిలదీసే హక్కు నాకు లేకపోవచ్చు శంకర్.

ఆమె ఇక ఆలోచించేది ఏ ఒక్కరి గురించో మాత్రమే తప్ప ఇద్దరి గురించి కాదు. నేను యిప్పుడు యిస్తున్న గడువు ఆమె ఆలోచించుకోటానికి మాత్రమే."

"అంతేతప్ప ఆమెని విడిచిపెట్టనంటావ్ ?"

"అవసరమైతే నీ దగ్గర ఉద్యోగం విడిచిపెడతాను"

చివరి అస్త్రంలా అనేసి యిక యీ చర్చలో ఆసక్తి లేనట్టుగా బయటకు నడిచాడు శ్రీహర్ష.

నిర్వచనంలేని వ్యక్తిత్వంలా అనిపించిందో లేక అతను మనఃస్థిమితములేని మనిషిగానే అనిపించాడో జాలిగా చూస్తూ వుండిపోయాడు శంకర్.

నిజానికి అతనికి మానసికమైన ఆసరా యివ్వాల్సిన క్షణాలవి. అందుకే శంకర్ అతడ్ని గెస్టుహౌస్‌కి రప్పించాడు కూడా.

కాని అతను వెళ్ళిపోయాడు.

సరాసరి ఇంటికి వెళ్ళినా బాగుండేది.

ఓ పార్కులో కూర్చున్నాడు ఒంటరిగా.

తన గురించి తనే ఆలోచిస్తున్నాడో లేక ఆమె గురించి మధనపడుతున్నాడో స్పష్టంగా అతడికే తెలీదు.

భోజనం సంగతి మరిచి చీకటి పడేదాకా పార్కులోనే కూర్చుండి పోయాడు.

రాత్రి ఏడైంది....

ఎనిమిదైంది....

తొమ్మిది గంటలు కావస్తోంది.

అంత సేపూ వున్న సందడి తగ్గిపోయింది.

ఇక లేచి ఇంటికి బయలుదేరేవాడే....

పొదల మాటునుంచి నలుగురు వ్యక్తులు ముందుకొచ్చారు.

అది తనకోసమే అని శ్రీహర్ష ఆలోచించలేదు.

జరుగుతున్నదేమిటో అతను ఆలోచించేలోగానే అతడిపై కలియబడ్డారు.

బహుశా అతడి ప్రాణాలు తీసేవారేమో.

కానీ దూరంగా కూర్చుని హస్కు కొడుతున్న విద్యార్థుల బృందం అటు పరుగెత్తుకొచ్చారు.

అంతే....

ఆగంతకులు పారిపోయారు.

సన్నగా మూలుగుతూ రక్తసిక్తమైన దేహంతో నేలపై పడిపోయిన శ్రీహర్ష ఆ తర్వాత స్పృహతప్పిపోయాడు.

హాస్పిటల్లో అడ్మిట్ చేయబడ్డ అతను మరుసటిరోజు ఉదయానికి గాని స్పృహలోకి రాలేదు.

మెడికోలీగల్ కేసు కాబట్టి పోలీసులువచ్చి స్టేట్మెంట్ తీసుకుంటూ అడిగారు. "మీరెవరినైనా అనుమానిస్తున్నారా?"

తనలాంటి వాడికి నిజానికి శత్రువులు ఉండరు. ఉండే అవకాశంలేదు.

కాని శ్యామ్‌లాంటి శత్రువుని ఏర్పరుచుకున్నాడు.

దానికూడా తను కారణం కాదు.

ఒకవేళ 'జరిగినదానికి జరిమానా చెల్లిస్తావ్' అంటూ శ్యామ్ అన్న మాటలు జ్ఞప్తికి రాకపోతే అసలు శ్యామ్‌నీ అనుమానించేవాడు కాదేమో.

ఇప్పుడూ ఖచ్చితంగా శ్యామ్ చేయించిందే అనుకోవడంలేదు.

అనుకుంటే పోలీసులకి ఆ నిజం చెప్పాలి.

ఆ నిజంతోబాటు ఇంకా నిర్ణయకి సంబంధించిన చాలా వివరాలు మాట్లాడాలి. అది తన కిష్టం లేదు.

తన పరువుకన్నా ఆమె పరువు కాపాడటం అవసరం అనిపించిందేమో నెమ్మదిగా అన్నాడు శ్రీహర్ష.

"నాకెవరూ శత్రువులు లేరు కాబట్టి నేనెవర్నీ అనుమానించడంలేదు. బహుశా మామూలుగా దోపిడీకోసం ప్రయత్నించారనుకుంటాను."

ఆ సాయంకాలం ఇంటికి బయలుదేరాడు శ్రీహర్ష హాస్పిటల్‌నుంచి.

తలకి బేండేజ్‌తో ఇంటికి వచ్చిన అతను ఇప్పుడు మనసుకి కాక మెదడుకి గాయమైన మనిషిలా ఉన్నాడు.

"ఏం జరిగింది?" అంటూ ఉద్వేగ్నంగా ముందుకు రాబోయిన నిర్ణయ చాలా బలంగా నిభాయించుకుంది.

తమది ఒకప్పటి దాంపత్యమే అయితే ఆర్తిగా అతన్ని చుట్టేసేది. తనకు తెలీకుండా రాలే కన్నీళ్ళతో అభిషేకంతైనా అతడికి పూరట అందించేది.

కాని ఇప్పుడు తామిద్దరూ దంపతులు కారు....

ఒకే గదిలో కలిసి బ్రతుకుతున్న ఇద్దరు అపరిచితులు.

ఆమె నేత్రాల నుంచి జలజలా నీళ్ళు రాలుతుంటే విడియంగా తల వంచుకున్నాడు.

"చిన్న ఏక్సిడెంట్...."

వాక్శుద్ధి కల రుషి అబద్ధం చెప్పలేదు. చెప్పినా అతకదు.

ఈ ఒక్క సత్యాన్ని గ్రహించిన ఆమె నిశ్శబ్దంగా వుండిపోలేక పోయింది.

భార్యలా కాదు ఒకప్పటి ప్రియురాలిలా లేచింది ఉత్సాహంగా.

ఇద్దరిమధ్య నయోధ్య తరగనిదన్నంత ఆర్తిగా వంట చేసింది.

అతడు విస్తుపోయి చూస్తుండగానే భోజనం తీసుకొచ్చింది ప్లేటులో వడ్డించి.

"నేను తినిపిస్తాను" అంది మామూలుగా.

ఎన్నాళ్ళయింది ఇలాంటి ఆత్మీయతని ప్రదర్శించి.

ఎప్పుడో పెళ్ళయిన కొత్తలో అతడ్ని బుజ్జిపాపాయిలా భావించి తినిపించేది.

నర్సరీ రైమ్స్ కూడబలుక్కునే పసికందులా మాట్లాడే శ్రీహర్షని చూస్తూ తన అదృష్టానికి మురిసిపోతూ ఒడిలో నిద్రపుచ్చేది.

ఏదమ్మా....నిరుటి వసంతం ఇప్పుడేమైంది?

చీకటి నవ్విన చిన్న వెలుతురై మదిలోని తొలి కోరిక మేనుని కుదుపుతుంటే మసక నిద్దుర బడలికతో సోలే యీ మనిషికి తినిపించి ఎన్ని యుగాలైంది.

ఆమె తినిపిస్తూంది అతడ్ని పసిపిల్లడ్ని చేసి.

ఆమె సిగ్గుతో చీలిపోతున్న శిల్పమో లేక కన్నీరుగా కరిగిపోతున్న కవితో మరి విధి తపస్సుని విషాద స్మృతిని తిట్టుకుంటూ వెర్రిగా ఉత్సాహ పడుతూంది.

ఎంతసేపలా మగతగా మౌనంగా గడిపిందో ఆమెకు గుర్తులేదు.

బడలికగా బెడ్‌పై నిద్రపోతున్నాడు శ్రీహర్ష.

బయలుదేరిందెక్కడికో..

అయిదు నిమిషాలు నడిచిన ఆమె ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌దగ్గిర ఆగింది.

ఆమె ఇప్పుడు నిన్నమొన్నటి నిర్జయలా లేదు. హాలాహలమైన జీవన వాస్తవికతలా కృత్రిమ వేషాన్ని అభినయించలేని భార్య పాత్రలా వుంది.

డయల్ చేసిన నిమిషానికల్లా వినిపించింది అవతలివేపునుంచి "శ్యాం హియర్"

"నేను...."

"నిర్జయా....నువ్వా....చెప్పు" ఉత్సాహంగా పలకరించాడు.

"ఎక్కడనుంచి?" అడిగాడు.

"ఎక్కడ్నుంచయితేనేం"

ఆ సమయంలో శ్యామ్ ఏ స్థితిలో వుండేదీ ఆమెకు తెలుసు.

"పోలీసులు మనల్ని అనుమానించే పరిస్థితి కల్పించావ్."

క్షణం నిశ్శబ్దం....

"వాడు నేనే కారణమని చెప్పాడా?"

చాలా ప్రశ్నలు అవసరం లేకుండా సరాసరి శ్రీహర్ష టాపిక్ తెచ్చాడు శ్యామ్.

"లేదు....ఏదో ఏక్సిడెంటని చెప్పినట్టున్నాడు"

"అలాంటప్పుడు పోలీసులు మనల్నెలా అనుమానిస్తారు ?"

"పర్వాలేదంటావా?" చిరు భయాన్ని అభినయించింది.

"నో ప్రాబ్లమ్...." ఉత్సుకతగా అన్నాడు.

"లేపేయమని ఎంప్లాయ్ చేయబడ్డ ఆ రాస్కెల్స్ యీపాటికే విజయవాడ వెళ్ళిపోయుంటారు."

అర్థమైపోయింది చేయించింది శ్యాం అని.... పైగా ప్రత్యేకించి విజయవాడనుంచి గూండాల్ని రప్పించాడు.

"ఇకముందు ఆయనపై యిలా అఘాయిత్యం చేయించకు"

"ఏం....భర్త మీద జాలిపడుతున్నావా?"

"మరేం.... భర్తనే నిర్వచనానికి తగ్గట్టు నేనేం చేసినా భరిస్తున్నాడుగా?"

క్షణం ఆగి అన్నాడు "వాడికేమీ జరక్కూడదంటే మన మధ్య సంబంధానికి వాడు అడ్డుపడకూడదు."

"అడ్డుపడడు."

"వస్తావా"

ఫోన్ క్రెడిల్ చేసింది జవాబు చెప్పకుండా.

ఆ రాత్రి నిర్ణయ ఏం నిర్ణయించుకుందో కేవలం ఆమెకు మాత్రమే తెలుసు.

తెల్లవారేసరికి శ్రీహర్షకి తెలిసిపోయింది.

నిర్ణయ యిల్లు వదిలి వెళ్ళిపోయింది తనకు బదులుగా ఓ వుత్త రాన్ని బెడ్‌పై వుంచి.

తప్పు చేసిన ప్రతి ఆడపిల్ల కథకీ ముగింపు ఏదన్నా కాని నిర్ణయ మరోలాంటి ముగింపుని కోరుకుంది.

* * * * *

"శ్రీ....

మిమ్మల్ని ఏమని సంబోధించాలో, ఎలా పిలిస్తే మీరంటే నాకుగల ప్రేమను మీ గుండె లోతులదాకా చొచ్చుకుపోగల ఆర్తిని వ్యక్తం చేయ గలనో నాకు తెలీదు. అందుకే సగం సంబోధనతో ఆపేశాను. బెటర్‌హాఫ్‌ని కదా....

మేథమెటికల్‌గా ఆలోచిస్తే 'మనం' నుంచి 'నన్ను' మైనస్ చేస్తే 'మీరు' మిగలాలి.... ఇలా ఎందుకంటున్నానూ అంటే నేను మనసులో కాక మేథమెటికల్‌గా ఆలోచించడమే అలవాటైన ఆడపిల్లని కాబట్టి....

ఈ విషయమూ ఆదిలో నాకు తెలీదు శ్రీహర్షా.... పతనం తర్వాత పూర్తిగా అర్థమైంది.

ఎప్పుడో చదివాను.

దారి తెలియక దిక్కు తోచక తాపాగ్ని చల్లార్చుకోటానికి వన మంతా తిరిగిన గజేంద్రుడు చివరికి ఓ కొలనులో కాలు పెట్టాడు. అది కథలా అనిపించింది ఆ రోజు.

కాని.... వాంఛా దావానలంలో తపిస్తూ జీవిత కంటకారణ్యంలో సుఖం కోసం అన్వేషించే ఓ మనిషి ఇంద్రియ సుఖాలనే కొలనులో కాలుం చడమే ఆ కథకి అర్థమని యీ రోజు నా జీవితాన్ని నేను చూసుకున్నాక అర్థమైంది.

ఇదీ నిజం కదూ.... కొలనులో గజేంద్రుడ్ని మొసలి పట్టుకున్నట్టు విషయసుఖాలకి బానిసనైన నన్ను శ్యాం లోబరుచుకున్నాడు. గజేంద్రుడు పెనుగులాడేడు. చివరికి శక్తి సన్నగిల్లి దేవుడికోసం మొర పెట్టుకున్నాడు. కాని నేను మాత్రం పెనుగులాటనే జీవితంగా మార్చుకున్నాను. దాని నుంచి రావాలనుకుంటూనే వూబిలో కూరుకోవడం అలవాటు చేసుకున్నాను. అయినా మీరు వచ్చారు నాకు అండగా వుండాలని.

పేకమేడలై కూలిపోతున్న ఆశాసౌధానికి మీ వ్యక్తిత్వాన్ని ఆసరాగా వుంచి దేవుడ్ని మించిన దయతో నన్ను ఆదుకోవాలనుకున్నారు.

అశోకవనంనుంచి స్వచ్ఛంగా తిరిగొచ్చిన సీతను అగ్నిపునీతకమ్మని అడిగిన రాముడ్ని మించిన ఔదార్యంతో నేను పతితనని తెలిసీ నాకు ఆశ్రయమిచ్చారు.

ప్రేమకి ప్రేమించడమే తప్ప ద్వేషించడం చేతకాదనే సత్యానికి సాక్ష్యంలా యింకా నన్ను ఏలుకోటానికి సిద్ధపడ్డారు.

అప్పటికిగానీ అర్థం కాలేదండీ.

నిజానికి నేను మిమ్మల్ని ప్రేమించలేదు.... ప్రేమిస్తున్నానన్న భావాన్ని ప్రేమించాను. నాకున్న భ్రాంతుల్ని ప్రేమించాను.

కాని మీరో.... నన్ను నన్నుగా త్రికరణశుద్ధిగా ప్రేమించారు. కాబట్టే నా పతనాన్ని క్షమించగలిగారు.

నేను కోరి జారిన దారి నాకిష్టమైందేమో అన్న ఆలోచనలో శ్యాంకి నన్ను దగ్గర చేర్చాలనీ ప్రయత్నించారు.

ఎలా భరించగలను శ్రీహర్షా?

మనిషిగా తలెత్తుకు తిరగలేని నేను మీకు భార్యగా ఎలా వుండగలను. మలినాశ్రుబిందువునైన నేను మీ నేత్రాలు యింకా వర్షించగల ఆనంద బాష్పంగా జీవితాన్ని ఎలా గడపగలను?

అందుకే మీకు దూరంగా వెళ్ళిపోతున్నాను.

చావాలని కాదు.... మరేదో సుఖాన్ని మూటగట్టుకోవాలనీ కాదు. చేసిన పాపాన్ని ఓ తపస్సుతో కడిగేసుకోవాలని.... ఆ విధంగా మళ్ళీ జన్మెత్తని స్థితిని శాశ్వతంగా పొందాలని....

నిజం....

ఇంకో జన్మని నేను కోరుకోవటంలేదు. ఎందుకంటే మీలాంటి మరో తపస్వి జీవితాన్ని మళ్ళీ కలుషితం చేయడం యిష్టంలేదు కాబట్టి.

నన్ను వెదకాలని ప్రయత్నించకండి.

ఎక్కడో ఏ మూలనో బ్రతికే నేను కోరేది మీరు సుఖంగా బ్రతకడాన్ని అన్న సత్యం మరిచిపోకుగా.

అవును శ్రీహర్షా....ఓ పీడకలలాంటి నన్ను జ్ఞప్తికి తెచ్చుకోకండి.

మళ్ళీ మీ జీవితాన్ని ప్రారంభించండి.

అదే నా ఆఖరి అభ్యర్థన....

మీ నేమీ కాని....

ఓ నిర్ణయ...."

ఉత్తరాన్ని చదువుతూ వుండిపోయిన శ్రీహర్ష వెంటనే ఏ నిర్ణయమూ తీసుకోలేకపోయాడు.

ఎక్కడికి వెళ్ళింది నిర్ణయ?

ఏమై వుంటుంది?

అరగంట గడిచింది.

మరో గంటన్నరదాకా అదే ఉత్తరాన్ని మళ్ళీ మళ్ళీ చదివాడు.

ఆ తర్వాత శక్తిని కూడగట్టుకుని బయటికి నడిచాడు.

సాయంకాలందాకా ఎక్కడెక్కడో తిరిగాడు.

సూర్యుడి తాపానికి మంట అంటుకున్నట్టు నిశ్శబ్దం అతడి గుండెల్ని కలిచివేస్తుంటే మనసు గాయాలపై రగిలే నెత్తుటి కలల్లాంటి ఆలోచనలతో ఎంత రాత్రిదాకా తిరిగి తిరిగి అలసిపోయాడో గుర్తులేదు.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో యింటికి వచ్చాడు.

సద్దుమణిగిన నగరం.

నిర్దయ పాదాల ముద్రలు సైతం కనిపించని యింటిలో ఒంటరితనం.

ఇప్పుడు సగం మెదిలే కలలాంటి మొన్నటి రంగుల వల....

ఆకలి లేదు.

ఆరాటం లేదు....

రాజుకుంటున్న స్మృతుల రవ్వలు శరీరాన్ని మంట పెడుతుంటే ఇల్లు చీకటి కుంపటై అంధకారపు సముద్రానికి ఆవలి ఒడ్డున వున్న నిర్దయ రూపం అస్పష్టంగా కనిపిస్తోంది.

అది మగతో నిద్రో అతడికే తెలీదు.

అలాగే కళ్ళు మూసేడు....

ఎవరున్నారని తన కోసం యిక ఆలోచించటానికి?

మనసు పొరల్ని చించిన గతం తప్ప యిక తనకేం మిగిలిందని?

రెప్పల్ని తడిపే కన్నీటి చుక్కలే నేస్తాలు తప్ప చిరిగిన బ్రతుకు పేజీ చివరి వాక్యాలను రాయటానికి తనకిక వున్నదెవరు?

కొత్త అధ్యాయం కాదిది....

ముగిసిపోయిన జీవితం....

*   *   *   *   *

బడలికగా కళ్ళు తెరిచాడు శ్రీహర్ష.

ఎదురుగా శంకర్ కూర్చుని వున్నాడు. సమీపంలో ప్రమీల....

తెల్లవారుజామునే వచ్చారా?

నీరసంగా పైకి లేవబోతూ అప్పుడు గుర్తించాడు.

తను ఇంట్లో లేడు?

హాస్పిటల్లో అడ్మిట్ చేయబడ్డాడు.

"ఇ....క్క....డి....కి...." శ్రీహర్ష మాటలింకా పూర్తి కాలేదు.

శంకర్ అన్నాడు నెమ్మదిగా....

"వారం రోజులుగా నువ్వు హాస్పిటల్లోనే వున్నావు శ్రీహర్షా.... ఆ రోజు ఉదయం నేను మీ యింటికి వచ్చేసరికి జ్వరంతో స్పృహ లేకుండా పడుంటే ప్రమీలగారూ నేనూ హాస్పిటల్లో అడ్మిట్ చేశాం."

వారం రోజులుగా తను స్పృహలో లేడా?

అస్పష్టంగా, లీలగా ఏదో గుర్తొస్తూంది.

కానీ అదంతా కలే అనుకున్నాడు తప్ప యిలాంటి సమస్యలో చిక్కుకున్నట్టు గుర్తులేదు.

నర్స్ వచ్చి ఇంజక్షన్ చేసి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత కూడా అక్కడ నిశ్శబ్దమే తప్ప ఎవరూ మాట్లాడలేదు చాలాసేపటిదాకా.

"ఇంకా ఎంతకాలం వుండాలి?" అడిగాడు శ్రీహర్ష శక్తిని కూడ గట్టుకుని.

"తగ్గేదాకా" చెప్పాడు శంకర్.

ఆ రోజు శ్రీహర్ష బెడ్‌పై వున్న పత్రికాన్ని శంకర్‌తోపాటు ప్రమీలా చదివారు. కాబట్టి నిర్ణయం విషయం ప్రస్తావించలేదు ఇద్దరూ.

"తగ్గాలంటే...." గొణుగుతున్నట్టుగా అడిగాడు శ్రీహర్ష.

"మరో వారంరోజులు హాస్పిటల్లోనే వుండాలంటారు డాక్టరు...." మృదువుగా అంది ప్రమీల.

"మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను"

"కృతజ్ఞతలు తర్వాత. ముందు రెస్ట్ తీసుకో."

ప్రమీల జవాబు విన్న తర్వాత ఇక ప్రసక్తిని పొడిగించలేదు శ్రీహర్ష.

అయినా మాట్లాడుకోవటానికేముందని....

కృత్రిమ వేషాన్ని అభినయిస్తూ బ్రతుకుతున్న తను ఉత్సాహంగా మాట్లాడగల విషయం ఏముంటుంది?

ప్రేమతో కుబేరుడైన వ్యక్తి కనురెప్పపాటులో కుచేలుడిగా మారితే ఏ వాక్యాలు, ఏ చర్చలు ఊరటనందించగలవని....

నిస్పృహాయతే శరణ్యం అనుకునే తనలాంటివాడు అరణ్యవాసాల గురించే తప్ప నడిచే దారిలో మోకరిల్లే నక్షత్రాల జల్లులాంటి స్మృతుల గురించి ఇంకేం చర్చించగలడని....

శంకర్ వెళ్ళిపోయాడు.

లాలనగా అతడి నుదుటిపై చేతినుంచింది ప్రమీల.

"నిద్రపో...."

ఓ వేడిపటి బొట్టు అతడి చెంపలపైకి జారింది.

వలదన్నట్టుగా తలనడ్డంగా ఊపింది ప్రమీల. "వద్దు......అంతా మరిచిపో"

"ఎలా...."

"ధైర్యంతో."

"అదీ నన్ను గెల్లిపోయింది"

"కాబట్టే దిగులుతో జ్వరం పెట్టుకున్నావ్?" సాలోచనగా అందామె. "పిరికివాళ్ళకి ప్రపంచంలో స్థానంలేదు శ్రీహర్షా....బ్రతకాలి అంటే ధైర్యముగా వుండాలి."

"నిర్దయ ..." ఆమె పేరు ఆ క్షణంలో ఉచ్చరించడానికి చాలా శ్రమపడ్డాడు శ్రీహర్ష.

"పెళ్ళి ఇప్పటికి వారం దాటింది."

"అభినందిస్తున్నాను నిర్దయని" తను అన్న మాటకి శ్రీహర్ష ఎంత రియాక్టయిందీ అర్థమైనట్టు వెంటనే అంది ప్రమీల.

"అవును శ్రీహర్షా....చాలాకాలం ఆత్మవంచనతో బ్రతికిన నిర్దయ ఇప్పుడు తన దారిని తను ఎన్నుకుంది నిర్భయంగా."

"ఇది నిర్భయంగా తీసుకున్న నిర్ణయం ఎలా అవుతుంది?"

"ఖచ్చితంగా దీన్ని ధైర్యమే అంటాను శ్రీహర్షా....తన జీవితం తెలియకుండా బేజారిపోయిందనుకున్న నిర్దయ యిప్పుడు తెలిసే ఏ నిర్ణయం తీసుకున్నా అది అభినందించదగ్గ విషయమేగా"

"నిర్దయ ఏమైందో తెలీకుండా ఇలాంటి అభిప్రాయానికి ఎలా రాగలిగావు?"

"తగ్గేదాకా" చెప్పాడు శంకర్.

ఆ రోజు శ్రీహర్ష బెడ్‌పై వున్న చిత్రాన్ని శంకర్‌తోపాటు ప్రమీలా చదివారు. కాబట్టి నిర్ణయ విషయం ప్రస్తావించలేదు ఇద్దరూ.

"తగ్గాలంటే...." గొణుగుతున్నట్టుగా అడిగాడు శ్రీహర్ష.

"మరో వారంరోజులు హాస్పిటల్లోనే వుండాలంటారు డాక్టరు...." మృదువుగా అంది ప్రమీల.

"మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను"

"కృతజ్ఞతలు వద్దులే. ముందు రెస్ట్ తీసుకో."

ప్రమీల జవాబు విన్నాక తర్వాత ఇక ప్రసక్తిని పొడిగించలేదు శ్రీహర్ష.

అయినా మాట్లాడుకోవటానికేముందని....

కృత్రిమ వేషాన్ని అభినయిస్తూ బ్రతుకుతున్న తను ఉత్సాహంగా మాట్లాడగల విషయం ఏముంటుంది?

ప్రేమతో కుబేరుడైన వ్యక్తి కనురెప్పపాటులో కుచేలుడిగా మారితే ఏ వాక్యాలు, ఏ చర్చలు ఊరటనందించగలవని....

నిస్సహాయతే శరణ్యం అనుకునే తనలాంటివాడు అరణ్యవాసాల గురించే తప్ప నడిచే దారిలో మోకరిల్లే నక్షత్రాల జిల్లుల్లాంటి స్మృతుల గురించి ఇంకేం చర్చించగలడని....

శంకర్ వెళ్ళిపోయాడు.

లాలనగా అతడి నుదుటిపై చేతినుంచింది ప్రమీల.

"నిద్రపో...."

ఓ వేడినీటి బొట్టు అతడి చెంపలపైకి జారింది.

వలదన్నట్టుగా తలపన్తంగా ఊపింది ప్రమీల. "వద్దు......అంతా మరిచిపో"

"ఎలా...."

"ధైర్యంతో."

"అదీ సన్నగిల్లిపోయింది"

"కాబట్టే దిగులుతో జ్వరం పెట్టుకున్నావా?" సాలోచనగా అందామె. "పిరికివాళ్ళకి ప్రపంచంలో స్థానంలేదు శ్రీహర్షా....బ్రతకాలి అంటే ధైర్యముగా వుండాలి."

"నిర్ణయ ..." ఆమె పేరు ఆ క్షణంలో ఉచ్ఛరించటానికి చాలా శ్రమపడ్డాడు శ్రీహర్ష.

"వెళ్ళి ఇప్పటికి వారం దాటింది."

"అభినందిస్తున్నాను నిర్ణయని" తను అన్న మాటకి శ్రీహర్ష ఎంత రియాక్టయిందీ అర్థమైనట్టు వెంటనే అంది ప్రమీల.

"అవును శ్రీహర్షా....చాలాకాలం ఆత్మవంచనతో బ్రతికిన నిర్ణయ ఇప్పుడు తన దారిని తను ఎన్నుకుంది నిర్భయంగా."

"ఇది నిర్భయంగా తీసుకున్న నిర్ణయం ఎలా అవుతుంది?"

"ఖచ్చితంగా దీన్ని ధైర్యమే అంటాను శ్రీహర్షా....తన జీవితం తెలియకుండా చేజారిపోయిందనుకున్న నిర్ణయ యిప్పుడు తెలిసి ఏ నిర్ణయం తీసుకున్నా అది అభినందించదగ్గ విషయమేగా"

"నిర్ణయ ఏమైందో తెలీకుండా ఇలాంటి అభిప్రాయానికి ఎలా రాగలిగావు?"

ఇప్పటికీ శ్రీహర్ష నిర్ణయ ఉనికిని ఎంతగా కోరుకుంటున్నదీ అర్థం అయిపోయిందామెకి.

"ఇప్పుడామె ఏమైందీ నువ్వాలోచించాల్సిన అవసరంలేదు శ్రీహర్షా! ప్రేమనే పదానికి అర్థం ప్రేమించిన మనిషి నిర్ణయాన్ని గౌరవించడమే అయితే ఇప్పుడామె డెసిషన్‌ని నువ్వూ ఆమోదించాలి. అయినా ఇప్పుడామె నీకేమౌతుందని....అంతే శ్రీహర్షా........గడపదాటి శాశ్వతంగా వెళ్ళిన అమ్మాయి గురించి ఆలోచించడం కాదు. నువ్వు నిజంగా ఆమెను ప్రేమించడం నిజమైతే ఆమె ఉత్తరంలో రాసినట్టుగా నీ దారి నువ్వు చూసుకోవాలి...."

"అసంభవం...."

"ఇలాంటి చాలా అసంభవాలు సంభవాలు అయినప్పుడే అది జీవితమౌతుంది........ఇంకా స్పష్టంగా చెప్పాలీ అంటే బ్రతకడం అనిపించుకుంటుంది."

"అదీ నాకు సాధ్యం కాకపోతే...."

"ఎందుకు సాధ్యంకాదు?" తార్కికంగా ప్రశ్నించింది ప్రమీల.

"అమ్మా నాన్నలెవరో తెలియకుండా అనాధ శరణాలయంలో పెరిగిన నీకు ఆత్మీయతలు, అప్యాయతలు ఎలా వుండేదీ అర్థంకాకుండా యవ్వనందాకా కాలాన్ని నెట్టుకొచ్చిన నీకు యిప్పుడామె లేకుండా బ్రతకడం అసాధ్యమెలా అవుతుంది?

జీవితానికి నిర్వచనం అదే శ్రీహర్షా....చాలా కోరుకుంటాం. కానీ కొన్నింటినే దక్కించుకుంటాం. ఆ కొన్నింటినైనా శాశ్వతం చేసుకోవాలను

కుంటాం. వాటిని చిరస్థాయిగా దక్కించుకోలేని స్థితిలో కూరుకుపోతాం.... ఇది సృష్టి....

ఈ సృష్టిలో జన్మ పొందిన మనం కొంతకాలానికి జన్మ యిచ్చిన తల్లిదండ్రులను పోగొట్టుకుంటాం. అయినా బ్రతుకుతాం....

భార్యాబిడ్డల మధ్య బంధాన్ని పెంచుకుంటాం. ఆ తర్వాత మన దారి మనం చూసుకున్నట్టు మరణంతో వాళ్ళకి దూరమౌవుతాం. మనలాగే వాళ్ళూ కొంతకాలానికి వచ్చినపని అయ్యేదాకా వుంటారు.

ఆ తర్వాత యీ ప్రపంచానికి శలవ్ తీసుకుంటారు. ఇదో ప్రోసెస్. ఏ సెన్సేషనల్ ఛేంజ్........తప్పదు. ఈ పత్రాన్ని సోక్రటీసైనా అంగీకరించాలి. ఆలోచించలేని జంతువులైనా ఒప్పుకుని తీరాలి"

ఆమె బాధగా కిటికీ బయటికి చూస్తూ వుండిపోయింది

చాలా సందేహాలు శ్రీహర్షను చుట్టుముడుతున్నాయి. కానీ నివృత్తి చేసుకునే ధైర్యాన్ని వ్యక్తం చేయలేదు.

"పడుకో శ్రీహర్షా" నిర్వేదంగా అంది ప్రమీల.

"మన జీవితంలో కలలుకనే అదృష్టాన్ని అందించేది నిద్రే అయితే ఆ నిద్రకి దూరమై జీవితంలోని మాధుర్యాన్ని పోగొట్టుకునే ప్రయత్నం చేయకు"

"అది కాదు ప్రమీలా...." చాలా సేపటి సందిగ్ధం తర్వాత అన్నాడు శ్రీహర్ష.

"నిర్జయని ఒక్కసారి చూడాలనుంది."

ఉద్వేగ్నంగా కాదు యధాలాపంగా అతడివేపు చూసింది.

ఏమిటీ మగాడు....

ఇంత జరిగినా ఆమెను ఎందుకు ద్వేషించలేకపోతున్నాడు?

జనన మరణాతీతమైన రహస్యమే ప్రేమని అందరూ చెప్పే నిర్వచనానికి అతీతంగా మరో కొత్త భాష్యం చెప్పాలని ఎందుకు ప్రయత్నిస్తున్నాడు?

"నువ్వు కావాలనుకుంటే నిర్ణయ ఎక్కడుందో తెలుసుకోగలవు ప్రమీలా....కొంచెం ప్రయత్నించవూ."

ఆమె జవాబు చెప్పలేదు.

"ఒక్కసారి... నిర్ణయతో మాట్లాడే అవకాశం కావాలి. అంతే..."

అది సాధ్యమో అసాధ్యమో చెప్పలేదు ప్రమీల.

"చూద్దాం....నువ్వు శాంత ప్రశాంతంగా వుండు....కనీసం నువ్వు పూర్తిగా కోలుకునేదాకా"

జీవకళ నశించిన శ్రీహర్ష యింకా దోసిలిపట్టి దక్కించుకోవాలనేది ఆడియాసల పుష్పాడినో లేక పోయిన జీవితాన్నో అర్థంకాక జాలిగా అతడిని చూసింది.

తను నిర్మించుకున్న ఆశాచంద్రశాలలో చిక్కి శల్యమైనా యింకా ఓ కౌముదీ శీతల కిరణరేఖ కోసం ఆశపడుతున్నాడు బాధగా, భ్రాంతిగా....

మరో వారం గడిచింది.

ప్రతిరోజూ నిర్ణయ ఎక్కడుందని అడుగుతూనే వున్నాడు. కూడని ఆర్తితో ఆరోగ్యానికి దూరమవుతూ యించుమించు వేధిస్తున్నాడు.

హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి కాగానే ప్రమీల కొన్ని రోజులపాటు అతడ్ని తన ఇంటిలో వుండమని ప్రాధేయపడింది.

మానసికంగా అలిసిపోయిన శ్రీహర్షకి అలా కొంతకాలం ఊరట నందించాలనుకుంది.

కానీ శ్రీహర్ష రాలేదు.

సరాసరి ఇంటికి వెళ్ళాడు.

నిర్ణయ రాసిన ఒక్క ఉత్తరమైనా ఇంటి దగ్గర దొరుకుతుందేమో అన్న ఆశ....

అవీ అడియాసే అని తెలుసుకోవడానికి ఎక్కువసేపు పట్టలేదు.

* * * *

"ఏదీ నిర్ణయ....ఎక్కడికి పంపించేవు ?"

గదిలోకి దూకుతూగా అడుగుపెట్టిన శ్యాం రెచ్చిపోతూ అడిగాడు.

శ్రీహర్ష జవాబు చెప్పలేదు....నిశ్చలంగా చూశాడు.

నిజానికి ఆ క్షణందాకా నిర్ణయ శ్యాం దగ్గరికి వెళ్ళి వుంటుందన్న ఆలోచన ఏ మూలలో వుండే అది నాస్తక్లియరైపోయింది.

అదికాదు శ్రీహర్ష ఆలోచిస్తుంది.

ఇన్ని అనర్థాలకీ మూలమైన శ్యాం కట్టుకున్న భర్తలా నిర్ణయ గురించి తనను నిలదీస్తున్నాడు.

"మాట్లాడవేం?" ఇంచుమించు కలియబడినంత పనిచేశాడు శ్యాం.

"పదిహేనురోజులుగా ఎదురుచూస్తున్నాను మిస్టర్ శ్రీహర్షా. నిర్ణయ జాడలేదు. కనీసం నువ్వూ ఇంటిపట్టున లేవు. చెప్పు.... ఎక్కడికి పంపేవు?"

"తెలీదు" నీరసంగా అన్నాడు శ్రీహర్ష. అర్గ్యూ చేయాలన్నా ఓపిక లేదు.

"ఎక్కడికి వెళ్తున్నదీ తనూ చెప్పలేదు"

"పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యకు" హుంకరించాడు శ్యాం.

అసలు హత్యకైనా వెనకాడని ఉన్మాదంతో తాగివచ్చిన శ్యాం ఇంత కాలం తర్వాత కనిపించిన శ్రీహర్షని వదిలిపెట్టకూడదనుకున్నాడు.

"నాకు జవాబు కావాలి శ్రీహర్షా. ఆమె ఎక్కడుందో తెలియాలి"

సహనం నశించిపోయింది శ్రీహర్షకి.

"ఎవడ్నువ్వు ?"

ఉద్వేగంగా పైకి లేచాడు.

"ఆమెకి నువ్వేమవుతావని ఇలా అడుగుతున్నావ్? వెళ్ళు బయటికి"

"వచ్చింది వెళ్ళటానిక్కాదు.... ఆమె గురించి తెలిశాకగాని వెళ్ళను."

పరిస్థితి చేయి దాటేట్టుందని తెలుసు.

ఆమె గురించి నిజంగా తనకేమీ తెలీదని చెబుతున్నా శ్యాం యింకా మొండిగా వ్యవహరించడం సహించలేకపోతున్నాడు.

అయినా మరింత రాద్ధాంతానికి సిద్ధం కాలేకపోయాడు శ్రీహర్ష.

గొడవ ముదిరితే వీధి జనం పోగవుతారు. నిర్మల గురించి వివరంగా తెలిసిపోతుంది.

"ఆమెని నేను ఎక్కడికీ పంపలేదు శ్యాం. పంపేవాడ్ని అయితే ఆ రోజు నీ దగ్గరకు వచ్చేవాడ్ని కాదు."

"నమ్మింది నేనేమిటో తెలుసుకోవాలని"

"కాదు"

"కాకపోతే ఆ రోజు నీ యింటిదగ్గర నా మీద చెయ్యెందుకు చేసుకున్నావ్?"

"నిర్దయ కిష్టంలేకుండా నువ్వు ఆమెపై అఘాయిత్యం చేయబోయావు కాబట్టి."

"ఇష్టం లేకపోతే నా వెంట ఎందుకు పడుతుంది?"

"పడేదైతే ఆ రోజు నిన్నెందుకు తిరస్కరిస్తుంది? ఇప్పుడు నిన్ను కాదని తను ఎక్కడికో ఎందుకు వెళుతుంది?" ఆవేశాన్ని అదిమిపెడుతూ అన్నాడు శ్రీహర్ష.

"ఆమె తనదారి తను చూసుకుంది శ్యాం. కోరి చేసుకున్న నన్ను, జారిపోయి దగ్గరైన నిన్ను కాదని తను మరెక్కడికో వెళ్ళిపోయింది. కావాలంటే యీ ఉత్తరం...."

గూటిలో వున్న ఉత్తరాన్ని అందించబోతుంటే రోషంగా వినిపించింది "ఆగు...."

ఎప్పుడు వచ్చిందో ప్రమీల ద్వారం దగ్గర నిలబడి వుంది. ఆవేశముగా ఉత్తరాన్ని లాక్కున్న ప్రమీల—

"ఓ లోఫర్‌కి ఇలాగా సంజాయిషీ యివ్వాల్సిన అగత్యం లేదు."

ఉలిక్కిపడ్డాడు శ్యాం.

సాయంకాలపు నీరెండ కిటికీలోనుండి వాలుగా అతడిపైపడి అపరాహ్ణ సూర్యుడి కిరణాల్లా చురుక్కుమనిపిస్తుంటే ఉక్రోషంగా అడిగాడు శ్యాం.

"మధ్య నువ్వెవరు?"

"నీకు చెప్పాల్సిన అగత్యం లేదు" టక్కున అంది.

"మర్యాదగా బయటికి నడు. లేదా అంటే పోలీసుల్ని పిల్పించి నా పవర్ పరపతేమిటో నిరూపించుకోవాల్సి వస్తుంది."

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

అంతసేపూ చాలా ఆవేశాన్ని ప్రదర్శించిన శ్యాం అమె జోక్యంతో ఉన్నట్టుండి ఎందుకు చల్లబడ్డాడో శ్రీహర్షకే తెలీదు.

"వెళ్ళిపో మిస్టర్ శ్యాం....ఒక అందమైన పొదరిల్లుని నేలమట్టం చేసిన విజయగర్వంతో నీ ప్రపంచంలోకి నువ్వు తరలిపో. ఒక దుష్యత్వపు వ్యక్తిత్వాన్ని రుచి చూసిన అదృష్టం నీకింకా బ్రతికే అవకాశమిచ్చిన సంతృప్తిలో నీ గూటిలోకి నువ్వు అడుగుపెట్టు.

"క్రౌంచ పక్షుల్ని విడదీసిన శోకం నీకు లేకపోయినా ఈ అనుభవం నువ్వు రాసిన ఓ క్రూర కావ్యంలో శ్లోకంగా మారకపోయినా పర్వాలేదు.

ఓ ఆలయాన్ని ధ్వంసంచేసిన బోయివాడిలా ఆనందపడుతూ శేష జీవితాన్ని గడిపెయ్. మళ్ళీ ఈ ఛాయలకి రాకు. మరోమాట...." నిర్వేదంగా ఆగింది.

"నీకిప్పుడు నైతిక విలువల గురించి చెప్పడం అవివేకమని నాకూ తెలుసు. కాని మరో భార్య పాత్రపై ఇలాంటి ప్రయోగం చెయ్యకు. ఎందుకంటే.... అందరూ క్షమించి వదిలిపెట్టే శ్రీహర్షలే వుండరు ....నరికి ముక్కలుచేసే వ్యక్తులూ తారసపడొచ్చు."

ఆమె మాటల తూటాలే పనిచేశాయో లేక గొంతే ధనుష్టంకారమై శ్యాంని కంగారుపెట్టిందో నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు.

"బయలుదేరు" నెమ్మదిగా అంది శ్రీహర్షని చూస్తూ.

"ఎక్కడికి ?"

"మా యింటికి"

తల వంచుకున్నాడు శ్రీహర్ష.

"భయపడకు శ్రీహర్షా...నా మూలంగా నీకే ఆపదా రాదు"

ఆ వాక్యాన్ని ప్రయోగించింది జోవియల్‌గానో లేక సీరియస్‌గానో అతడికి అర్థంకాలేదు.

"పైగా ఇప్పటి నీ స్థితిలో నీకు తోడు కావాలి అవునా ?"

ఆమె పెదవులపై హాస్యాన్ని గమనించలేదు అతను.

బుద్ధిమంతుడైన బాలుడిలా ఆమె వెంట నడిచాడు.

స్థలాన్ని మార్చినంతమాత్రాన అతడి జ్ఞాపకాలను చెరిపి తాత్కాలికంగానైనా ఏమరపాటును అందించాలనుకున్న ప్రమీల పొరపడిందని తెలుసుకోవటానికి ఎక్కువకాలం అవసరం లేకపోయింది.

* * * *

ఉలికిపాటుగా నిద్ర లేచింది ప్రమీల.

ఉరుములూ, మెరుపులతో నిశిరాత్రి వణికిపోతూంది.

మరోసారి కిటికీ రెక్కలు బలంగా కొట్టుకున్నాయి.

ఒక్క ఉదుటున కిటికీ దగ్గరికి నడిచి రెక్కల్ని బోల్టు చేసింది.

ఈదురుగాలి మోసుకొచ్చిన వర్షపుజల్లు ఆమె నైటీని తడిపిన విషయము ఆమె స్ఫురణకు రాకముందే వేగంగా శ్రీహర్ష పడుకున్న గది వేపు నడిచింది.

అతను లేడు బెడ్‌పై.

బాల్కనీలో నిలబడి బయటికి చూస్తున్నాడు.

"మర్యాదగా బయటికి నడు లేదా అంటే పోలీసుల్ని పిల్చిందని నా కున్న పరువు తేలిపోనివ్వకుండా కాపాడుకోవాల్సి వస్తుంది."

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

అంతసేపూ చాలా ఆవేశాన్ని ప్రదర్శించిన శ్యాం ఆమె వాక్యంతో ఉన్నట్టుండి ఎందుకు చల్లబడ్డాడో శ్రీహర్షకే తెలీదు.

"వెళ్ళిపో మిస్టర్ శ్యాం.... ఒక అందమైన పొదరిల్లుని నేలమట్టం చేసిన విజయగర్వంతో నీ ప్రపంచంలోకి నువ్వు తరలిపో. ఒక దివ్యత్వపు వ్యక్తిత్వాన్ని రుచి చూసిన అదృష్టం నీకింకా బ్రతికే అవకాశమిచ్చిన సంతృప్తిలో నీ గూటిలోకి నువ్వు అడుగుపెట్టు.

"క్రౌంచ పక్షుల్ని విడదీసిన శోకం నీకు లేకపోయినా ఈ అనుభవం నువ్వు రాసిన ఓ శృంగార కావ్యంలో శ్లోకంగా మారకపోయినా పర్వాలేదు.

ఓ ఆలయాన్ని ధ్వంసంచేసిన బోయివాడిలా ఆనందపడుతూ శేష జీవితాన్ని గడిపెయ్. మళ్ళీ ఈ ఛాయలకి రాకు. మరోమాట...." నిర్వేదంగా ఆగింది.

"నీకిప్పుడు నైతిక విలువల గురించి చెప్పడం అవివేకమని నాకూ తెలుసు. కాని మరో భార్య పాత్రపై ఇలాంటి ప్రయోగం చెయ్యకు. ఎందుకంటే.... అందరూ క్షమించి వదిలిపెట్టే శ్రీహర్షలే వుండరు ....నరికి ముక్కలుచేసే వ్యక్తులూ తారసపడొచ్చు."

ఆమె మాటల తూటాలే పనిచేశాయో లేక గొంతే ధనుష్టంకారమై శ్యాంని కంగారుపెట్టిందో నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు.

"బయలుదేరు" నెమ్మదిగా అంది శ్రీహర్షని చూస్తూ.

"ఎక్కడికి ?"

"పూనా యూనిటికి"

తల వంచుకున్నాడు శ్రీహర్ష.

"భయపడకు శ్రీహర్షా....నా మూలంగా నీకే ఆపదా రాదు"

ఆ వాక్యాన్ని ప్రయోగించింది జోవియల్‌గానో లేక సీరియస్‌గానో అతడికి అర్థంకాలేదు.

"పైగా ఇప్పటి నీ స్థితిలో నీకు తోడు రావాలి. అవునా ?"

ఆమె పెదవులపై హాస్యాన్ని గమనించలేదు అతను.

బుద్ధిమంతుడైన బాలుడిలా ఆమె వెంట నడిచాడు.

స్థలాన్ని మార్చినంతమాత్రాన అతడి జ్ఞాపకాలను చెరిపి తాత్కాలికంగానైనా ఉపశమనాన్ని అందించాలనుకున్న ప్రమీల పొరపడిందని తెలుసుకోవటానికి ఎక్కువకాలం అవసరం లేకపోయింది.

* * * *

ఉలికిపాటుగా నిద్ర లేచింది ప్రమీల.

ఉరుములూ, మెరుపులతో నిశిరాత్రి వణికిపోతూంది.

మరోసారి కిటికీ రెక్కలు బలంగా కొట్టుకున్నాయి.

ఒక్క ఉదుటున కిటికీ దగ్గరికి నడిచి రెక్కల్ని బోల్టు వేసింది.

ఈదురు గాలి మోసుకొచ్చిన వర్షపుజల్లు ఆమె నైటీని తడిపిన విషయము ఆమె స్ఫురణకు రాకముందే వేగంగా శ్రీహర్ష పడుకున్న గదివేపు నడిచింది.

అతను లేడు బెడ్‌పై.

బాల్కనీలో నిలబడి బయటికి చూస్తున్నాడు.

"మర్యాదగా బయటికి నడు లేమా అంటే పోలీసుల్ని రప్పించి నా కున్న పరువు పోయినా సహించుకోవాల్సి వస్తుంది."

హఠాత్తుగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది.

అంతసేపూ చాలా ఆవేశాన్ని ప్రదర్శించిన శ్యాం ఆమె ఔచిత్యంతో ఉన్నట్టుండి ఎందుకు చల్లబడ్డాడో శ్రీహర్షకే తెలీదు.

"వెళ్ళిపో మిస్టర్ శ్యాం....ఒక అందమైన పొదరిల్లుని నేలమట్టం చేసిన విజయగర్వంతో నీ ప్రపంచంలోకి నువ్వు మరలిపో. ఒక దుష్యత్వపు వ్యక్తిత్వాన్ని రుచి చూసిన అదృష్టం నీకింకా ప్రతికే అవకాశమిచ్చిన సంతృప్తిలో నీ గూటిలోకి నువ్వు అడుగుపెట్టు.

"క్రౌంచ పక్షుల్ని విడదీసిన శోకం నీకు లేకపోయినా ఈ అనుభవం నువ్వు రాసిన ఓ శృంగార కావ్యంలో శ్లోకంగా మారకపోయినా పర్వాలేదు.

ఓ ఆలయాన్ని ధ్వంసంచేసిన బోయివాడిలా ఆనందపడుతూ శేష జీవితాన్ని గడిపెయ్. మళ్ళీ ఈ ఛాయలకి రాకు. మరోమాట...." నిర్వేదంగా ఆగింది.

"నీకిప్పుడు నైతిక విలువల గురించి చెప్పడం అవివేకమని నాకూ తెలుసు. కాని మరో భార్యపాత్రపై ఇలాంటి ప్రయోగం చెయ్యకు. ఎందుకంటే.... అందరూ క్షమించి వదిలిపెట్టే శ్రీహర్షలే వుండరు ....నరికి ముక్కలుచేసే వ్యక్తులూ తారసపడొచ్చు."

ఆమె మాటల తూటాలే పనిచేశాయో లేక గొంతే ధనుష్టంకారమై శ్యాంని కంగారుపెట్టిందో నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు.

"బయలుదేరు" నెమ్మదిగా అంది శ్రీహర్షని చూస్తూ.

"ఎక్కడికి ?"

"మా యింటికి"

తల వంచుకున్నాడు శ్రీహర్ష.

"భయపడకు శ్రీహర్షా....నా మూలంగా నీకే ఆపదా రాదు"

ఆ వాక్యాన్ని ప్రయోగించింది జోవియల్‌గానో లేక సీరియస్‌గానో అతడికి అర్థంకాలేదు.

"పైగా యిప్పటి నీ స్థితిలో నీకు తోడు కావాలి. అవునా ?"

ఆమె పెదవులపై లాస్యాన్ని గమనించలేదు అతను.

బుద్ధిమంతుడైన బాలుడిలా ఆమె వెంట నడిచాడు.

స్థలాన్ని మార్చినంతమాత్రాన అతడి జ్ఞాపకాలను చెరిపి తాత్కాలికంగానైనా ఉపశమనాన్ని అందించాలనుకున్న ప్రమీల పొరపడిందని తెలుసుకోవటానికి ఎక్కువకాలం అవసరం లేకపోయింది.

* * * *

ఉలికిపాటుగా నిద్ర లేచింది ప్రమీల.

ఉరుములూ, మెరుపులతో నిశిరాత్రి వణికిపోతూంది.

మరోసారి కిటికీ రెక్కలు బలంగా కొట్టుకున్నాయి.

ఒక్క ఉదుటున కిటికీ దగ్గరికి నడిచి రెక్కల్ని బోల్టు చేసింది.

ఈదురుగాలి మోసుకొచ్చిన వర్షపుజల్లు ఆమె నైటీని తడిపిన విషయము ఆమె స్ఫురణకు రాకముందే వేగంగా శ్రీహర్ష పడుకున్న గదివేపు నడిచింది.

అతను లేడు బెడ్‌పై.

బాల్కనీలో నిలబడి బయటికి చూస్తున్నాడు.

అర్ధరాత్రి దాటినా యింకా అతడు నిద్రపోనందుకు కాదు....వర్షపు జల్లులో తడుస్తున్నందుకు కోపం వచ్చింది.

మానసికంగా అతడు కోలుకోనినాడు ఏ మందులూ అతడిపై ప్రభావము చూపించవని డాక్టరు చెప్పిన మాటల్ని మననం చేసుకుంటూ వారం రోజులుగా చాలా ప్రయత్నించి ఓడిపోయింది.

"రా లోపలికి" అతడి భుజాలు పట్టుకుని లోపలికి లాక్కుంది.

అతడు తేరుకుని జరిగిందేమిటో గుర్తించేలోగా ఉక్రోషంగా అంది.

"అసలు నువ్వేం మగాడివి....ఎంతకాలం యిలా నిన్ను నువ్వు శిక్షించుకోవాలనుకుంటున్నావ్ ?"

తప్పు చేస్తున్నవాడిలా తలవంచుకున్నాడు తప్ప జవాబు చెప్పలేదు.

"మాట్లాడు శ్రీహర్షా....ఏంకావాలనుకుంటున్నావ్ నువ్వు?"

మాసిన గెడ్డం, పాలిపోయిన మొహం, కాంతివిహీనమైన నేత్రాలు క్షణంలో ఆమెను చల్లబరిచాయేమో వెంటనే ఏదో స్ఫురించినట్టు టవల్ అందుకుని అతడి తలని తుడవటం మొదలుపెట్టింది.

ఆమెను వారించబోయాడు.

ఆ పని తనకు తానుగా చేసుకోగలనన్న ఆలోచనతో టవల్‌ని అందుకోబోయాడు.

ఆ క్షణంలో అతడి చేతులు ఆమె వక్షాన్ని తాకడం చాలా యాదృచ్ఛికమే అయినా టక్కున దూరం జరిగాడు.

అదికాదు....అవాక్కయి చూస్తున్న ఆమె కళ్ళలోకి సూటిగా చూడలేనట్టు తల తిప్పుకున్నాడు.

"కంగారుపడకు....కావాలని జరిగింది కాదని తెలుసు" యథాలా పంగా అందామె....

చర్చించటానికి యిబ్బందికరమైన విషయమది.

"అనుకోకుండా జరిగేది కాకతాళీయం. కావాలని జరిగితే కాంక్ష అవుతుంది శ్రీహర్షా" మగతగా నవ్వేసింది.

ఎన్ని కోట్ల లిప్తల క్రితం అతడిపై అలాంటి యిష్టాన్ని గోప్యంగా దాచుకుందో భర్త రాక్షసత్వానికి బలవుతూ సైతం ఎన్నిసార్లు శ్రీహర్షని స్మరించిందో చెప్పలేదు.

కాని ఆ క్షణంలో భర్త గుర్తుకు రావడంతో క్రోధంతో తన సరి హద్దుల్ని మరిచింది కావాలనే.

"నీకూ ఒక మామూలు మగాడికీ తేడా అదే శ్రీహర్షా....ఇప్పుడు జరిగిన ఓ చిన్న సంఘటన చాలు నా మీద అడ్వాంటేజ్ తీసుకోటానికి. కాని నువ్వలా తీసుకోవు. ఎందుకంటే భయం...."

"కాదు" ఉద్విగ్నంగా అన్నాడు.

"పోనీ పిరికితనం...."

"భయానికీ, పిరికితనానికీ తేడా లేదు."

"ఉంది శ్రీహర్షా....రెండింటికీ చాలా తేడా వుంది. పిరికితనం వ్యక్తిగతమైతే భయం పరిసరాలు కల్పించేది."

గోడకి చేరగిలబడింది ఆపోలా నవ్వుతూ.

"ఇంకా వివరంగా చెప్పాలీ అంటే దుర్గమారణ్యంలో వేట కోసం అడుగుపెట్టని వాడు పిరికివాడు.

అడుగు పెట్టాక కూడా కనిపించని క్రూరమృగం కోసం భయంతో జాగ్రత్తలు పాటించాలనుకునేవాడు ధైర్యవంతుడు.

జీవితమూ అంతే....

ఏదీ జరగకూడదని ఆలోచించేవాడు పిరికివాడైతే జరగక తప్పదన్న ఆలోచనలతో భయంకరమైన పరిస్థితుల్లోనూ ముందుకు సాగగలిగే వాడు ధైర్యవంతుడు."

"ఇప్పుడు జరిగిన సంఘటన నైతిక విలువలకి సంబంధించింది."

"నైతికమన్నది వ్యక్తిగతమా లేక సంఘానికి సంబంధించిందో చెప్పగలవా...."

"వ్యక్తిగతమే...."

"మరి వ్యక్తి కూడా సంఘంలో భాగమైనపుడు నైతిక విలువలు సంఘానికీ అవసరమేగా...."

ఆమె తర్కం అర్థం కాలేదు.

"నీలాంటి వ్యక్తుల మీమాంసలు నా మెదడుకి అంటనివి ప్రమీలా. కాబట్టే నీతో చర్చించలేను."

"అలా తప్పించుకోకు శ్రీహర్షా....ఈ ప్రపంచంలో మనిషి మనసుని కొలిచే సాధనమే వుంటే మనం ఆమోదించిన మహాత్ములు సైతం నేరస్థులుగా కనిపిస్తారు.

అలాంటి పరికరాన్ని కనుక్కోలేకపోవడమే సంఘానికి సైన్సు చేసిన మహోపకారం.

నిజం శ్రీహర్షా....కనిపించేదంతా నిజం కాదని చెప్పే యీ సంఘంలో నిలబడి నిర్ణయ చేసిందానికి ఎందుకంత కుమిలిపోతావు."

"నేను కుమిలిపోతున్నది నిర్ణయ చేసిందానికి కాదు."

"మరి"

ఆమె నాకు దూరమైనందుకు"

"దూరమైంది ఏదో చేరాకనేగా. అలాంటప్పుడు ఎందుకిలా చేసింది అన్న బాధ కూడా నీ ఆలోచనల్లో భాగమేగా."

"వద్దు. మనం ఇప్పుడా విషయం మాట్లాడుకోవద్దు."

బాధ, విస్మయం, నిస్సహాయత, నిస్త్రాణ ఇన్నెన్నింత కలవరపరుస్తున్నదీ అర్థమైన ప్రమీల ఆధ్యాత్మికంగా అంది శ్రీహర్షని చూస్తూ.

"కుండలోని నీరు ఆకాశంలోని చందమామని ప్రతిబింబింప చేస్తుంది శ్రీహర్షా. కానీ ఆ కుండ పగిలితే నీరు నేలలో ఇంకిపోతుంది.

చందమామ రూపమూ అదృశ్యమై పోతుంది. జీవితమూ అంతే.... గుండె పగిలేక కొన్ని ప్రతిబింబాలు కడతేరిపోవాలి. లేనినాడు మనకు మిగిలేది విషాదమే...."

దేన్ని ఉద్దేశించి ఆమె యిలా మాట్లాడిందో అర్థమైంది.

"నేను మానసికంగా బలహీనుడైన వ్యక్తిని ప్రమీలా....నిర్ణయని మరిచి బ్రతకలేను."

"మరణంతో తప్ప మనసు మనకు స్వాధీనం కాదని నేనూ అంగీకరిస్తాను శ్రీహర్షా.

కాని మనసుని సమస్యలకి ఆహారంగా మార్చవద్దంటున్నాను. మనలోని ఆలోచనల వెల్లువ ఉధృతం అయినంత కాలం మనసు మనపై స్వారీ చేస్తూనే వుంటుంది.

నేను మనిషిని కానూ అనకు....కానక్కర్లేదు. నీ చుట్టూ వున్న మనుషుల్లో ఒకడివికా....అలా అందరికీ భిన్నంగా కాకుండా అందరితో పాటూ బ్రతకటానికి ప్రయత్నించు."

"సాధ్యం కావడంలేదు ప్రమీలా. బహుశా నిర్ణయని చూసేదాకా యిక సాధ్యంకాదేమో" ఉద్వేగంగా చెప్పుకుపోయాడు.

"నిర్ణయ తప్పు చేసిందా లేదా అన్న సమస్య గురించి నేను ఆలో చించడంలేదు ప్రమీలా. నా కోసం నా యింటికి వచ్చిన నిర్ణయ యిప్పుడు దేనికోసం బయటికి వెళ్ళినాగానీ యిప్పుడెలా వుందో చూడాలనుంది.

ఎందుకిలా అనిపిస్తూందో నాకూ తెలీదు.

కాని చూసి తీరాలి.

అంతవరకూ నాకు మనశ్శాంతి వుండదు."

"తప్పదా శ్రీహర్షా"

అప్రతిభుడిలా చూశాడు.

"నిర్ణయని చూస్తే ఊరట పొందగలవా" ఆమె ఏ స్థితిలో వున్నా చూసి తట్టుకోగలవా...."

"అంటే నీకు...."

"తెలుసు నిర్ణయ ఎక్కడున్నదీ...."

దూరంగా ఎక్కడో పిడుగుపడినట్టు భూమి దద్దరిల్లింది.

"నేను కలుసుకునే అవకాశం కావాలి."

"కేవలం ఒకే ఒక్కసారి. అంతేగా"

ఎన్ని స్వప్నాల్ని మధిస్తే రెండు బాష్పాలవుతాయోగాని యిప్పుడు శ్రీహర్ష నేత్రాలు అశ్రుశిక్తమై ప్రమీల మనసుని ద్రవింప చేశాయి.

"నిజానికి ఆమెను కలుసుకోవడం ఆమె సైతం యిష్టపడనిదైనా నీ కోసం నిర్ణయని అర్థిస్తాను శ్రీహర్షా...."

కృతజ్ఞతగా ప్రమీల చేతుల్ని పట్టుకున్నాడు.

అంతకన్నా ఆనందాన్ని వ్యక్తం చేయడం చేతకాని మనిషి మరి.

* * * *

అసుర సంధ్యా సమయం....

సరుగుడు చెట్ల నీడన పచ్చని ప్రకృతిలా విస్తరించిన ఆశ్రమం సంజె మెరుపులో ప్రశాంతతని చిమ్ముతూంది.

సమీపంలోని బంగాళాఖాతపు తరంగాలు సైకతాల స్నిగ్ధ కపోతాల్ని ముద్దిడుతూ తిరిగి వెనక్కి వెళుతున్నాయి.

కైలాస హిమగళం నుంచి జాలువారిన శాంతి సందేశాల్లా ఆశ్రమం లోని పాదుల మధ్య కదులుతున్నారు యువతులు కొందరు.

సంకుచిత ప్రపంచం నుంచి దూరంగా జరిగి కాషాయ వస్త్రాలతో విధిదష్టమైన జీవితాల నుంచి విముక్తియైనట్టు అక్కడ కదిలే స్త్రీలలో అసాధారణమైన ప్రశాంతత.

నిన్న మొన్నటి స్వప్నాల మిథ్యా జీవనం నుంచి మరో జన్మెత్తినట్టు పూదోటలోని పూలను సజ్జలలో నింపి పర్ణశాలవేపు నడుస్తున్నారు యువతులంతా.

పర్ణశాల వెనుకగదిలో నేలపై బాసింపట్టు వేసుక్కూచున్న తొంభై యేళ్ళ చైతన్యానంద మునిమాపువేళ వెలుగుతున్న దీపంలా వున్నారు.

ఆ వృద్ధునిలోని దివ్యత్వం ప్రకృత్యాన్పాట జుంజూ మరుత్తులపై గెలుపులా వుంది.

వెండి మబ్బుల్లా అనిపించే జుట్టు దుషత్యానికి గీటురాయిలా అనిపి

స్తుంటే ఆయన పెదవుల నుంచి ఆ జాలువారుతున్న ఉపనిషత్ సారం విశ్వ శిలను చీల్చి మనుషుల్లో నింపే ప్రాణ యుక్తిలా వినిపిస్తూంది.

"దీపంతో చీకటిని తెలుసు కోవడమూ. పాపంతో జీవితనై జాన్ని గ్రహించడమూ ఒకటే....పాపుల్ని కాదు ద్వేషించాల్సింది పాపాన్ని.

దేవాలయంలోని దీపం దేవుని రూపాన్ని సాక్షాత్కరింప చేయడమే కాదు దేవుడి బందిఖానాని స్ఫురింపచేస్తుంది....

వచనం ఏదన్నా కాని నిర్వచనం మాత్రం వ్యక్తుల దృష్టిని బట్టి వుంటుంది. ఆ దృష్టి మనిషి మనసునిబట్టి సారించబడుతుంది....ఇదే విశ్వ జనీనమైన సిద్ధాంతం. సత్యం."

పదెకరాల నేలపై ప్రపంచ సత్యాలను విదితం చేసే విరామమెరుగని ఆరామంలో నడుస్తూ పర్ణశాల నుంచి బయటకు వచ్చిన ప్రమీల ఓ మూల చెట్టు దిగువన నిలబడ్డ శ్రీహర్షని చేరుకుంది.

"ప్రాపంచిక బంధాలకి అతీతులైన వారికి మాత్రమే యిక్కడ స్థానం లభించేదని చెబుతూ కూడా స్వామీజీ నీకు అనుమతినిచ్చారు శ్రీహర్షా.... నిజానికి నిన్ను కలుసుకోవటానికి నిర్ణయ యిష్టపడటం లేదు. అయినా స్వామీజీయే ఆమెనూ ఒప్పించారు....అదిగో ...." చూపించింది ఈశాన్య దిక్కులోవున్న ఓ కుటీరాన్ని.

"నిర్ణయ నీ కోసం అక్కడ వెయిట్ చేస్తూ వుంటుంది. వెళ్ళు.... మరోవిషయం నీకు మాట్లాడే అవకాశం యివ్వబడింది కేవలం పదిహేను నిమిషాలు మాత్రమే...."

శ్రీహర్ష కదిలాడు స్వప్నంలోలా....

ఆ నిశ్శబ్ద నీరవ వాతావరణంలో స్వామీజీ కంఠం గాలి అలలతో కదిలి కదిలి ప్రణవనాదంలా వినిపిస్తోంది.

"అజ్ఞానాంధకారంలో అలమటిస్తూ కష్టాల కడలిలో మునిగిపోతున్న మానవ జీవన నౌకకు వెలుగు బాటను చూపి దరికి చేర్చే కాంతి సూచికలే మహాత్ములు."

మనిషికి కావాల్సింది బాహ్య ప్రదర్శన కాదు. అంతరంగిక పరిణామం. తీర్థయాత్రలు చేయాలనుకున్న కొందరు భక్తులు సంత్ తుకారాం దగ్గరికి వచ్చి తమతో రమ్మని అడిగారు .... పేదవాడైన తుకారాం అంత స్తోమత తనకు లేదని తెలియ చెప్పి ఆ భక్తులకి ఓ చేదు దోసకాయ ఇచ్చాడు.

ఆ భక్తులంతా స్నానం చేసే పుణ్య నదుల్లో దోసకాయని ముంచి తిరిగి తీసుకురమ్మని అర్థించాడు....అలానే చేశారు భక్తులంతా....

తీర్థయాత్రలు ముగిశాక తుకారాంకి దోసకాయని తిరిగి ఇచ్చి వెళ్ళిపోతుండగా తనయింటిలో ఆతిథ్యం స్వీకరించమని వేడుకున్నాడు తుకారాం. అంతా అంగీకరించారు. రుచికరమైన పదార్థాలతో బాటు తీర్థయాత్రలనుండి తిరిగి తీసుకువచ్చిన దోసకాయతో పులుసు చేసి వడ్డించాడు. అది చాలా చేదుగా వుండటంతో...

"ఇదేమిటి ఇంత చేదుగా వుంది" అనగానే ఆ భక్తులకి నమస్కరించాడు అభ్యాగతి అయిన తుకారాం. మహానుభావుల్లారా....మీ కిచ్చినపుడు

చేదుగావున్న దోసకాయ మీతోబాటు పుణ్యనదుల్లో స్నానమాచినపుడు చేదు నశిస్తుందని భ్రమపడ్డాను అన్నాడట. అంతే....

ఆ భక్తులకి జ్ఞానోదయమైంది....మార్పు రావాల్సింది మనసుకో.... ప్రదేశంలో కాదు...."

శ్రావ్యంగా గంభీరంగా వినిపిస్తున్న ఆ వాక్యాలను మననం చేసుకుంటూ ప్రమీల చెప్పిన కుటీరంలో అడుగు పెట్టాడు శ్రీహర్ష......

కుటీరంలో చిన్న దీపం....

దీపానికి అభిముఖంగా నేలపై కూర్చుని వుంది నిర్జయ.

కాషాయపురంగు చీరలో నుదుటి బొట్టుసైతం లేకుండా కనిపించింది నిర్జయ.... అయినా ఆమె రూపం సూర్యోదయంతో వికసించే రంగుల పుష్ప పంక్తిలా వుంది.

అణువంత నిర్వేదం కనిపిస్తున్నా ఆమె నేత్రాల వేదాగ్ని గుండంలో పునీతమైన ముత్యాల్లా అనిపిస్తున్నాయి.

ఆమె తల తిప్పుకోలేదు..

రెప్పలార్చకుండా చూస్తూంది శ్రీహర్షని...

శ్రీహర్ష గుండె కలుక్కుమంది. శరీరం కంపిస్తూంది...

ఇలా కాదు నిర్జయలో మరేదో ఆశించా:.

తనను చూడగానే అలవిమాలిన ఆనందాన్ని ఆమె ప్రకటిస్తుందనుకున్నాడు.

కాని... ఇదేమిటి?

చాలాసేపటి నిశ్శబ్దం తర్వాత అన్నాడు. "నిర్ణయా..."

ఇంకా అలాగే చూస్తూందామె.

"ఎందుకిలాంటి నిర్ణయం తీసుకున్నావ్....నేనేం కావాలని."

ఆమె మౌనం మనసుని దారుణంగా గాయపరుస్తుంటే బాధగా నేలపై కూర్చున్నాడు.

"ఈ వయసులో జీవితాన్ని ఈ మార్గానికెందుకు మళ్ళించావ్. నాకు జవాబు కావాలి నిర్ణయా..."

శ్రీహర్ష నేత్రాలనుంచి జారిన నీటిబొట్లే ఆమెను కలవర పరిచాయో లేక తన మనసే ఆరడి పెట్టి అలజడి రేపిందో నెమ్మదిగా అంది.

"ఎందుకిలా వచ్చారు?"

"నిన్ను తీసుకు వెళ్ళాలని."

"ఎక్కడికి?"

"నా యింటికి."

"నా యిల్లు కాదుగా?"

"నువ్వు కాదంటే తప్ప కావాలంటే అది నీ యిల్లే."

నిట్టూర్పుగా ఆగింది.

అలసటగా కళ్ళు మూసుకుంది.

"ఒకప్పుడు అది నా యిల్లే. కాని నేను ఆ యింటి గడపదాటాను. విషయ వాంఛలతో వెర్రిదానై పతనమయ్యాను."

"నువ్వలా కావటానికి నా అసమర్థతే కారణంగా."

"ఎందుకు మిమ్మల్ని మీరలా తక్కువ చేసుకుంటారు. నా పతనానికి మీ ప్రమేయమేముందని" నిర్లిప్తంగా అంది నిర్ణయ.

"మీరొక మహర్షి శ్రీహర్షా. ఏ పాపం మీకు అంటదు. అంట కూడదు....మిమ్మల్ని మీరు సంస్కరించుకోవాల్సిన అగత్యం లేదు. ఆ అవసరం ఉన్నది నాకు....అందుకే యిలా వచ్చాను."

"ఎంత కాలం?"

"పోయేదాకా."

ఉలికిపాటుగా చూశాడు.

"నేనొక కాలిపోయిన కాష్టాన్ని శ్రీహర్షా....ఇంకా నాలో నిన్నటి రూపాన్ని వూహించుకోకండి ఈ చితా భస్మంతో స్నేహం కోసం ఆలోచించకండి."

"ని....ర్ణ....యా...."

దిగులుగా గుబులుగా వుంది. ఏ నిర్ణయ రాకతో జీవితమొక ఇంద్ర ధనుస్సుగా మారినట్టు పులకించిపోయాడో ఏ ప్రియసఖి సన్నిధిలో సరదాల ఆగరువత్తుల సుగంధంతో ఒక జీవిత కాలాన్ని గడిపేయాలనుకున్నాడో.... ఆ నిర్ణయ యిక శాశ్వతంగా తనకు దూరమౌతోందా?

అదికాదు.

హిమస్నాత మాలతీ లతలా కదలాల్సిన వయసులో వినీల శిరో జతమస్య ముద్రాలతో ఉక్కిరిబిక్కిరిచేస్తూ ఏడు జన్మల దాకా కదలాల్సిన యవ్వనంలో ఎంత దారి తప్పితేనేం యింత ఘోరమైన నిర్ణయం తీసుకుందేం.

"లేదు నిర్ణయా.... నువ్విలాంటి నిర్ణయం తీసుకోవడం నేను సహించలేను....వచ్చెయ్...." ఆమెను ఎలా ఒప్పించాలో తోచడంలేదు. "నా కోసం కాకపోయినా నీ కోసం....మిగిలిన నీ జీవితం కోసం."

"అసంభవం శ్రీహర్షా....యింకా ఏం మిగిలావని. మిగిలిన జీవితం అనగలుగుతున్నారు....మిగిలింది మిగలనిదే శ్రీహర్షా నన్నిలా కడతేరిపోనివ్వండి."

"నిర్ణయా!" ఉద్వేగ్నంగా ఆమె చేతుల్ని పట్టుకున్నాడు. ఓ నీటి బొట్టు ఆమె మోచేతిపై పడింది.

"నీ జీవితం యిలా కావటానికి ఆనాడు నా పరిచయమే కారణమన్న బాధతో నేను బ్రతకలేను."

ఆమె కళ్ళు నీటి కుండలయ్యాయి.

ఇదేమిటీ?

ఇన్ని రోజులుగా ఘనీభవించిన మనసు యిలా కరిగిపోతోందేం. సుఖమనే లాలసత్వం నుంచి అఖండ సచ్చిదానందంకోసం అన్వేషిస్తూ యిలా సాగిపోతుంటే మనసు బాష్పాలేం కళ్ళను ముళ్ళుగా మారుస్తున్నాయి.

శిలనయ్యానుకుంటే యింకా లోపల నీవున్నాయని గుర్తుచేస్తూ ఈ మనిషేం యింత కదిలిస్తున్నాడు.

ఓడిపోతూందా!

మృదువుగా అతడి చేతుల్ని విడిపించుకుంది.

"ఏమివ్వానని మీకింత లాలసత్వం....శారీరక సుఖమే అయితే అది మీతో బాటు మరో మగాడికీ అందింపానుగా."

ఆమె పెదవులు ఏహ్యభావంతో అదిరిపోతున్నాయి.

"అసలు ఏముంది నా దేహంలో....కోరికల దాహంతో కదిలిన నేను ఎంత నలిగిందీ క్షణక్షణమూ మీకు గుర్తు చేయడం తప్ప యింకా నేను మీకేమివ్వగలనని. వెళ్ళిపోండి శ్రీహర్షా.

మీ ముందున్న అనంతమైన జీవితంలోకి మీకు నచ్చిన మరో యువతితో సుఖంగా సాగిపోండి "

వచ్చిన పనైనట్టు యిచ్చిన గడువు లేనట్టు ఆమె కుటీరంలోనుంచి కదిలింది.

"నిర్జయా."

దీనంగా పిలిచాడు.

దారుణంగా స్పందిస్తూ ఆమెకు అడ్డం రాబోయాడు.

వెళ్ళిపోయింది నిర్జయ.

కాదు చీకటి పర్ణశాలలో అదృశ్యమైపోయింది.

ఇక ఎన్నటికీ కనిపించనంత దూరానికి సాగినట్టు యీ జన్మకిదే ఆఖరి కలయికన్నట్టు కలలా కరిగిపోయింది.

నీళ్ళు నిండిన కళ్ళతో నిలబడ్డ శ్రీహర్ష భుజంపై చేయి పడగానే వెనక్కి తిరిగాడు.

ప్రమీల నిలబడి వుంది.

మనసు ద్రవించింది.

నిర్ణయ యిల్లు విడిచి వెళ్తూ శ్రీహర్షని తనకు అప్పచెబితే అతడి బాధను చూడలేక పోయింది. గోప్యంగా వుంచాల్సిన నిర్ణయ ఉనికిని తెలియచేసి యిలా తీసుకువచ్చింది.

"వెళదామా?"

జీవితపు చివరి మజిలీకేసి నడిపించాలన్నంత ఉద్వేగ్నత.

ప్రస్తిక్తందులా వున్నాడు.

చేజారిన ఏ పెన్నిధికోసమో వెదుకుతున్న బాటసారిలా అనిపిస్తున్నాడు.

కదిలారు యిద్దరూ.

"అందరూ నిద్రపోతున్నారు.....
నేను మాత్రం....
తలుపు తెరిచి యిల్లు విడిచి....
ఎక్కడికో దూరంగా....
కొండదాటి కోనదాటి....
వెన్నెల మైదానంలోకి....
వెళ్ళి విలుచున్నాను"

చీకటిలో వెలుగని దీపంలా ఓ చెట్టు మాటున నిలబడ్డ నిర్ణయ కలిసి వెళ్తున్న శ్రీహర్ష, ప్రమీలల్ని చూస్తూ నిర్వేదంగా గుర్తు చేసుకుంది. ఎప్పుడో చదివిన తిలక్ కవితని.

జీవితమిదీ....

దారితప్పిన వాళ్ళకు మిగిలేది రహస్యంగా రహదారిని గమనించడమే తప్ప నిర్భయంగా దారిలో నడవగలగటం కాదు....పతనానికి, పవిత్రతకి మధ్య చిన్న సరళరేఖ ఆ రహదారే....

—: అయిపోయింది :—